# గేరట్సన్ చరిత్ర

[ నవల ]


రచయిత

గెరాల్డ్ వార్నర్ బ్రేస్

అనువాదకుడు

యు. వేంకట రంగాచార్యులు



ప్రకాశకులు :

శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో,

నెం. 10, నరసింగపురం వీధి,

మౌంట్‌రోడ్, : : మదరాసు-2.

First Edition
1000 Copies.

# THE GARRETSON CHRONICLE







**Price Rs. 1-25 nP.**




Printed at
S. P. PRESS,
Tirupati

# మనవి

---

ఈ నవల ప్రసిద్ధుడగు అమెరికా దేశస్థునిచే వ్రాయబడినది. ఈ కథ అమెరికా దేశమందున్న 'గారట్సన్' అను కుటుంబములోని తాత-కుమారుడు-మనుముల కథ. వారు అమెరికా దేశమందు ప్రసిద్ధిచెందినవారు. ఇది అమెరికా దేశీయ చరిత్రయైనను, దీనివలన మనము గ్రహింపదగు విషయములు పెక్కులు గలవు. కష్టము లనుభవించుట, ఉద్యోగ ప్రయత్నము, చెరశాల జీవనము, నాటకరంగము, దేశాటనము-అనునవి అనుభవసిద్ధముగ వ్రాయబడినవి. ఇది కల్పితము గాదు. నిజముగ జరిగిన కథ. ఇది చదువుట వలన, ఓర్పు. పట్టుదల, కళాభిరతి, కృషి-అనునవి యెఱుగ నగును. ఇంతియగాక స్వతంత్ర జీవనము చేయుటకై చేసిన రాల్ఫ్ గారట్సన్ కృషి గమనార్హము. ఇట్టి యుత్తమ చరిత్రను ముద్రించి ఆంధ్రలోకమునకు అందజేయ అనుమతిచ్చిన గ్రంథకర్తను, తత్ప్రచురణకర్తలను ఎంతయు కృతజ్ఞులము.

ఇట్లు,

శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో.,

# 1. అధ్యాయము

నా తాత 'కామ్‌టన్'లో ఒక యిల్లు కొన్నాడు. ఆ కొనడంలో ఒక ప్రత్యేకతకూడా వున్నది. అతడు ఎప్పుడూ ఏవో నవలలు, వ్యాసాలు వ్రాస్తుండే వాడు. కానీ, ఆ ఆదాయంతో నవీన పద్ధతిలో తాననుకొన్న విధంగా యిల్లు కొనలేక పోయినాడు. అతను కొన్నదల్లా ప్రాతకాలం నాటిదీ, శిథిలమై నలుచదరంగా నున్న, సాధారణమైన యిల్లు. కాని ఆ యిల్లే రాను రాను ఆ గ్రామానికంతా చక్కని రాజభవనంగా తయారయింది. అక్కడుండే బంగారంలాంటి కలప సామాను, ఆ యింటి గోపురము, తన సాహిత్యానికి ఉపయోగిస్తుందని తలచుకొన్నాడు తాతయ్య.

నల్లటి దుస్తులతో, పొడుగ్గా, పెద్ద గడ్డంతో చేతులు వెనుకకు కట్టుకొని నిప్పుకుంపటి దగ్గరగా నిలుస్తుండే వాడు తాతయ్య. వెనుక వైపున కోటు అంచులను రెండు చేతులతో పైకీ; క్రిందికి లాగుకుంటూ, తన సంగతులను కథలుగా చెప్పే వాడు. ఆ నాటి తాతయ్య మాటలు రెండు మాత్రము నా కిప్పటికి చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. "నేను అతనితో అప్పుడే మన్నానంటే!" (నేను అని ఒత్తి పలికి, తక్కినవి తేల్చి పలుకుతూ, విషయానికి తగినట్లుగా తల ఆడిస్తూ పొంకగా పలికే వాడు) రెండవది, కడపటి మాట, అదే. "బాగుంది; అయినా హి...హి..." (అని చాల చిన్నబుచ్చేవాడు.)

అతని గడ్డము అందటి దాడీలవలె గాక, దేవలోకాం నుంచి దిగి వచ్చినట్లుగా, వంకులుగాంకులుగా తిరిగి, మెడపట్టి, (పై) మీదుగా వచ్చి, అతన్ని లోకోత్తరవ్యక్తిగా చేస్తున్నట్లు కనుపించేది. నిజంగా అట్లాంటి గడ్డమే తాతయ్యను అంతటి పెద్దవాణ్ణిగా చేసిందని నా యూహ.

నన్ను నిర్బంధాలు లేకుండా, ధారాళంగా స్వేచ్ఛగా గొప్ప తరగతి (తాహతు)లో నుండేటట్టుగా పెంచారు. 'గారెట్సన్స్, రాండల్స్, బాయిల్స్టన్స్', అనే మా వాళ్లందరు రాజవంశస్థులు. అంటే—విద్వాంసులు, చర్చీలలో పాదరీలు, భూస్వాములు—అన్నమాట మెసాచ్యూసెట్సులో.

మా తాతయ్య తండ్రికి 'కామ్టన్' జన్మస్థానం అవటం చేతను, 'కన్కాడ్' తరువాత సాహిత్యానికి ముఖ్యమైన ప్రదేశం అవటం చేతను, మా తాతయ్య అక్కడికి వచ్చి చేరాడు. పెద్ద చరిత్రకారు డగు 'థియోడర్ బ్రాటల్' మా యింటికి రెండిండ్ల అవతల వుండేవాడు. మా తాతయ్యకు ముఖ్య స్నేహితుడు... కాని ఇది నాకు తెలియకముందు జరిగింది. కార్వర్ హోలిస్—అతని ఆ వ్రాళ్ళో 'ప్లాటో' అని పిలిచేవారు; గారట్సన్తో సంబంధం లేకపోయినా, 'కామ్టన్'కు పెద్దపేరు తెచ్చాడు. ఇంకను ఇతరులు కూడా వున్నారు; నాన్న వారిని గురించి కొన్ని సందర్భాలలో చెప్పుచుండేవాడు.

'హారియట్ సండర్లాండ్' 'విలేజ్ రుమాన్స్—అను న్యూ ఇంగ్లాండు చరిత్రలో కామ్టన్ గూర్చి చెప్పేవాడట ! 'హెన్రీ లివింగ్స్టన్ మెయో' హార్వర్డ్నుండి కామ్టన్కు వచ్చి మిక్కిలి పాటుపడ్డాడట! 'చార్లెస్ ఎడ్వర్డ్ మెయో'

గొప్ప కవి...తనకు తెలియకుండగనే మాటల ధోరణిలో, “చంద్రులనాటి గడ్డముతో చార్లెస్ ఎడ్వర్డ్స్ తాతయ్య! హేతుహైన చక్కని హారియట్ సంకెలాంగ్! ఉత్తర అమెరికా పక్షులగూర్చి పద్యకావ్యము వ్రాసిన ‘కసిన్ ఫ్రాన్‌క్లిన్‌గ్రే’ అని వాగేవాడట!

## 2. అధ్యాయము

‘హామ్టన్’లో గారట్సన్ పిల్లలము మేము. ముగ్గురము, మా కిష్టము వచ్చిన వారితో ఆడుకొనేవారము. నా అక్కయ్య ‘జీన్’ నా కంటె మూడేండ్లు పెద్దది; త్వరలో పెరిగింది. పొడుగ్గా పెరిగినా,—మా పెద్దమ్మ “ఒళ్లు కనిపిస్తున్నదే? ఆడుకోవద్దే” అని చెప్పేంతవరకు మాతో బాటు మగపిల్లలతో ఆడుతుండేది. నా తమ్ముడు “స్టీవ్” నాకంటె పద్నాలుగు నెలలు చిన్నవాడు; చిన్నప్పటి నుండి నాతో కూడనే తిరిగేవాడు. నిజానికేమంటే తాతయ్య యొక్క నిర్బంధమైన కట్టుబాట్లకు, మా సవతి తల్లి యొక్క భయంకరమైన బెదిరింపులకు, మేము ముగ్గురము కలిసి లొంగకుండ, తప్పించుకొని తిరుగుతుండే వారము.

హామ్టన్‌లో మాకు ముఖ్య స్నేహితులు ముగ్గురు—టామ్, డిక్, జెర్రీ మాడిగన్—అనే ముగ్గురన్నదమ్ములు. వారు రైలురోడ్డు దాటగానే, రెండు ఫర్లాంగుల దూరంలో — ఒక గుఱ్ఱపు సావడిలో వుండేవాళ్లు. మా తాతయ్య అనుకొన్నట్లుగా “మిస్టర్ మాడిగన్” జట్కా బండి వాని (కోచ్ మెన్) వలెనే యుండేవాడు.—ఆ మాటకొస్తే—మా కొక గుఱ్ఱము,

బండి యుండేది పూర్వం. అప్పుడు "పట్రిక్ మాడిగన్" చదర
రపు కుళ్లాయి నెత్తిన పెట్టుకొని ఆ బండి తోలేవాడు.

నేను సగమ్ కాలం "మాడిగన్ల"తోనే ఉండేవాడను. ఆ యిల్లు కంపుకొడుతుండేది; వాటి యిల్లు కుప్పదొడ్డిమాదిరి యుండేది; సడవ బూజు, దుమ్ము, పాత డబ్బాలు - వీనితో నిండియుండేది. అట్లా వున్నా "ఓడ దొంగవలె" ఆ చోట్లో ఒక్క పిల్లవాడైనా స్వేచ్ఛగా ఉండవచ్చు గదా! అని అనుకొనేవాణ్ని. "గుఱ్ఱాలు,-జట్లు-పోలిస్ - ఐలిష్ - యాంకి - కుస్తీలు - పందాలు-బాతి ఆటలు-ఇట్లాంటివి ఎక్కడబడితే అక్కడ-ఎప్పుడు బడితే అప్పుడు జరుగుచుండేవి.-ఒక పిల్లవాడు...ఇటువంటి ఆటలు లేకపోతే-ఎట్లా తెలివిగలవాడవుతాడు?? నేను మాడిగన్ల ప్రదేశానికి పోకపోతే 'ఎలుగుగొడ్డు ముఖము, గోళ్లు-తాకితే కలిగే భయం నాకు తెలిసేదేకాదు; సగం త్రాగిన వానితో,-మూడు వంతులు త్రాగిన వానితో మాట్లాడే విధం తెలిసేదే కాదు,-పోట్లాడేటప్పుడు పలికే భయంకరమైన మాటల్లో నున్న నిజమెంతో, అబద్ధమెంతో తెలిసేద్దే కాదు. వీటి కన్నిటికంటె ముఖ్యంగా-సామాన్యపు జీవితపద్ధతి - నిత్యకృత్యాలు - ఒకేకీతి పనులు-విశ్రాంతి-భోజనము-మళ్లీ కృత్యాలు - విశ్రాంతి - భోజనము - ఇవి యే విధంగా జరుగుతవో? ప్రేమ-విరోధము-విహారము - ఆటలు మొదలైన దిన కృత్యాలు-నాకెట్లా యెఱుక పడుతవి? సాధారణంగా ఈ విషయాలన్నీ ఒకడు త్వరగానో, ఆలస్యంగానో, కొంచెము కొంచెముగానో, తెలిసికొంటాడేగాని, నేను

మాత్రము ప్రాథమికంగా—ఈ జ్ఞానాన్ని—గుఱ్ఱపు సావడి దగ్గఱ పొందాను.

అక్కడ ఇంకా ఎంత మందో పిల్లలున్నారు గాని, నేను మూడిగిన్లతోనే స్నేహంగా వున్నాను. 'మిసస్ మూడిగన్' వారి సంతతిని మంచి మార్గాలకు తీసికొని వచ్చేది. అంటే—వాళ్లు ఇంకా న్యాయమార్గంలో వాళ్లన్నమాట—నిజానికి వస్తే—నా కంటె, స్టీవ్ కంటె గూడ సన్మార్గంలో వుండే వాళ్లు. ఆవిడ ప్రతిరోజు సాధారణంగా, పిల్లలతో "నేను మిమ్మల్ని కొట్టవలసిన అవసరం వస్తే—మీరు మొట్టమొదట నిజం చెప్పి, పిమ్మట జరిగేదాన్ని అనుభవింపవలసిందే" అని చెప్పుతుండేది. కొన్ని సమయాల్లో బెదరించేది గూడాను. కానీ, సాధారణంగా నిజం చెప్పిన దానివల్ల వారికి శిక్ష యుండేది కాదు. మిసస్ మూడిగన్ తన ముప్పదవ సంవత్సరముననే చనిపోయింది. అప్పుడు "టామ్" కామన్ వెల్తు అవెన్యూలో ఒక పెద్ద మోటారు కంపెనీలో సేల్స్‌మెన్ (విక్రయదారుడు)గా నుండి బాగా సంపాదించాడు. "మిసస్ మూడిగన్"కు ఐరిష్ వారికి కలిగినంత గొప్పతనము కలిగింది. ఆవిడ డిక్కి—యొక్క అంతస్తుకు సంతోషించింది. డిక్ ఒక పండి తుడుగ, పెద్దవాడనిపించుకొన్నాడు. అంతకు ముందువారము "రిచర్డు మూడిగన్"కు "ఈస్టు రాక్స్‌బరీ హైస్కూలుకు ప్రిన్సిపాల్ పదవి దొరికింది. అతని తల్లి చచ్చి ఏ లోకంలోవుందో గాని, ఈ విషయం ప్రపంచమంతా ప్రాకించింది.

మా తాత చనిపోవునంతవరకు ఇంటికి పెత్తనదారుగా నున్నా, నా విషయంలో శ్రద్ధతీసికోనేలేదు. ఎవరైనా మమ్మ

లనుగురించి నేరములుచెప్పినయెడల, మాతాత "రాండల్"తో ఇట్లు చెప్పుచుండేవాడు. "రాండల్! ఈ పిల్లలందరూ కుక్కల మాదిరి తినియుండుటను చూచి నేను సహించలేను." "హేయ్! సరిగ్గా కూర్చొండి; నోరు మూసికొని నమిలి తినండి; నేను చెప్పింది అర్థమయిందా?"

ఆ!! సరి-

ఏయ్ రాల్ఫ్! నీ కర్థమయిందా?

"అయింది తాతయ్యా!"

పెద్దవారిలో సాధారణంగా-కొద్దిసేపు సంతోషం, మరి కొంచెము సేపు కోపం, ఇంక కొంచెం సేపు చీకాకు; శాంతము ఉంటూ ఉంటవి. "లూసీ!" నేను దాన్ని గురించి యోచించబోయే ముందు, హాలులో పెద్ద చప్పుడయింది. తాతయ్య భయంకరంగా పలికాడంటే, ఏదో వింత యున్నదన్నమాటే? "నీవు మార్కెట్టుకు వెళ్లావా? ఈ పిల్లలంతా యింతసేపు ఆమెట్లపై నుండి బాతులను (బాల్సు) దొర్లిస్తున్నారే? నీవు సంతోషిస్తున్నావా?"

"పొరబాటున బేస్ బాల్ పడ వేశాము" అని నేనన్నాను. "ఎన్నేండ్లయిందో! పని చేసేవేళల్లో శాంతంగా ఉందామనుకొన్నాను. కానీ ఇంతకు- బేస్ బాలుకూడ మెట్లపై నుండి పడవేశారు" అన్నాడు తాతయ్య.

మా సవతి తల్లి - మేం ముగ్గురము ఆవిణ్ణి 'మాటర్' అని పిలిచేవాళ్లం. ఆమె గంభీరంగా - సగర్వంగా మాట్లాడేది. "పిల్లల్లారా! నిజంగా-నిశ్శబ్దంగా వుండటానికి ప్రయత్నించండి.

నాన్నా! నాకు బాగా తెలుసు. అదేదో పొరబాటువల్ల జరిగింది. 'మెల్లగా చప్పరించు రాల్ఫ్' నేను చెప్పింది జ్ఞాపకముంచుకో"

"లూసీ! వాళ్లు చప్పరించడాన్ని గురించి చెప్ప లేదు. మెట్లు పైనుంచి బేస్ బాల్‌ను దొర్లించడాన్నిగూర్చి చెప్పటం. అదిగాక చదువుకొనే గదిదగ్గరగా వాళ్లు చేసేరచ్చ, అరుపుల్ని గురించే చెప్తున్నాను."

ఇప్పటికీ మా యింట్లో వాండ్లందరి పవిత్రాభిప్రాయం ఏమిటంటే? ప్రొద్దుటిపూట వ్రాతపనిచేస్తాడని. మా తాత కిప్పటి కించుమించు ఎనభై యేండ్లుంటవి. పన్రెండేండ్ల నుండి, పత్రికాధిపతులకు వ్రాసినజాబులు, "క్రైస్తవలోకము"నకు వ్రాసిన గ్రంథ విమర్శలు. మరిలా కవరులో జాగ్రత్త పెట్టిన పత్రికల్లోనుండి కత్తిరించినముక్కలు ఇవి తప్ప ఏ ఒక్కటిగూడ అచ్చువేయించింది లేదు. ఏది యెట్లున్నా "ప్రతిరోజూ ఉదయం నాలుగు గంటలసేపు వ్రాసేవాడు" అని అందరికి తెలిసిన విషయం. ఈగొప్ప సత్యానికి అతన్ని ఇంట్లో వాళ్ళేగాక, బయటవాళ్లు గూడ గౌరవించవలసిందే.

మాయిల్లు ఆసుపత్రిమాదిరి తయారయింది. పెద్దపెద్ద వ్యాపారస్తులు నిశ్శబ్దంగా ఇంటి వెనకవైపునుండే వారు. క్రొత్తవారుగూడ నిరాఘాటంగా వచ్చి కూర్చొని గుసగుసలాడేవారు. మొత్తంమీద బాగావినబడేవల్లా - చీదరింపులు, గాండ్రింపులు. నాకిప్పుడు జ్ఞాపకానికి వచ్చేది—బొగ్గులబండ్లను మధ్యాహ్నంమీద రమ్మని త్రిప్పగొట్టడం. మధ్యాహ్నంభోజన

మయినతర్వాత మూడున్నరగంటలకు పైననేగాని, ముందుగా విశ్రాంతి తీసికొనేవాడు గాడు తాతయ్య.

## 3. అధ్యాయము

తాతయ్య పిల్లలమైన మమ్మలని పెంచినపద్ధతి తప్పకుండా మాకు మంచిఫలితాన్ని ఇవ్వదగినదే. కానీ, నాకు తెలిసినపద్ధతికి ప్రతిఫలము నాకొక్కడికే తెలుసు. గడచిన వేసవిలో ఒక సంఘటన జరిగింది ... అతి సంతోషకరమైన వేసవి. నేనూహించి చెప్పేవిషయమూగాదు. అది సత్యంగా జరిగింది. బాల్యంలో హద్దులేని స్వేచ్ఛ. అవకాశం లభిస్తే బాల్యము పెద్దస్థాయి నందుకొంటుంది. ఆసమయంలోనే బాలుడు బహిరంగంగా మార్పుడగలుగుతాడు. జీవితం అతి త్వరితంగా మారిపోందుతుంది. ఆకాలంలోనే దైవజ్ఞానం కలుగుతుంది. మా పదకొండవపగోట ఆవేసవిలో మేము దేనికిభయపడలేదు నిశ్చయంగా. సుదీర్ఘమైనపగళ్లు మాయా (మ్యాజిక్) కంబళ్లలాగ ఒకటి తరువాత ఒకటిగ జరిగిపోయినవి. ఉదయభానుని కిరణాలు ఆనేలమీదబడి, వేడియెక్కి చల్లబడిపోయి, కమ్మనిచీకట్లు వ్యాపించేవరకు — బాల్యంనుండి హాయిగాగడిపే వాళ్లం. తక్కిన మా వాళ్ళందరూ అల్లే కాలం గడిపేవారు. మా కందరికీ ఐకమత్యతయుండేది. మేమంతాకలసి యీతకొట్టేవాళ్లం, బంతిఆట ఆడేవాళ్లం, తోటల్లో గడ్డిగుబురుల్లో ఆడుకొనేవాళ్లం; అడవిలో ఒకచిన్నగుడిసెకట్టుకొని, ఏకాభిప్రాయంతో, ఒద్దికతో పాటుపడ్డాము.

మూడువంతులు మేము ఇంటికి ముందువైపునా, ఎడమ వైపునా ఆడుకొనేవాళ్ళం. వచ్చే, పోయేవాళ్ళనుగూడ లెక్క చేయకుండా దారిలోనే ఆడుకొనేవారం. కారణం ఏమిటంటే? గడ్డికుప్పల్లోను, వంటయింటిముందూ మా ఆడుకోటానికి ఇష్ట పడకపోవటమే. ఇంటికి ఎడమతట్టు పెద్దగంగిరేణిచెట్టుంది. అది వీధిచివరినున్న ఎలమచెట్లంత పెద్దదిగా లేకపోయినా, మాను మాత్రం చాలావిశాలంగా ఉంది. ఆచెట్టు సందులనీడల్లో "జెర్రీ, ప్రిన్స్, పేట్, కుక్క, నేను" ఏమీ తోచక తిరుగు తుంటే—"టామ్, బిల్ కీని" అక్కడికి వచ్చారు. "మనమందరము ఈ చెట్టుపైన చిన్నయిల్లుకట్టుదామా" అన్నాడు టామ్.

ఈ గ్రామంలోకంతా ఇదే చాలాయేండ్లనాటి చెట్టు. నీకు తెలుసా?? ఇటువంటిచెట్టు కనబడుతుందా? నేను గమనించి చూస్తున్నా! ఇదో చూడు! అల్లా పెద్దకొమ్మలు చిన్న కొమ్మలు రెమ్మలు లేకుండా—దారికడ్డం లేకుండా వుండాలి. చిన్న నిచ్చెనతో పైకి ఎక్కేటట్లుగా ఉండాలి...తక్షణం మేమందరం ఇంట్లోనుంచి పదిహేను అడుగుల నిచ్చెన తెచ్చి, వేసి, కోతులకు మల్లె చెట్టెక్కి, "ఇక్కడ పలకలు పరవాలి, అక్కడ పక్క పలకలు పెట్టాలి; ఇదో ఇక్కడ కిటికీలుండాలి; అక్కణ్ణే తలుపులుండాలి" అని కేకలువేశాము. జెర్రీ ఇవన్నీ చూడటానికి చాలా మెత్తుకెక్కి ఏమ్ జరుగుతుందో, అని గమనిస్తున్నాడు. ఇంతలో ఏమీ నాకు తెలియకముందే 'టామ్, డిక్, బిల్కీని' ఇంటి వెనుక ఖాళీగా నున్న కొళ్ల కొట్టామునుంచి, పాతచెక్కలు, బల్లలు తీసికొస్తున్నారు.

ఈ పెద్ద సంరంభంలో తాతయ్య అక్కడ ప్రత్యక్షమైనాడు. అతడు-చేతులో బెత్తాం; గడ్డితో చేసిన హాటూ, తాను హాలోదాలో మెల్లగా నడుస్తూ వచ్చేసరికి, మేము తలకాయలెత్తి చూశాము.

"రాల్ఫ్! ఇదంతా ఏమిటి?"

"మేము చెట్టుమీద ఇల్లు కట్టున్నాం తాతా!"

"బుద్ధిలేని పని నాన్సెన్స్.! మీరు తెచ్చిన సామానన్నీ మళ్లీ సరిగ్గా వెనుకటి తావులలో మామూలుగా పెట్టేరండీ"

"హుం! పెట్తామ్ లే"

ఇంతవరకు అర్థం అయింది. జాగ్రత్త-భయంకరము-నిశ్శబ్దత-అధికారయుతమైన నిరాకరణ-విధేయత-ఇవి మామూలుగానే జరిగినవి. పెద్దవాండ్లకు ఎప్పుడు ఎదురు తిరుగలేదు. గారట్సన్ పెద్దలమాట సరే గదా!

"మళ్లీ వాటిని పెట్టేస్తాము. మామూలు తావులో వున్న రీతిగా పెట్టేస్తాం తాతా!" అని పెద్దగా చెప్పాడు టామ్. ఈ మాట వాడు వాళ్లమ్మతోటి మాటిమాటికి చెపుతుండేవాడు.

దురదృష్టవశాత్తు తాతయ్య దృష్టి బిల్కీని, డిక్ మూడి గన్నమీద పడింది.

"రాల్ఫ్! ఫిల్లైవరూ ?"

కానీ, స్వరం మాత్రం—"ఇదంతా ఏమిటి?" అన్నట్లుగా అనిపించింది.

"వాళ్లా! వాడు బిల్ కీని, డిక్. డిక్కెవరో నీకు తెలుసు గదా తాతా!"

అని చెప్పి తాతయ్య దృష్టితో నేను చూచాను. బిల్కీని బట్టలు—వాళ్ల నాన్న తొడిగి పారవేసిన పాతవి—అతుకుల బొంతలు; చెప్పులు నెర్రెలు పాటి చీలియున్నాయి; చొక్కా చేతుల దగ్గఱ బొందలు; నే నివివర కెప్పుడు అంత అధమంగా వున్న ఉడుపులను చూడలేదు. కానీ యింతకు ఆ గుడ్డలొక్కటేవాణ్ని ఆ స్థితికి తేలేదు; అతని నల్లటి గజుకుల మొగము, పలుచదనము, ఆకల్ని తెలిపే దైన్యము—

"బిల్!!...డిక్..."

ఆ స్వరము—నే నెప్పుడు ఊహించనట్లుగా తాతయ్యను మార్చేసింది. నా గుండెలు తటతట కొట్టుకొన్నాయి.

"ఆఁ...! బిల్కీని, డిక్కును ఎన్నోసార్లు చూశావు" అంటూ డిక్‌ను గూడా గమనించాను. డిక్కు టక్కరివాడని మా కందఱికీ తెలుసు. అతని గ్గూడా ఆ విషయం తెలుసు—కానీ, మేము దాని కొప్పుకొన్నాము. ఏది యెట్లా జరిగినా? అతడు మాలో ఒక్కడుగా, ఎప్పుడు ఉండేవాడు గూడా. కాని, ఇప్పు డున్నట్లుండి, ఆ టక్కరితనము చెడ్డ అలంకారంగా కావడం చూచాను. తాతయ్య గూడ దాన్ని గమనించే వుంటాడు. అప్పుడు డిక్ దానికి తగినట్లే నడవటం మొదలు పెట్టాడు. తాతయ్య దృష్టి అతన్ని తప్పించుకోడానికి ఏల్లేకుండా చేసింది.

"ఈ పలకలనన్నీ మళ్ళీ లోపలపెట్టి, వెంటనే మీరు ఇక్కడ నుంచి వెళ్లిపోండి. ఇల్లాంటి పిల్లలు ఇక్కడ ఆడుకో డానికి వీల్లేదు. ఏం తెలిసిందా!"

......నిశ్శబ్దం.

"మీకే చెప్పటం - అర్థంకాలేదా ?"

......నిశ్శబ్దం

"రాల్ఫ్! ..."

నా గొంతు పూడుకపోయింది. రాబోయే తైత్తుర్యానికి ఎదురు చూస్తూ నిలుచున్నా. టామే ఆ నిశ్శబ్దాన్ని విడగొట్టే శాడు.

"ఆఁ! సరేనండి. మేము దీన్నంతా సర్దుబాటుచేస్తాం లెండి. మీరేమి సందేహించ నక్కర్లేదు. ఏయ్ సిడ్! అందరూ అక్కడనుంచి దిగిరాండి"

కాని, తాతయ్య కోరచూపు మామీద పడింది. "రాల్ఫ్! మాడిగన్ల పిల్లలతోమాత్రం ఇక్కడనిన్ను ఆడుకో మన్నాను. అంతే, కానీ వీళ్లంతా ఎవరు? ఇతరులు...వీళ్లంతా ...ఇక్కడ వుండడానికి వీలులేదు" అని కొన్ని చెప్పకుండా చేతుల్తోనే చెప్పి ముగించాడు తాత.

"వాడు డిక్ మాడిగన్ తాతయ్యా! టామ్ తమ్ముడు"

తాతయ్య మళ్లీ డిక్కువైపుకు చూచాడు. నాప్లాను ఈ రోజును గడుపుతుందని ఒక్కక్షణంలో ఊహించాను. అది మొత్తానికి మంచియూహే. కాని మాయెదుట 'డిక్' పెద్దగా బీదరికంవల్ల గలిగేకష్టాలు, దైన్యం, నీచం, అప్రాశస్త్యం -

వీన్ని గురించి తన్ను తాను తిట్టుకొన్నాడు. తాతయ్య వెనక్కి తిరిగి వీధిగుమ్మం వైపుకు వెళ్ళాడు.

"రండి ! అందఱు రండి !"

"వీటినంతా లోపల పెడదాం" అని టామ్ కేకేశాడు. వెంటనే, వాడు, జెర్రీ సామానులన్నీ చేర్చిపెట్టారు.

నేను భయంతో 'బిల్కీని' ప్రక్క చూచాను—వాడిప్పుడే ముందుగా పోరాటానికి పూనుకుంటాడో? లేక, తరువాతే తగవులాడుతాడో?—అని ఊహిస్తూ, వాడి పిడికిటిపోట్లను తప్పించుకొనియేలా పోట్లాడాలా, అని నాలో నేను ప్లాన్లు వేస్తున్నాను. నేను 'బిల్'ను గూర్చి భయపడి ఎంతకైనాసరే ఎదిరించడానికి సిద్ధమయ్యాను. కాని, వాడు ఒక చక్క తీసుకొని ఆ ప్రోపుమీదికి విసరవేశాడు. "ఏదో, ముసలివాడి సణుగుడు—ఒరే! స్టీవ్ ! ఇదిగో ఆ చివర ఆలా పట్టుకో". స్టీవ్ ఆ పలక చివర పట్టుకోగానే దొడ్డివైపుకు వెళ్ళిపోయారు. ముసలివాని గొణుగుణ్ణి 'బిల్' లెక్క చేసేవాడుకాడు.

ముసలి తాత చేసినపని మంచిదే అయింది. తిరిగి తిరిగి ఇటువంటిచోటికి రావడం మందబుద్ధితక్కువ—అదృష్టవశాత్తుమానాన్న మమ్మల్ని ఇక్కడచూడలేదు. చూచాడంటే తోక కోసేసేవాడే? అనిటామ్ అన్నాడు."

జెర్రీ అసలు మళ్ళీ ఈ రోజువరకు ఆ విషయం మాట్లాడనేలేదు. సాధారణంగా వాడు అధికంగా మాట్లాడేవాడు గాడు. అయినా ! వాడూరుకొని యుండడం గమనించాను.

తరువాత ఒక నెలకు గాని మళ్లీ వాణ్ని ఆ చోటుకు తీసికొని రాలేక పోయినాము మేము.

'డిక్' మళ్లీ రానే లేదు. వాడి చూపు మెరుస్తూ, చులుగ్గా, శాంతంగా, కొద్ది వెలుగుతో నామీదపడ్డాయి. కాని వాడి మొగంలో విషపునవ్వుగాని (వంకర నవ్వుగాని) దానివల్ల బయలుదేరే భుజాల కుదిలింపుగాని, ఎటువంటి సైగలుగాని లేవు. కాని పైనబడి చంపేంతటి కోపాన్ని వాడిలో చూడగలిగాను. వాడు పామును చూచినట్లు చూచాడు. వాడు వెనక్కి చూస్తూ నడవదాటి వెడుతూంటే, టాంమ్‌గూడా వాణ్ని పిలవలేదు.

తాతయ్య మళ్లీ నాతో నా స్నేహితుల్ని గురించి హెచ్చరించలేదు. కాని, ఒక రోజు సాయంత్రం భోజనాల తర్వాత ఈ విషయాన్ని గురించి మాట్లాడుతుంటే విన్నాను. నేనప్పుడు నిద్రపోవడానికి మేడమీదికి పోతూ, నడవగుండా స్నానాలగదికి పోతున్నాను. తాతయ్య స్వరం గంభీరంగా అతనుండే గదిలోనుండి బయటకు వినబడింది. అంటే— ఆతడు వెనుక కోటుక్రిందిగా చేతులు పట్టుకొని, కుంపటి ముందర నిల్చుని మాట్లాడుతున్నాడని అర్థమయింది.

"బలేరచ్చ. పోకిరికుంకలు! నేను ఒక గీత గీయవలసి వచ్చింది. వాళ్లల్లో ఒకరో, ఇద్దరో గొప్పగా, బాగున్నారు అనడంలో సందేహం లేదు——ఇటువంటి విషయాల్లో మనం ఉపేక్ష చెయ్యగూడదు——కానీ, ఎక్కడో ఒకచోట గీటు గియ్యాలి (నియమించాలి) అని నిశ్చయించుకొన్నాను. అందువల్ల చిట్ట చివరికి వాండ్లతోనన్నాను—!!" నేను బహు

జాగ్రత్తగా విన్నాను. అంటే—ఈ గొడవంతా కాకపోతే. ఇంకా, ఎక్కువగా, లోతుగా, భయంకరంగా అవన్నీ మొదలయిందన్నమాట ; ఆ విషయం రాను రాను పెరుగుతూంది. నేను ఆ వృచ్చుల్లోనుండి తప్పించుకోలేను. మాటల ముగింపును తెలుపుతూ సంతృప్తితో నవ్వాడు తాతయ్య. అతని కడపటి మాటకై ఎదురు చూస్తున్నాను.

"బాగుంది—కానీ, వాళ్లంతా చాలాచిన్న బుచ్చుకొన్నారు."

## 4. అధ్యాయము

'రాండల్' అని మా నాన్నను మేము సంగ్రహంగా పిలిచేవారము. అతని తండ్రి అతన్ని చేతులారా పెంచాడు. అతని తల్లినిగూర్చి యెక్కువగా నేను చెప్పలేను. ఎందువల్లనంటె ఆవిడ ఎప్పుడో గతించింది. నేను తాతయ్య ఉత్తర క్రియలకు—అతని పేరు చెక్కినచలువరాతి సిలువలో—చివరి రోజుల్లో—ఏమిచెక్కబడక ఖాళీగా ఉంది. అతని పేరు క్రింద—అతని ప్రియురాలైన భార్యపేరు "బీట్రిస్ రాండల్ గారట్సన్—1839–1887" అని చూచి నిశ్చేష్టుడయినాను. చిన్న తనంలో ఆవిడ పియానో అద్భుతంగా వాయించేది. తన నాలుగవ కుమారుడు "బ్రాన్సన్" చనిపోవడంతో వాయించటం మాని వేసిందట.

ఆమె మరణము 'రాండల్ని' ఊహించ లేనంతరీతిగా మార్చివేసింది. అందఱు పోగా, మిగిలిన వాడొక్కడే అవడంచేత 'రాండల్' గొప్పగా భావింపబడ్డాడు. బ్రాన్సనే

గనుక బ్రతికియుంటే? తాతయ్య ఇంటి విషయాల్లో అంత పట్టింపు లేకుండా ఉండే వాడేమో? కానీ-అతని చావు, తన భార్య అస్వస్థత-అతన్ని గృహకృత్యాల్లో జాగ్రత్త వహించేటట్లుగా చేసినవి. 'రాండల్'ని చేతులారా పెంచ వలసిన అవసరము వచ్చిందని తలచాడు.

"లిడ్డీ" ఆడపిల్ల అవడంచేత ఏదో విధంగా పెంచ బడింది.

రాండల్ తన చిన్న వయస్సులో ఇంటిపట్టునే ఉండే వాడు. అతడు నా దృష్టిలో-స్వభావంలోను, ఆకారంలోను చాలా బలహీనంగా నుండేవాడు. తాతయ్య (అతని తండ్రి) విద్యావంతుడు కావడానికి కావలసిన ట్రైనింగ్ ఇచ్చాడు.

రాండల్ 'కామ్టన్'లో హైస్కూలుకు వెళ్లేవాడు. కాని, అతని తండ్రి యింట్లో-గ్రీక్, లాటిన్, క్రైస్తవమతాన్ని నేర్పేవాడు, విజ్ఞాన శాస్త్రాని కంతప్రాముఖ్యం ఇచ్చేవాడు గాడు. అతనికి పదహారవయేడు వచ్చి, 'హార్వర్డ్' గ్రామా నికివెళ్లే అర్హత యున్నప్పుడు 'ప్లేటో' సంభాషణలన్నీ చదివాడు. అతడు చిన్నవయస్సులో 'తానొకరచయిత' ననుకొనేవాడు. ఇది అతని పుస్తకంలో ఎవరైనా చూడవచ్చు. ఒక పెద్ద సాహిత్య సంఘాధ్యక్షుడు వ్రాసేవిధంగా, పేనా చేతబట్టుకొనే వాడు. ఎన్నో పద్యాలు, వ్యాసాలు, అసంపూర్తియైన ఒక నవల ఉన్నవి. అదే అతని జీవితసారము. కాలముయొక్క సాఫల్యము. అతడు వ్రాసిన కాగితాల రాశిలో-ప్రతివాక్యమూ అందం-చైతన్యం (జీవం)-మాధుర్యం. ఉట్టిపడుతూ అసభ్యాలు లేకుండా, ఆ గ్రామంలోని అంకురాల మారిదుదిధుమరాన్నిమ్మ

ఒలుకుతూ-కనీసము మూడు పద్యాలైన పత్రికల్లో ప్రచురింప బడకుండా లేవు. దాన్ని గురించి "ట్రాన్ స్క్రిప్ట్"లో విమర్శ నలు అగుపించాయి—అదే చాలు రాండల్ రచయితలస్థాయికి రావడానికి.

కామ్టన్‌లోని ఉన్నత పాఠశాల గారటన్స్‌లకు పనికి రాదని తలచబడింది. ఇంకా పెద్ద స్కూళ్లకు వెళ్లగలిగే అర్హత యున్న ఇతరులకు కూడా అంతే. 'థియోడర్ గారటన్స్' ఆంగ్లికన్ ప్రభువర్గమునకై ఎక్కువ అభిలాష చూపేవాడు. దానికి తగినట్లుగా తన పిల్లల్ని 'లింకన్ రెక్టరీ'కి ధీరులుగాను, కావ్యకర్తలుగాను, ఉత్తమాంగ్లేయులుగాను తర్ఫీజు కావటానికై పంపినాడు.

రాండల్ 1883 శరదృతువులో 'హార్వర్డు'కు వెళ్లి నప్పుడు అతని కచ్చుట సనుకూలముగా నుండెను. అంతవరకు అతన్ని నేను విచార యువకునిగా, దుర్బలునిగా, భీరువుగా తలచేవాడిని. హార్వర్డులో తన ఊహాజ్ఞానంవల్ల కలిగిన సంతోషాన్నేగాక, దాని అనుభవాలనుకూడ కనుగొన్నాడు. మందంగా జరుగుచున్న రెక్టరీ స్కూల్లో ఎవ్వరూ, ఎప్పుడూ కనీవినని రసానుభవాన్ని పొందాడు.

అప్పటికి రాండల్ రాజ్యతంత్రానికి, స్కాలర్ షిప్పు కును, కావలసిన అర్హతను సంపాదించాడు. అతడు నాతో- నా తండ్రి నన్ను న్యాయవాదిగా చేయదలచుకొన్నాడు. కానీ నేను సాహిత్యమునకు ప్రియపడ్డాను. హార్వర్డులోకూడ కృషి చేశాను? - అని అన్నాడు. అతని సాహిత్యం దిన దినానికి మృదు మధురమై చెవుల కింపు గల్గించింది. అతడు అంతటి

పరిశ్రమచేశాడు. "మనము దేని కోసరము బ్రతుకుతున్నాము? అనే ప్రశ్నకు 'ఆనందానికి' అని ఒకే మాట ఉత్తరం "అని నిష్కళంకమైన రత్నదీప్తి. ఒక సంవత్సరంపాటు నేను హామ్టన్‌ను, నాన్నను, గురువులను, అన్నీ విస్మరించి, నా తలంపు నకై 'ప్రాసర్రైన్' తోటలో చిరకాలం వసించటానికి వెళ్లాను" అన్నాడు నాన్న. రాండల్ 1887-లో పట్టభద్రుడైనాడు. పెద్ద క్లాస్ రాకపోయినా, ఎంతో గౌరవాన్ని, ఆదరాన్ని పొందాడు. పశ్చిమ 'మెసాచూసెట్స్'లో ఒక అకాడమినుండివచ్చిన ఆహ్వానాన్ని తన చోటుకు దూరమని నిరాకరించాడు. ఆ విషయంలో నిర్బంధమేమి కలుగలేదు. 80 వ సంవత్సరం ఇటువంటి గొప్పవానికై లోకం నిరీక్షిస్తున్నది. అతడు తన ముఖ్యస్నేహితులు—లివింగ్‌స్టన్ మెయో, ఛార్లీ ఐవ్స్,-లతో విదేశ ప్రయాణం చేశాడు. అదే అతని జీవితంలో ప్రధాన ఘట్టము.

కానీ, దురదృష్టాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. తన తల్లి జబ్బుతో మరణశయ్య నందింది. రాండల్ తన ప్రయాణాన్ని మధ్యలో మానుకోవలసి వచ్చింది. "శాఫో-స్విన్‌బర్న్"నుండి తన యింటికి వచ్చినాడు.

అతడు తన తల్లినిగూర్చి, ఆమె మరణాన్ని గూర్చి మొదటి శరత్తులో మాట్లాడలేదు. చాలరోజుల తరువాత అతని వ్రాతలో-"జీవితము-మరణము" వీనిని కూర్చి కనుపించినయి. ఈ రచనలో ఇమిడ్చిన భావం మురుగుడు గాలువపైన సుగంధం పూసినట్లుగా నాకు, జీన్‌కు కనిపించినాయి. అందులో శృంగారమే లేదు. శోకము; శాశ్వతమైన సత్యాన్ని గూర్చి విచార

కరమైన తీర్పు:-"మనకు తెలిసినంత వఱకు-విధి విలాసము మన మూహింపరాని ఆశ్చర్యకరమైన విషయము. ప్రకృతి శోభ మన చుట్టు ప్రక్కల అనంతమైన మంచిగొప్పతనము గలిగియున్నది. ఏదో కొలదిగ విశ్వాసమున్న మనకు-ప్రతి పక్షియు అప్సరలగానము చేయును; ప్రతి పుష్పము అప్సరో ముఖమును చూపును. దైవసృష్టి మన యెదుటనున్నది. మను జుడు కనులారచూచిన దానిని ఒప్పుకొనుటలేదు. కానీ, మన మనస్సులలో-దేవునియాశయము; మన మెదడులో భగవంతుని విచక్షణ ఉన్నది. కానీ, ఇంకను మనము చీకటి గదిలో దిగ విడచిన చిన్న పిల్లవలె భయపడుతున్నాము." అతడు తన తల్లి రూపాన్ని 'మానుషం' అని చెప్పక పోవడం చాల వింత విష యము. అదెట్లనగా—తాను చనిపోయినా! తనకు ఇచ్చిన జీవి తాన్ని నిత్యంగా చేయుమని, దేవునికి జ్ఞప్తిపఱచు చున్నట్లున్నది.

అతడు అందువల్ల తన యిల్లు విడువకుండ నున్నాడు. "లిడ్డీ" ఏ మార్పు లేకుండా తన తల్లి స్థానాన్ని ఆక్రమించు కొంది. గారట్సన్ తాతయ్య అధికారము తీసికొన్నాడు. రాండల్ పద్యాలు, చిన్న వ్యాసాలు వ్రాసేవాడు; ప్రతిరోజు కొన్ని పేజీలు లాటిన్ చదివేవాడు; షికారుకు వెళ్లేవాడు. ఎప్పుడూ మిల్టన్, హాథోరన్‌లు-కొద్దికాలం ఆకాశంలో నక్ష త్రాల్లో కలిసి వెలిగిన విషయాన్ని స్మరించేవాడు; క్రైస్తవ మతం తన్ను ఉత్తేజితంగా చేసినట్లు తలచుకొన్నాడు. మఱొక సందర్భంలో "లివర్‌పూల్"కు ఓడ ప్రయాణం చేశాడు. ప్రియమిత్రులగు గారట్సన్, మేయో, ఐవ్స్-లకు బదులుగా స్థబులుగా నున్న మఱి ముగ్గురు గారట్సన్‌లు కూడ నున్నారు.

దృఢ శరీరు డగు తండ్రి తమ ప్రయాణాన్ని గూర్చి గొప్పగా, తన కూతురికి, కొడుకుకు విదేశీయ భాషలో సాయంత్రం విద్యా వ్యాసంగంతో చెప్పేవాడు.

ఇవన్నీ, గారట్సన్ పత్రికలో ప్రచురింప దగిన విషయం కాదు. కానీ, రాండల్ ప్రేమలో పడిపోయినాడు.

## 5. అధ్యాయము

లండన్‌లో "ఆస్కాట్" భవనం బాస్టోనియన్‌లకు హోటలు. సాధారణంగా గారట్సన్లు అక్కడ బస చేసేవారు. అచ్చట స్నేహితులు, ఇరుగు పొరుగువారు, బంధువులు, పెద్ద మనుష్యులు ఉన్నారు. బాయిల్‌స్టన్‌స వృద్ధులు, అమిసన్ పియర్‌స, న్యూబరీ, ఆవిడ కూతురు హార్డన్‌స అక్కడుండే వాండ్లు. ప్రతి వేసవిలోను, ఉపన్యాసకులు, ఇంకా ఎందరో గొప్పవారు, వారనర్, అతని కూతురు మైలీన్—వస్తూ వుండే వారు.

వేసవిలో వారి ప్రయాణంలో గారట్సన్, వారనర్‌స—ఎన్నోసారులు మార్గంలో తటస్థపడేవారు. కానీ, స్వాభిమానంతో పరస్పరం చూచుకొనేవాళ్లుకూడ గారు. కానీ, రాండల్ వారికోసరము కాచుకొనేవాడు. ప్రయాణం సాగే కొద్దీ, మైలీన్‌యొక్క చక్కని చిన్న స్వరూపాన్ని ఆదుర్దాతో నిరీక్షించేవాడు. ఆమె, ఆమె నాన్న కలిసి అందంగా జంటగా వుండేవాళ్లు. వా రిద్దఱివి చిన్న ఆకారాలు. చురుకుదనం గలిగి పక్షుల జంటవలె చక్కగ వుండేవాళ్లు. కానీ, ఆఖరికి లండన్‌లో అందఱు కలుసుకొన్నప్పుడు "మిస్ వారనర్" గారట్సన్‌లకు

వలె గౌరవమైన కుటుంబం గాదని తెలిసింది. వారి మిత్రులు ఇరువర్గాలవారికి పరిచయం కలుగ చేశారు.

"థియోడర్ గారట్సన్ కాదు గదా?" వారనర్ స్వరం అతని ముఖమువలె స్పష్టంగా, వేగంతో ఒక పెద్ద హాలులో వ్యాపించేటట్లుగా పలికాడు. "సరే! నా ఊహ ప్రకారం మిస్ బాయిల్ స్టన్స్ యొక్క బంధువై యుండాలి—అవునవును—నీ గ్రంథాలు . . . బాగుంది . . . చాలా బాగుంది.

మిస్ వార్నర్ గ్లౌ (రబ్బరు తొడుగు) ఉన్న చేతిని, రాజ శివితో ఒయ్యారంగా అందించింది. మిస్టర్ గారట్సన్! నే నెన్నోసార్లు ఈ ఆచారాలని వదలి, నన్ను నేను పరిచయం చేసికొందా మనుకొన్నాను. ఎప్పుడూ నీవు కామ్టన్ నుంచే వస్తావన్న విషయం నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. ఇం తెందుకు? చాలారోజుల క్రిందట నేను "బ్రాటిల్స్"ను చూడడానికి వస్తుండేదాన్ని. ఎలాగైతేనేం! మేము మీకు నాలుగో తరగతి బంధువు లమనడం సందేహం లేదు."

రాండర్‌కు ఎన్నో యూహలు బయలుదేరినవి. తన ప్రేయసిని ఒక రూపిణిగా, సిలివెంద్రుకలతో అడవుల్లో విహరించేదాన్నిగా ఊహించాడు. కానీ, చల్లని, చిన్నజీవి యెదుట ఆ కల లన్నీ మాయమైనవి.

ప్రయాణాలకు సాహసాలతో కూడిన ప్రేమైకమార్గంలో పౌరాణికుల కళల యందలి సత్యాన్ని తెలుపుతూ—తనప్రేమను నడిపాడు.

రాండల్—ఆనందంతో, ఆశతో రెక్కలమీద నెగిరాడు. అతడు కళను, మైలీన్‌ని ప్రేమించాడు. ఆవిడ కూడ

కళను, రాండల్‌నూ ప్రేమించింది. ఎందట్లో ప్రేమ దేవతల పాదాల ముందర కలిసి ప్రార్థనలు చేశారు వారు. ఎందఱనో తాపసులను పూజించారు.

"మిస్‌వార్నర్! నేను మొదటిసారిగా "మిలో వీనస్" దేవత ముందర—ఆదూల్లో—నీతోకూడ రావడంలో నా ఉద్దేశ్యం నీ కర్థమయిందా?"

"ప్రతిసారి—అది మొదటిసారే అవుతుందా గారట్సన్? ఆచారం ఎన్నటికీ చెడదు అద్దెల్లో పోయినా? . . ."

స్త్రీ సహజమైన లజ్జ—ఎంతటి స్వాభిమానైనా క్షణకాలంలో పోగొడ్తుంది. రాండల్ చెప్పినట్లు ఆ స్వభావం అతని ముందర నిశ్శబ్దంగా అరవై నిముషాలు నిలిచింది.

"ఆ తరువాత మాటనే లేవు ?"

లేదు. అని ఆమె ఒప్పుకొంది. "నీవు తెలిసికో దగింది అంతే."

వాళ్లు మళ్లీ మఱొకసారి లిడ్డీ ఉండగా కలుసుకొన్నారు, ఏభైమూడు నిమిషాలసేపు . . .

ఒక సాయంత్రం "ఫ్లోరన్స్"లో మైలీన్ నా కూడా ఉంది. నేను సౌందర్యాన్ని స్తుతిస్తాను గారట్సన్! దేవుణ్ణికూడా అనుకోండి! ఈ దైవస్వరూపం దాన్లోగూడ ఉందని నా నమ్మకం"

నదీ తీరంలో చీకటి పడుతున్నది. వాండ్లుగూడ క్రమంగా నిశ్శబ్దం అవుతున్నారు. "సౌందర్యం స్వభావాన్ని బట్టి యుంటుంద" అన్నదామె.

మోచించాడు.

"నీవు నన్ను రాండల్! అని పిలవలేవా?"

"నేను ఈ ఆధునిక విమర్శకులు కళను (మారల్) నీతి గాదని యనటం, అది గుబగుబలాడే జీవితాల మంటలను కప్పి వేసే తడి దుప్పటిగా చిత్రించటం-అంగీకరించను."

"కొన్ని సమయాల్లో హృదయాలు నేరుగా మాట్లాడు కొంటవి మైలీన్! "నేను 'మైలీన్' అని పిలవ వచ్చా??"

ఆవిడకు తెలుసు! ఈ భూమిమీద జీవించిన ఏ జీవి గూడా మిస్‌వార్నర్ అంత నిశ్చలంగా ఉండదేమో!" ఆఁ! మొదటి నుండి అల్లాగే పిలిచి యుండాల్సింది. కాని-విల్డ్—అతన్ని గూర్చి చదివావా? అతడు అసత్యాలు సత్యాలకంటె ప్రియంగా వుంటాయని, అవే మంచివని అంటాడు. "మంచి" అంటే అతని కేదో ఆటగా ఉంది . . ."

ఇక్కడ మైలీన్ వార్నర్ ఫ్లోరన్స్ దేశపు మసక వెలుగులో, సమీపించిన ప్రేమికుని ప్రేమ వాక్యాలు వింటూ, ఒక యువతి నిల్చుంది. అందమైన దేహంతో-మెత్తటి వక్షస్థలం క్రింద-గుబ గుబలాడే హృదయంతో-పాలవెన్నెలవంటి శరీర (చర్మం)లో ప్రవహించే నెత్తురు మెదటి చుట్టూ పాట పాడుతుండగా నిల్చియుంది.

'మన మందరము "సౌందర్యం" పరమ సత్యం-అని ఒప్పుకొంటాము. కానీ, వచ్చే చిక్కల్లా? నిజమంటే ఏమూ? అని చెప్పే దాంట్లోనే! అది నిజంగా అంత సులభం గాదు మిస్టర్ గారట్సన్?—సరిగ్గా మాట అక్కడే తడబడింది.

ఇంతవరకు మంచుకు మల్లే వున్న ఆమె రూపం కరిగి, హృదయం నుండి వేడిగా నిట్టూర్పు గాలులు వీచినయి· "నన్ను క్షమించండి. రాండల్-అని నేను చెప్పబోయాను."

కొద్దిరోజుల తరువాత వారు "రోమ్" నగరానికి ప్రయాణమైనారు. అక్కడ వివిధ దేశీయు లున్నారు· మైలీన్ వాళ్లందరికీ పరిచయ మున్నట్లే మాకు కనుపించింది. రాండల్ ఆవిడను తన సొత్తే ననుకొన్నాడు. ఆవిడ ఇప్పుడు పెద్ద బిరుదుల చేత 'యూనీఫారం'తో ఆదరింప బడడం చూచాడు. మైలీన్ గొప్ప వాండ్ల పరిచయాన్ని ఇష్టపడేది. ఆవిడ గలగల మాట్లాడుతూ, ప్రకాశిస్తూ, వాళ్ళల్లో ముఖ్యురాలుగా తయారయింది; వారికి రాకపోకల్ని తనే యేర్పటిచేది; వాళ్ళను కవ్వించి, నవ్వించి, చాకచక్యాలను పొగిడేది; వారికీ కళాసక్తిని, విదేశ యాత్రలను, ఆహార విషయాలను గూర్చి ఆజ్ఞాపించేది.

రాండల్ కి ఆవిడ ఒక దైవ స్వరూపిణిగా గోచరించింది.

"మైలీన్! నేను రెండు గంటలసేపు మాట్లాడగోరుచున్నాను. నేను అడగరాని కోరికైనా,-మనము పూర్వము గడపిన రోజుల్ని గుర్తించుకొని, దయచేసి గ్రాంట్ చేయవలసింది"

"అదేమిటి రాండల్ !"

ప్రకాశవంతములైన ఆవిడ కండ్లు పెద్ద విషయాన్నుండి-చిన్న విషయంలో ఆదుర్దాను కనుపఱచినయి· దానికేం? రెండు

గంటలు గడుపుదాం. నీవు కావాలంటే మూడు గంటలైనా సరే!"

ఆ సమయం రానే వచ్చింది. అదొక స్వర్గతుల్యమైన ఉదయం. కానీ, రాండల్‌కి ఆ కాలము కొద్దిగా తోచింది. అతడు తన ప్రేయసిని చలవరాతి భవనంలోకి తీసుకొని వచ్చాడు. వారిద్దఱు పవిత్రమైన, శుభ్రమైన వాయువుల్ని పీల్చారు; దైవేచ్ఛను కొనియాడారు; సౌందర్యాన్ని గురించి గుస గుస లాడారు. దైవ స్వరూపులై వారు పారిపోయారు.

వారు సెయింట్ పీటర్సు ముందు భాగంలో నడుస్తుండగా అతడు ఆవిడను తన దాన్నిగా ఉండమని అడిగాడు.

## 6. అధ్యాయము

మా నాన్న తన ప్రయాణాలు ముగించుకొని "కామ్‌టన్"కు తిరిగి వచ్చినాడు. జీవితం ఒక సంశయాన్ని తీర్చవలసి యున్నదని అతడు తలచాడు. మైలీన్‌వారనర్ నుండి తాను పొందిన సారాంశ మంతా-'తనొక మంచివాడ'ని-కానీ, ఎక్కడో పొరబాటుంది. ప్రేయసి తనకు కాకుండా పోయింది. తన గొప్ప దగు ఈ మంచితన మేమీ సహాయపడలేదు.

తాను కష్టించి ప్రపంచానికి మంచి చేయాలని తనలో అంగీకరించాడు. అతని తండ్రికూడ అట్లే తలచాడు. అతడు సాధారణ ధర్మపద్ధతితో నన్నాడు. సజ్జనులు కష్టించారు; మంచి ధనవంతులు కూడా. అది న్యూ యింగ్లాండు ధర్మం. కానీ, తన కొడుకు సందేహాన్ని గుఱించి యతని కాశ్చర్యం కలుగలేదు.

అవకాశం చిక్కినప్పుడల్లా, రాండల్ గారట్సన్ "బాస్టన్"కు వెళ్ళి శిల్పకళ నేర్చుకొనేవాడు. శిల్పి-కళతో తన వ్యాపారాన్ని సాగిస్తాడు. అతడు కళను లాభదాయకంగా మారుస్తూ ప్రజల అభినివేశానుగుణ్యంగా తన కళను వృద్ధి పరుచుకొంటాడు. ఈ నవీన యుగంలో, కళలు క్షీణదశ నందు తున్నప్పుడు, అత డిటువంటి వృత్తిని తీసికోవడం అతని తప్పు కాదు. అతని తప్పంతా—ముప్పై ఏండ్లదాక యీ విషయాన్ని తెలిసికోలేక పోవడమే. ఈ కళలనే మంచు ఆ కాలంలో ఆవరించి కాషాయపు రంగు శిల్పకళకు రోజాపూవు కాంతి నిచ్చింది.

నిజంగా అతను తన రాజభవనాన్ని పూజించడానికొచ్చాడు. తనకు తెలిసిన దైవిక కృత్యాలు-సత్యం, సుందరం, పవిత్రాత్మ. ఇవన్నీ ఆ తెల్లటి గృహ పరిసరంలో ఆతనికి కనుపించాయి.

తరువాతి రోజుల్లో అతడు ఎదురుచూడని భారతా తపమువలె సత్యానికి ప్రపంచమంతా గాలించాడు. కానీ, చివరకు తనకు కావలసినదాన్ని తన యింట్లోనే చూడగలిగాడు.

1890 లో అతడు "బ్రోమ్ షీల్డు" వీధిలో ఒక శిల్ప శాలలో పనిచేస్తూ, డ్రాయింగు స్కూలుకు పోయేవాడు. కొన్నియేండ్లు రాండల్ గారట్సన్ కొద్దిజీతం సంపాదిస్తూ గొప్పగా గడుపుకున్నాడు. అతను మంచి అభిరుచులు గల వాడని, వడ్రంగము బాగా చేసేవాడని తెలుస్తుంది. "పీబడి అండ్ పీబడి"లో అప్పుడు పనిచేసేవాడు.

అవి అతనికి మంచిరోజులు. మిస్ వారనర్ అతని మొద

దులో మధురంగా విచారంగా నిలిచిపోయింది. మెత్తని కలప లోంచి బయలుదేరే స్వరం లాగా ఊడి పోయింది. ఆవిడ భౌతికరూపం తనకు కాకుండా పోయింది. ఆతనికి తెలుసు. ఆ విషయమై సంతోషంతో నిట్టూర్చాడు. ఇంకా అతని కెందరో క్రొత్తగా బాస్టోనియన్ స్నేహితులు తయారయినారు.

అతడు హృదయపూర్వక ఆహ్వానాన్ని—మిసస్ వర్నన్ హాలిస్టర్, ఆమె పుత్రికలు ముగ్గురు నివసించే "బాక్ బే"లో "మూరల్ బరో" వీధిలోని ఒక రెడ్ హౌసులో నందుకొన్నాడు. మిసస్ హాలిస్టర్, అలైస్, మే-కారొలిన్ ఒకరి నొకరు ప్రియంగా పిలుచుకొనేవారు. వారు స్త్రీ సహజమైన ప్రేమతో అన్యోన్యంగా ఉన్నారు. నలుగురు ఆదర్శ యువతులుగా నున్నారు. సంగీత సాధనాలను ఉపయోగించేవారు; శుక్రవారం సాయంకాలం సంగీత గోష్టికి వెళ్ళేవారు. బీదలకు ఉచిత సహాయం చేస్తూ, వాళ్ళ చర్చిని అభివృద్ధికి తేవడానికి పాటుబడేవారు.

హాలిష్టర్లు చాలామంచి వాళ్ళు. మిస్టర్ హాలిస్టర్ మరణించాడు. మిసస్ హాలిస్టర్ ధనము—బాధ్యతను అర్థం చేసికొంది. తన కుమార్తెలు తనపరిస్థితిని గమనించి మెలగుతారని ఆశించింది. వాళ్లు చర్చి కార్యాల్లోను, గరల్స్ ఫ్రెండ్లీలోను పనిచేయడం ఆమెకు ఊరట గలిగించింది. ముఖ్యంగా "అలైస్" ప్రపంచ బాధ్యతలను అర్థం చేసికొని నడవటం గమనించింది. అలైస్ నడవడి మంచిది—ఆవిడ మార్దవంగా ధారాళంగా వుంటుంది. రాండల్ కు మూరల్ బరో వీధిలోని గృహము సుఖంగా, పనిపాటులు లేకుండా గడపగల కోటగా కనిపించింది. అక్కడ ఎట్టి బాధ్యతలు లేకుండా వుండేవాడు.

భోజనం, ఫలహారం, టీ, ఎప్పుడు సిద్ధంగా వుండేవి.—అతడు కావాలంటే—ఒక గది, టిఫిన్ తయారు; దానితోబాటు ముగ్గురు యువతులు అమాయకమైన ప్రేమతో-తనతో నవ్వుతూ, ఆడుతూ, పొగడుతూ ఉంటారు.

కొంతకాలము ముగ్గురిని ప్రేమించాడు. అలైస్‌ను మాత్రం ముఖ్యంగా అభినందించేవాడు. ఆపెతో జాగ్రత్తగా మాట్లాడేవాడు; ఆవిడ ఎక్కువ జ్ఞానాన్ని-తన నుండి ఇతరుల కంటె నిరీక్షిస్తున్నట్లుండేది. 'మే'ని సోదరీ ప్రేమతో చూచే వాడు నిబ్బరంగా, అందంగా, నిశ్శబ్దంగా; ఇంకా ఎక్కువ గానే. కానీ, తారుణ్యం, నిష్కల్మంగల కారోలిన్‌ను నిజంగా ప్రేమించాడు.

కారోలిన్ ఎప్పుడు పెద్దపిల్లగానే పిలువబడేది. పొడుగ్గా-గుండ్రంగా - మృదువుగా-నిర్మలంగా-సూర్యరశ్మి సోకనంతటి తెల్లగా ఆవిడ శరీరం వుంది. ఆవిడ కళ్లు ప్రపంచ ప్రకాశాన్ని చూడనంతటివిగా, మిక్కిలి వెడల్పు, నీలమునై యున్నవి. ఈ పద్దెనిమిది యేండ్లకు ఆవిడ నేర్చుకొన్న దొక్క అమాయ కత్వమే.

ఆ ముగ్గుర్లోను ఆవిడే చాలా చక్కంది. రాండల్ కూడ ఆవిడ కొంచెం తెలివి తక్కువదని, స్వంతంగా ఏది ఆలోచించ లేదని, చిన్నపిల్లవలె జాగ్రత్తగా చూచుకోదగిన దని తెలుసుకొన్నాడు. ఆవిడ అమాయకత్వం పెద్ద సమస్యగా తేలింది. ఆమెను కాపాడటానికై అతడు ఇతరులతో పవిత్ర మైన బుద్ధితో ఆలోచించేవాడు.

రాండల్ హాలిష్టర్లతో ఒక సంవత్సరం గడపినా, కారోలిన్ చిన్న పిల్లగానే యుండింది. ఆవిడ తనతల్లి కంటె మూడంగుళాలు పొడగరి అని, బాగా వయసు వచ్చినదని, ఎవ్వరు గమనించలేదు. ఆవిడకు 18 ఏండ్లు కావచ్చినవి. ఎప్పుడు శాంతంగా, మధురంగా, నెమ్మదిగా నడుస్తూ 'కాస్టాయిల్' సోపువాసన గొట్టుతుండేది. రాండల్ ముఖ్యంగా ఆవిడ క్రొత్తదనాన్ని ఆనందించేవాడు,

కోరదగిన పురుషులు ఆవిడను దాటివెళ్లారు. అర్హులైన స్త్రీలు ఆవిడకు ప్రియుంగా కనుపించారు. పెండ్లాడినవారు ఆవిడతో మాట్లాడవచ్చు. ఒక అభ్యంతరం — రాండల్ గారట్సన్ తనవారి సమ్మతితో ఆవిడకు సంరక్షకుడుగ నున్నాడు. "నీ వట్లాచేయడం బాగుంది రాండల్ ! నన్ను కూడ అల్లాచూస్తే ఎంత బాగుండేది ?" అంది మే.

"అంటె చిన్న పిల్లలాగా ?"

"కాదు. ఒక చిన్న రాజ కుమార్తెగా"

"కానీ, నీ వెంటనున్న రాజకుమారులను ఆలోచించు" రెండివ అంతస్తు గ్రంధాలయంలో టీత్రాగుతూ కూర్చున్నారు.

"ఎక్కువగా ఆదరింప బడుతున్నావేమోనని భయపడు తున్నాను" అర్థమయేట్లు తల ఆడించాడు.

"నీవు ఇంకా కొంచెం తక్కువ యునికిలో వుండాలి. డజన్ మంది కంటె ఒక రాజకుమారునితో తృప్తిపడు"

"రాండల్ ! నీవు-చాలా తెలివితక్కువగా మాట్లాడుతున్నావు" అని అరుస్తూ చేతిగుడ్డ ముఖానికి కప్పుకొని, కోపంతో విస విసా వెళ్లిపోయింది.

అతడు తనలో నవ్వుకొని, టీని చప్పరించడం మొదలు పెట్టాడు. మే చాలా అలసిపోయింది. అనుకుంటూ స్త్రీల గూఢత్వాన్ని గురించి, తన నమ్మకలను మళ్లీ స్మరింప సాగాడు.

"అరే! అప్పుడే టీ అయిపోయిందా!" కారోలిన్ మెరిసే మబ్బుమాదిరి లోపలికివచ్చింది. దేనికో తన పొడుగు జడను తలచుట్టు త్రిప్పి కిరీటంలాగా చుట్టుకొంది.

"ఆహా! రాజకుమార్తెగారూ!" అని రాండల్ లేచి అభినందించాడు. అతని చేతల్లో అపహాస్య మేమీ లేదు.

"మిగతా వాళ్లు రావడం లేదా ?"

అతని కండ్లు నిశితంగా మారినయి. "కారోలిన్ ! నీహృదయం - ఎంత ఆహ్లాద కరంగా - ఎంత అందంగా - ఉంది యిప్పుడు-అని నవ్వుతూ చెప్పలేవా ?"

"సరే! ఇప్పుడిక్కడికి 'మే' వచ్చిపోయిందని అనుకొన్నాను."

ఏం! 'మే' ఉంటేగాని సంతోషం ఉండదా?"

డ సిగ్గు బిడియంతో నవ్వుతూ ప్రకాశంగా ఇట్లు "అహా! అదికాదు—" నిజాన్ని చెప్పవలసి వచ్చే

టప్పటికి ఆవిడ స్వచ్ఛమైన చెక్కిళ్ల రంగు మారింది. "ఇక్కడెప్పుడు సంతోషంగానే ఉంటుంది.

"అదికాదు కారోలిన్ ! !—విషయం ఏమిటంటే, నీతో ఇక్కడ సంతోషంగా ఉంటున్నాను. ఇక్కడేగాదు ఎక్కడైనా నీవుకూడా అల్లాగే తలుస్తావని అనుకుంటాను."

"అదే—నేనుకూడ అల్లాగే అనుకుంటున్నా!" అంది చిడియాంతో.

అతను తల ఊపాడు. "ఐస్‌లాగా మాట్లాడుతున్నావు. నీవు ఎంత అందంగా ఉన్నావో, నీకే తెలియలేదా? బంగారం లాంటి వెంట్రుకల కిరీటంతో, ఆకాశంలాంటి కన్నులతో— నే సంరక్షకుడిగా భావించడం ?"

"తెలివి తక్కువగా ప్రవర్తించకు రాండల్ ?" ఆవిడ మాటలు అదృఢంగా, అనిశ్చయంగా, వినయంగావున్నాయి. ఆమె కప్పు, సాజర్ తీసికొని ఆరిపోరిన చేతుల్తో టీ పోసింది. "నీవుకూడ ఇంకా కొంచెం తీసికొంటావా ?" ఆమెస్వరం ప్రేమతో వణకుతూ వసంతంలోని జలపాతంలాగా హాయిగా వుంది.

"కారోలిన్ ! నీవు చెప్పినట్లుగా నేను నిజంగా తెలివి తక్కువగా గర్వంగా వర్తిస్తున్నానేమో?—నాకు తెలుసు, మీ అమ్మ ఒప్పుకోదని ; కాని నీవు సహించరాని అందంగా నున్నావు. అంత సలక్షణంగా-నేను-మరి-నేను నీ ప్రేమలో పడిపోతున్నాను - లేదు పడిపోయాను. నేనిప్పుడు దాన్ని

గురించి మాట్లాడకూడదనుకో? నీవు ఏదో నటిస్తున్నట్లున్నావు ——" అతని స్వరం గద్గదికమై కొంచెంసేపు ఆగాడు.

ఆవిడ తలత్రిప్పి, వస్తున్నట్లున్నది.

"ఏం ! పిల్లల్లారా !" అంటూ అలైన్ ప్రవేశించింది. రాండల్ తటాలున లేచి నిల్చున్నాడు.

"ఓహో ! టీ త్రాగుతున్నారా మీరు! మే ఎక్కడ? ఒక కప్పు కోసరం చచ్చిపోతున్నా. ప్రొద్దుటినుంచి తిరగటంతో సరిపోయింది." ఆవిడతో బాటు, స్త్రీల కావశ్యకములైన 'స్కార్ఫ్, రిబ్బన్లు, గ్లవుసు, గాజులు, గౌన్లు, సెంటు-ఇల్లాంటి వెన్నో వచ్చిపడ్డాయి.

మళ్ళీ, "పిల్లలూ!" కారొలిన్ అంది.

"నిజంగా బిడ్డలుగాదు . . . భయంకరమైన పిల్లలు. చంపేసేలాగ అరుస్తున్నట్లుంది. రాండల్ ! ఈ విషయంలో ఏదైనా చర్య తీసికోవాలి. నిజంగా నేనే గనుక మగ వాణ్ణయితే, శాసన సభలో నిలబడి మాట్లాడ గలిగితే, వాళ్లకు ఈ పెద్ద పట్టణంలో ఏం జరుగుతుందో చెప్పగలను. ఆ వీధి చివర సెటిల్ మెంట్ హౌస్‌లో ఒక పాలవ్యాపారిని చూచాను. పాలు, అవి చూచేటప్పటికి నా ఆకలి యెగిరిపోయింది. నిజంగా అవెల్లా వున్నాయో, చెపితే నీవు నమ్మవు. ఇటాలియన్లు, గ్రీకులు ఇంకా ఎందరో? నాకు చాలా ఆకలిగా ఉంది. వెళ్లి "నోరా"నడిగి రొట్టెలు, అవి, ఎక్కువగా నీళ్ళు తెచ్చి యిచ్చి మీ పని చూచుకోండి. ఇంకో నిమిషంలో అమ్మ కూడా

వస్తుంది." రాండల్ దృష్టి కెటిల్‌తో పోతున్న కారొలిన్‌ని అనుసరించింది.

"ఆవిడ తల వెంట్రుకలు అల్లా పైకి దువ్వడం చాలా అసహ్యంగా వుంది." అన్నది అలైస్. ఆవిడ మాట్లాడడం బట్టలు మడిచే చప్పుడు వినిపించింది. ఏదో పెద్ద సిల్కు అంగట్లో మాట్లాడుతున్నట్లుంది. కొద్దిగా స్థూలంగా మృదువుగా, పండిన పండులా వుంది ఆవిడ శరీరం. నవ్వినప్పుడు ముక్కు ఎఱ్ఱగా మారింది. ఆవిడ మొగమంతా ఎఱుపు తెలుపు మచ్చలతో నిండిపోయింది. వంట యింట్లో టేబుల్ క్లాత్ లాగా అసహ్యంగా వుంది.

"ఇదిగో! అమ్మ వచ్చింది?" రాండల్ నిల్చున్నాడు. హలో? అమ్మా! ఎంత మంచిరోజు. ఇప్పుడే రాండల్తో చెపుతున్నాను."

మిసస్ హాలిస్టర్ అలైస్‌కన్నా పెద్దగా ఆర్భాటం చేస్తూ వచ్చింది. అలైసు మాటలు వినకుండానే "బలే! ఇవాళ్ళ చాల జాలీగా వుంది"

"అమ్మా! నాతోపాటు సెటిల్ మోటు హౌసుకు రమ్మని ఇప్పుడే రాండల్‌తో చెప్తున్నాను—నీవేమంటావ్? అతడు చూడవలసిందేగా? నే ననే దేమంటే? శిల్పిగా వుండి, చేయవలసిందేదో తెలిసి ఉండి, ఆ స్థలాన్ని అంత భయంకరంగా ఉన్నాయి...అతడు తప్పక చూడాల్సిందే! ఏమంటావు? అమ్మా !"

"అవునమ్మా! నిజంగా చూడాల్సిందే! నీవు ఒంటరిగా పోనక్కర్లా? ఆవిడ వస్తుంది..." రాండల్ ప్రక్కకు తిరిగి,— "అది తన విధిగా భావించి నా మాట ఒక్కమారైనా చెవిలో వేసుకోలేదు. కాని దీనికి కావల్సింది ధైర్యమే కాదు! లాఘ కారిగా ఉండే తెలివి కూడా కావాలని చెపుతున్నా."

మిసెస్ హాలిస్టర్ లేచి గర్వంగా గంట మ్రోగించింది. "నోరా ఎక్కడికి వెళ్ళింది?" చివరికి కారొలిన్ వచ్చింది.

"రా! కారొలిన్! నీవు సామాన్లు మోసుక రాకూడదు. ఆ పని నోరా చేస్తుంది."

రాండల్ మళ్లీ లేచి కారొలిన్ చేతుల్లోంచి ప్లేట్లను అందుకొని టేబుల్ మీద పెట్టాడు. అందరు కూర్చున్నారు.

"అలైసు పూర్తిగా అభినివేశం గలిగి ఉంది...అది గొప్ప తెలివి గల పనేనా? అని నా సందేహం. రాండల్! నీకేం తోస్తుందో! చెప్పు సామాన్య దృష్టితో. ఈ గుణం నీచులకు, మిక్కిలి భయంకరంగా వుండేవాళ్లకు సరిపోతుంది. కారొలిన్ ముందు ఇంతకంటె విశదీకరించలేను. నిజంగా రాండల్ ఈ విష యంలో నీవేమనుకుంటున్నావో?—ఒక చక్కని అలైసు వంటి తరుణి మన కందటికి ఇంత అమూల్యమయింది.—ఏం! సిగ్గుపడకు రాండల్! నిన్ను చాలా రోజుల్నుంచి తెలుసు. దానికే నిన్ను అభినందిస్తున్నా!—సరే! నన్ను ముగించనీయి. కారొలిన్! ఆమె ఎక్కడుందో చూడు? మిసెస్ హాలిస్టర్ తడబడుతూ లేచి రాండల్‌ని తీసికెళ్లింది. నేను కారొలిన్ని చురుగ్గా ఉండ కుండా చూడాలి." అంటూ చెప్పింది.

"నేను దాంతో ఏమని చెప్పాలి" అన్నాడు రాండల్.

"అది అప్పుడే అదంతా మరచిపోయి యుంటుంది. నీవు నాతో కూడవచ్చి అన్ని విషయాలు చూస్తానని చెప్పు. అం తేచాలు. కానీ--అది నాకోసరం కాదు రాండల్ ? ఊరికే యింత గొడవ యెందుకు ? వృద్ధికొస్తున్న యువకశిల్పివి నీవు-ఇటువంటి విషయాల్లో శ్రద్ధతీసికోవాలి."

"సరే ! దానికేంలే వస్తాను."

అతడు హృదయ పూర్వకంగా చెప్పడానికి ప్రయత్నించి, ఆవిడ జయించాలి అన్నట్లుగా పెదవులమీద నవ్వాడు. కారోలిన్ రాగానే లేచినిల్చున్నాడు. ఒక సోఫాలో ఆవిడ కూర్చోన్నపిమ్మట తానూ కూర్చొని, అర్ధనిమీలిత నేత్రాల్తో ఆవిణ్ణే గమనిస్తున్నాడు.

"ఏదో ఒకదినం అక్కడికి వెళ్లాలని నాకూ కూడా ఉంది అలైస్ !" అంది కారోలిన్.

"నీవు దాన్ని అసహ్యించుకొంటావు. అక్కడ నిజంగా బాగుండదు."

"సరే! ఇప్పుడు కాదులే !"

"బహుశా ! నేను నిన్ను తీసికొని వెళ్ల డానికి అనుమతిస్తారేమో ! నన్ను తెలుపుకొన్న తరువాత.

## 7. అధ్యాయము

ఒక సంవత్సరం తరువాత మార్చిలో రాండల్‌కు అలైస్‌కు పెండ్లి అయింది. ఆమెకు సహాయంగా వున్న

ఆరుగురిలో కారోలిన్, లిడ్డి కూడ ఉన్నారు. వాళ్లందరిలో కారోలిన్ అచ్చెరలాగ కనుపించింది. వరుడు తన అన్న ప్రక్కని నిలబడి, వధువును నిశ్చేష్టంగా చూచాడు. అక్కడున్న వందలాది జనంలో ఇద్దఱు మాత్రం, అతడెటు చూస్తున్నాడో? వాని వైఖరి మృత్యువు నెదుర్కొంటున్నట్లుందని కనిపెట్టారు. 'రిచర్డ్' అతన్ని ముందుకు నెట్టితే, నిద్రలో మైకంలో వున్నట్లుగా అడుగు పెట్టాడు.

అలైస్ గొప్ప మనోదార్ఢ్యంగలదని అందఱనుకొన్నారు. ఆవిడ ముఖంలోని తేజస్సు తగ్గలేదు. ఆవిడ తియ్యని చిరునవ్వు నవ్వింది. అంటే—అక్కడే చూపులతో రాండల్ని తనకు బాధ్యుణ్ణిగా తీసికొందన్న మాట—కాసీ, ప్రియంగా, మంచి భార్యగా ఉంది.

మిసస్ హాలిస్టర్ సంతోషంతో వినబడే టట్లుగా, ఊపిరి వదిలింది. ఈ ప్రపంచంలోని ధర్మాన్ని తాను తలచినట్లుగానే జరుపుతుంది—ప్రియమైన అలైస్ తాను కష్టించి రూపొందించిన స్వరూపము. కారోలిన్ ఎవ్వరు కని వినని అందమైన పిల్ల; ప్రియమైన మృదు స్వభావము గలదిమే—వీళ్లందఱు తన వాళ్లు. తన చేతులతో పెంచింది—వాళ్ల విధ్యుక్త ధర్మాలను, విధులను సరిగా ఆచరింప జేయడంతో తను గొప్ప విజయం సాధించింది.

"సెటిల్మెంటు విషయమె, వాళ్ల పెండ్లికి కారణమయింది." అంది మిసస్ హాలిష్టర్.

నా కూతురు ఎంతటి ఆత్మార్పణంగలదో, మీకు తెలియకపోవచ్చు. ఆవిడలోని చక్కని ఈ అంశాన్ని రాండల్

అభినందించి, తానుగూడ భాగం పొందాలనుకోటం నేను అప్పుడె కనిపెట్టాను. పాపం అంతా తానే చూచుకుంటూ నన్నాడు—నిజంగా వాళ్ల భవిష్యత్తు—అలా కలిసి ఒక్కటై పోవడం నాకు చాల ఆసక్తిగలిగింది. నేను ప్రేమగల తల్లి ఆశీస్సులను మాత్రం పలికాను. అంతా చక్కగా సక్రమంగా జరిగిపోయింది.

## 8. అధ్యాయము

"రాండల్! నీవు టౌన్‌లో ఉండవలసిన వాడివి. నీకు పరిచయులు చాలామంది యుండాలి. మిస్టర్ పీబడిగూడ అదే చెప్తుందని తలుస్తాను. ఈ నగరం ఎలా పునరుద్ధరించ బడిందో, నీకు తెలిసిందే. నేనిక్కడున్న చలువరాతి స్తంభాల్ని గురించి చెప్పడం లేదు. గౌరవంగా—శుభ్రంగా ఉండే యిల్లు, మంచి నడవలు, మంచి కలప సామాన్లు—గురించి చెపుతున్నా. నేను చెప్పేది నీకర్థం అయ్యే ఉంటుంది."

అతడు నిట్టూర్చి, మళ్లీ చిఱునవ్వు నవ్వాడు. ఆవిడ గుండ్రపు ముఖం, ఎఱ్ఱని మచ్చలు, చెప్పబోయే ఆసక్తితో కొద్దిగా తెఱుచుకొన్న మెఱుస్తున్న మెత్తని నోరు.

సరే! నన్నాడు నగంనవ్వుతో.

నేను ఈ రెండు సందిగ్ధాల్లో పడ్డాను. ఒక పక్షంలో నీవు చెప్పినట్లుగా పట్టణవాసం పరిశుభ్రతతోను, కాంతితోను మంచి భవిష్యత్తును కూరుస్తుంది; మఱొకవైపు గ్రామవాసం మంచి భవిష్యత్తునే గాక ప్రకృతానికి గూడ మంచిని గలిగిస్తుంది."

అత డెంత నెమ్మదిగా చెప్పాడో, ఆవి డంత పెద్దగా వెంటనే చెప్పింది. "సరేగాని రాండల్! ఈ విషయాన్ని ముందెప్పుడు నీతో చెప్ప లేదు. నేను సెటిల్‌మెంటు పనికై పోవాలి."

"నీవు అక్కడికి వెళ్లి పని చేయాలనే మాట్లాడు తున్నావా!"

అదిగాదు నిజంగా వాళ్లకి నేను వీలైనంత సహాయం చేయాలనుకొన్నా. నీకు, నిభవిష్యత్తుకు అదేమన్నా సహాయంగా ఉంటుం దేమోనని తలుస్తున్నా" "కానీ, నాపనంతా, బల్లలు అవి చేయడంలోనేగా!" "దయచేసి, రాండల్!— నేను సీరియస్‌గా మాట్లాడుతున్నా "నీవు ముఖ్యంగా–ఈ పట్నంలో వేసవిలో సీరియస్‌గా ఉండ లేవు. నేను నీకు కామ్‌టన్ చూపించేంతవరకు ఉండు."

ఈ విషయం శరదృతువు దాకా నెట్టబడింది. వాండ్లు వర్జీనియాలో హానీమూన్ (పెండ్లి నెల)ను గడిపి తిరిగివచ్చారు. పట్టణంలో హాలిష్టర్సు భవనంలో ఒక నెలరోజులుండి కామ్‌టన్‌ను చేరారు.

కామ్‌టన్ వాతావరణం అతనిమీద బాగా పనిచేసింది. తండ్రి యింటిలోని సంరక్షణే కాక, అచ్చటి ప్రశాంతతగూడ కారణమయింది. అతడు తన పూర్వపు స్వాతంత్ర్యాన్ని విశ్రాంతిని తిరిగి పొందగలిగాడు. కొన్ని పద్యాలు, గద్యాలు వ్రాశాడు. ఒకటో రెండో ప్రచురించబడ్డాయి. అలైస్‌తో 'హారియట్ సండర్ లాండ్' చూడడానికి బాగా ఆవిడ పిల్లను

తోటి కవిగా ఆదరించి, కామ్‌టన్ యొక్క గౌరవము మంచి చేతుల్లో పడిందని తియ్యగా మాట్లాడింది.

"సతీ! చూడు మనము ఎంతో హాయిగా ఉన్నాము. నాగరికత అనేది నిజంగా పూర్తిగా మెసాచూసెట్స్‌లోని కామ్‌టన్ రాష్ట్రంలో ఉంది."

"కానీ, ఇక్కడంత ప్రశాంతంగా లేదు. ప్రశాంతం మంచిది కాదంటావా?"

"అది కాదు. ఇక్కడ బాగానే వుంది–కానీ, ఇక్కడ ఎవ్వరూ, ఏపని చేసేటట్లు కనుపించటం లేదు. అని అంటున్నా"

"ఫ్రాన్‌క్లిన్ గ్రే యొక్క 'బర్డ్స్ ఆఫ్ అమెరికా'ను గురించి ఆలోచించావా!"

అతని ముఖంలోని వింతయైన దార్ఢ్యాన్ని గమనించి, ఆవిడ గడగడ చెప్ప మొదలు బెట్టింది.

"నీకు అనుకూలంగా చేయాలనుకున్నా–నేను నన్ను గూర్చి ఆలోచించడం లేదు ఎల్లావున్నా. ముఖ్య విషయం ఏమిటంటే? మన యిద్దఱి భవిష్యత్తు, మనం అన్ని విషయాల్లో అంవఱితోను పరిచయంగలిగి యుండాలి–ముఖ్యంగా శిల్పికి అది యుండేతీరాలి.

ఆవిడ ఎఱ్ఱభారిన చెక్కిళ్లు చల్లబడటానికి ఊపిరి పీల్చ వలసి వచ్చింది. రాండల్ పాలిపోయిన ముఖలక్షీ ఆవిడ కేసి చూచాడు.

"కాంప్టన్ గురించి నీకు బాగా తెలియ లేదనుకుంటున్నాను. పట్నంలో అంతా పచ్చి మోసం—నీచంకూడా. నేను వీధుల్ని ఇండ్లను గురించి చెప్పడంలా. అక్కడ వసించే ప్రజలను గూర్చి—ధనికుడు ధనవంతుడు గాను, బీద బీదవాడు గాను హ్యూమన్ ఐడియల్స్-లేకుండా నటిస్తుంటారు. కానీ, ఇక్కడి జీవితం పూర్ణంగా. అందంగావుంటుంది. నీవు ఉదయం గద్యాలు వ్రాయవచ్చు; మధ్యాహ్నం పొలంపనులు చేయవచ్చు; సాయంత్రం 'డాంటీ'తో వాదులాడవచ్చు, నీవు ధనవంతుడుగగాని, బీదవాడుగాని, శాంతుడుగగాని, దురుసుగాగాని, స్వతంత్రుడుగగాని ఉన్నను మనుష్యుడుగ మాత్రమే యెన్నబడుతావు, దీని కంటె ముఖ్యంగా నీవు ప్రకృతి సౌందర్యానికి మూల కారణంతోనే కలిసియుంటావు."

అలైన్ కొంత నివ్వెఱ పడిపోయింది. ఖాళీగా నిశ్శబ్దంగా వున్న వీధిలోని దుమ్మును చూస్తూ "నేను నీతో వేదాంతం మాట్లాడలేను. నేను అనుభవ పూర్వకంగా మాట్లాడుతున్నాను." ఆవిడస్వరం తన్నేదో బలహీనంగా చేస్తున్నట్లు కనుపించింది.

"కాంప్టన్‌లో ఇంకా కొంతకాలం ఉంటే, నేను చెప్పిందాన్ని అర్థంచేసికొంటావు, వసంతువు చివర, మళ్లీ పనిసందడిలో పడ్డాము." కాంప్టన్‌లో ఇంటిబయట పొలాల్లోనుండి పెద్దగాలి వీస్తుంటే, లోపల వాళ్లంతా విచారంతో ఆలోచన్లు చేశారు—అది ముఖ్యమైన గారట్సన్ల విషయము. మొదట రాండల్, అతని తండ్రితో ఆరంభమై, మధ్యన అలైసన్ కూడ కలుపు

కొని, చివరికి ఒక నిశ్చయానికి వచ్చేటప్పటికి 'లిడ్డి' గూడ వచ్చి చేరింది.

"సరే! రాండల్! నీవు మళ్లీ పీబడీస్ దగ్గఱికి వెళ్లుతా ననుకొంటూను."

"అవును నాన్నా! వాళ్ల దగ్గఱికి పోవడానికి నీ కభ్యంతరరి లేదుగదా!"

"ఆహా! అటువంటిదేం లేదు. వాళ్లు మంచివాళ్లనినాకు తెలుసు.—కానీ, శిల్పశాస్త్రము..." అంటూ చేయాడించి, "కానీ, నీ ఆశయాలకి విరుద్ధంగా నేను కోరుతున్నా—లేదు—నీవుంటావని ఆశిస్తున్నాను."

తన ఉద్దేశ్యాన్ని తెలుపడానికి చిఱునవ్వు నవ్వాడు.

"నీవు, అలైస్ ఇక్కడే యిల్లు చూచుకుంటారని తలుస్తాను."

రాండల్ అర్థం చేసుకొన్నట్లుగా తల ఆడించాడు. "నాన్న ఆవిధంగా సలహా ఇవ్వడం బాగుంది. ఇదే ఎప్పుడు నాయిల్లు. కానీ, అలైస్‌ను ఎలాగో సమాధానపరచాలి?"

డబ్బు విషయం సులభంగా తేల్చవచ్చు. "మనమే మంత ధనవంతులము కాము. కానీ, పిల్లలకు, మీకు ఆస్తిపెట్టి పోయింది మీ అమ్మ—సాధారణంగా మనము పొదుపుగా నివసిస్తున్నాము. నీ జీతం కొద్దిదేమైనా, అదే మనకు సరి పోతుంది—మనము ఇంకో పని మనిషిని, నర్సును పెట్టుకోడానికి వీలుంది."

అది మొట్టమొదటి సర్దుబాట్లు. అవి అయిన తరువాత కొద్ది రోజులకు—రాండల్ తన నగరవాస దుస్తులను చలవచేసి వేసుకొని ఆఫీసుకి వెళ్లాడు.

మెల్లెక్కుతూ నిట్టూర్చినాడు. అడుగులు నెమ్మది బడ్డవి. అతడు తన భవిష్యత్తు కాధారంగా నున్న ఆఫీసును అసహ్యమైన చెఱసాలగా చూచి నిశ్చేష్టుడైనాడు. ఇవతల ఆఫీసు కెదురుగ గాలిరావడం లేదు. మిస్‌విల్‌కిన్స్, అతన్ని ఆహ్వానించి, 'మిస్టర్ పీబడి నిన్ను చూస్తాడు'. అని అంది.

అతడు కుడివైపు తలను సవరించుకొని, ఆఫీసు లోపలికి అడుగుపెట్టాడు.

"ఓ—హో! గారట్సన్ మళ్లీ వచ్చావా?"

స్థూలకాయుడు, అసహ్యంగావున్న దుస్తులతో, నల్లని రిబ్బన్‌తో కట్టిన ముక్కద్దాలతో, గట్టి శరీరంతో తన పని మీద భక్తి విశ్వాసం గలవాడు కూర్చొని ఉన్నాడు. "నీకు అప్రియాన్ని చెప్తున్నానేమో? హెడ్ ఆఫీసర్ కొన్ని మార్పులు చేయాలన్నాడు—అంటే, పనివారిని తగ్గించదలచాడు. కానీ, అది కొద్ది కాలానికి మాత్రమే. ఇక్కడ నీవు చేయగలిగినంత పని ఏమీ లేదు. అల్లే—" అతడు తడబడ్డాడు. కళ్లజోడు తీసి పెట్టుకొని చెప్పడం మొదలుపెట్టాడు." గ్రిగోరి, జాన్‌సన్ చాల లాభదాయకంగా పనిచేసేరు. జాన్సన్ ఉక్కుకట్టడాలలో పని చేస్తుండే వాడు; ప్రాక్టికల్ ఇంజనీరింగ్; మాకు అటువంటి మనిషే కావాలి. తెలిసిందా? గ్రిగోరి వ్యాపారాభివృద్ధికి మిక్కిలి పాటుబడుతున్నాడు. సౌందర్యాన్ని ఆరాధించే నీకు,

నాకు. మనవంటివాళ్లకు స్థానంలేదు. అటువంటి జ్ఞానమే అవసరం. ఏమంటావ్?"

రాండల్ మళ్లీ వీధిలోకి తిరిగివస్తూ, ఏమీ జరగనట్లుగా మొదటిసారి భావించాడు. ఈ పూర్తి సీను—నాటక రంగంపై జరిగినట్లున్నది. ఎన్నో ఆలోచనల్తో తానొక్కడు ఏకాంతజీవి అయినట్లు—మిగతా పట్టణమంతా ఏమాత్రం ప్రాముఖ్యం లేనట్లు—తలుస్తూ నడుస్తున్నాడు. "పీబడీ మొదలుకొని అందరు కనీసం మానవమాత్రులే, కానీ తనో—కామ్టన్‌లోని రాండల్ గారట్సన్; గొప్పవేదాంతి; దైవ ప్రకృతులకు చాల సన్నిహితుడు. దీనిలో అసత్యం ఏమీ లేదు—ఏదో ఒక చిన్న కల. ఒక విధంగా మిస్టర్ పీబడీ విడుదల చేసి జాగ్రత్తగా నన్ను నాకు ఒప్పగించాడు?"

## 9. అధ్యాయము

"రాండల్! నీవనేది...ఏమిటి?"

"అవును! అదే నేను చెప్పింది."

"నాకేం. అర్థం కావడం లేదు. అసలు ఇంతకీ ఏం జరిగిందీ"

ఆవిడ గుండ్రని ముఖం, కండ్లు అతనిలో కోపాన్ని రేకెత్తించినయి. "నేను భావకవిని. నీవుదాన్ని తెలిసికొనుండాల్సింది మొదటనే."

"క్షమించండి రాండల్! నీవు చెప్పేది నాకేం అర్థం కావటం లేదు."

"దీంట్లో అర్థంకాక పోవడానికేముంది? పీబడి అండ్ పీబడి కంపెనీవారు వాళ్లకు ఇక మీదట బల్లలు, లాంతర్లు తయారు చేయడానికి ఏవిధమైన మనిషి అవసరం లేదని తెలిపారు."

"కానీ, రాండల్!—" ఆవిడ ముఖం దుఃఖంతో మెత్త బడింది.

"న్యూ జెరుసలేమ్' ముఖ్యంగా ఆఫీసులను, కంపెనీలను కోరుకుంది—" అతడు తన్ను తాను సర్దుకొన్నాడు, "లేదు అలైస్! నిజం ఏమిటంటే, నవీన నాగరికతా పురోభివృద్ధికి నేను అలవాటుపడలేదు. నేనొక క్రొత్త ప్రపంచాన్ని సృష్టించేంత వాడిని కాను. నీవు పొరబడ్డావేమోనని భయపడుతున్నా-- అంటే నీ భర్త నువ్వనుకొన్నంతటివాడు కాడేమో! అను కొంటున్నాను."

"రాండల్! అల్లా. అనర్థంగా మాట్లాడకు. నేను నిన్నెం దుకు పెళ్లి చేసికొన్నాను?---ప్రేమించాను కనుక." ఆవిడ ఏడుస్తూ కూలబడింది.

వాళ్లు మిద్దెమీద బెడ్ రూములో నుండగా తెల్ల వారింది. రాండల్ ప్రకాశిస్తున్న విశాలమైన పంట పొలాలను నిశ్చలంగా చూస్తూ తన తలంపులను చేకూర్చుకోదలచాడు.

"నాకు కొన్ని ఆశయాలున్నై అలైస్!. ఇప్పుడు నశించినట్లే ఉన్నా, కడపటికి అలాకావు."

"రాండల్! నీలో నేర్పున్నది, నీవు చాల సున్నితమైన స్వభావంగలవాడివి— నేను ఏడవకుండా ఉండలేను ధైర్యం

తెచ్చుకున్నా ఆ విషయం భయంకరంగా కాలిక్రింద భూమి నిలవడం లేదు." ఆవిడ పెద్దగా ఏడుస్తూ కొంచెం సేపటికి సర్దుకొంది.

"అసలింతకీ, పీబడీ ఏబన్నాడు?"

"అతడెట్టి సలహాగూడ ఇవ్వలేదు"

"రేపు వెంటనే నీవు బయలుదేరాలి.

నేనే గనుక అయినట్లైతే నేరుగా జడ్జి హిగ్గిన్‌సన్ దగ్గఱికి వెళ్లియుండేదాన్ని. అతడు బంధువే కాకుండా మ్యూజియానికి ట్రస్టీగూడ. అతనికి చాలా మందిని తెలుసు; మంచి వాడు. అమ్మ ప్రతి విషయాన్ని ఆఁమనతో సంప్రతిస్తుంది. అతడు నిన్ను పెద్దవాండ్లతో పరిచయం చేస్తాడు."

రాండల్ చెట్లమీద వెలుగు తగ్గడం చూస్తూ నిల్చున్నాడు. "నేనే మనుకొన్నానో, ఏవిధంగా చేయదలచానో నన్ను చెప్పనియ్."

"తప్పకుండా—నాకు చెప్పు రాండల్! రేపు నీతో బాటు వస్తాను-రావచ్చా? నాకిక్కడ ఒంటరిగా ఉంటుంది—నీవు లేకుంటే-లిడ్డి నన్ను తగినంతగా ఆదరిస్తుంది. కానీ, నీవు లేకపోతే నేను పనికిరానిదాన్ని, అనుకుంటా. వీలైనంత వరకు నీతోబాటె ఉంటాను. కొంత బజారుపనికూడా చూడాలి.

"ఇంతకూ, నేను రేపు బానుకు వెళ్లడం లేదు. ఇక వెళ్లను గూడా. ఇదే తీర్మానంగాదనుకో! నేను ఎన్నో పనులు

చేద్దామనుకున్నాను - కొన్ని వ్యాసాలు, పద్యాలు, ఒక పుస్తకం. దానికిదే తగిన పరిసరం, సాంప్రదాయమైన ప్రదేశం, కామ్‌టన్ గ్రామం ఒక పెద్ద కళాస్థానము. దీన్ని ప్రపంచ భాషల్లోకి అనువదించి దాని ప్రశస్తిని ప్రకాశిపజేయాలి."

"రాండల్! నాకేం అర్థంకావడంలేదు. నీ భవిష్యత్తునంతా నాశనం చేయదలచుకొన్నావు."

"నా భవిష్యత్తు——(అతని ముఖవైఖరి, మందహాసం) నేను ప్రశస్తమైన భవిష్యత్తును దెలిపాను."

"రాండల్ !!"

"ఆఁ! ఏమిటీ ?"

"నీవు దేన్నిగురించి మాట్లాడుతున్నావో, దయచేసి తేట మాటల్లో చెబుతావా? నీవు నగరానికి వెళ్లాలనడాన్ని అర్థంచేసుకొన్నా. ఇప్పుడు సరిగ్గా ఎక్కడున్నామ్?"

"సరిగ్గా ఇక్కడే!" తొందరతో చేయూపి, "దేవుని దయవల్ల ఇది యిల్లే లే?"

"ఎప్పటికీనా?"

"సరే! ఎప్పుడూ ఉంటామా? అని చెప్పలేను. ఎప్పుడూ ఉండగలిగితే బాగానే వుంటుంది."

"నీవు చెప్పడం ఈ రూములో ననేనా?"

"ఈ రూమూ?" అతడు 'కిచన్ టేబిల్‌క్లాత్'లాగా ఎర్రని తెల్లని మచ్చలుగల ఆమె ముఖాన్ని చూచాడు ఊపిరి బిగబట్టి "ఏం? ఈగది, యీ యిల్లు, యీ ప్రదేశం?..."

"మీ తండ్రి, సోదరి ఎక్కడుంటారు?"

"వాళ్లుగూడ ఇక్కడే ఉంటారు. కాని, అలైస్..."

"మీ భార్య అద్దెయిస్తుందిలేండి, అందుగ్గాను కొన్ని సమయాల్లో నడవగదిని ఉపయోగించుకోనిస్తా రనుకొంటాను?"

"అయ్యో! దైవమా?"

"ఆమె పరిచయులు వచ్చినప్పుడే ననుకోండి-అది కూడ అనుదుగానే, తక్కిన సమయాల్లో ఆవిడ ఈ-చక్కని ఎలుక బోనువంటి రూముల్లో వుంటుంది. అది సొంతంగానే ఆవిడ భావిస్తుంది లేండి."

"అలైస్! అవా విధంగా తలచగూడదు. నాన్న, లిడ్డీ గూడా..."

"రాండల్! ఛీ! మూర్ఖుడా?" ఉన్నట్లుండి కోపంతో అరిచింది. అలైస్ ముఖం పాలిపోయి చెమ్మగిలింది. "నీచుడా! నీవు—నన్ను గృహోపకరణంగా, మెత్తని పావురం-అని అనుకుంటున్నావేమో? అర్థం చేసికోలేని స్వార్థపరుడవు, నీవు—మనిషివి కావు. నీ హృదయంలో దయా దాక్షిణ్యాలు రవంత లేవు. అసలు—ఏదీ లేదు. వాళ్లంతా నే నెంతో అదృష్టవంతు రాలినని ఆనందంతో వుంటుందన్నారు.——ఇదో ఇక్కడ వున్నాము.-ఇక్కడే-మమ్మల్ని చూడండి. కలకాలం అధ్వాన్నమైన పడక గదిలో త్రోయబడియున్నాం"

ఆవిడ ప్రక్కమీద విసురుగాపడిపోయి ఏడ్వజొచ్చింది.

రాండల్ నివ్వెఱపడి తెల్లబాఱిన మొగంతో నిల్చున్నాడు.

విచిత్రమైన శాంతితో ఆవిడన్నది. "నాకు ఎన్నో ఆశయాలుండినయి. నేనుగూడ మూర్ఖురాలినే. ఇప్పటిదాకా నే నేదో నటిస్తూ వచ్చాను.''-పిల్లలూ; రాండల్ నేను భరించ లేను.''

ఆవిడ మనసు విరిగింది-అతని కళ్లు చెమర్చినయి; ఊపిరి కొట్టుకలాడింది.

,,అలైన్! నేను...నీవు అలా!---" ప్రయోజనం లేదు' అతడు ఆవిడ దగ్గర క్షణకాలం నిలిచాడు; తట్టాడు; తన తల, పై నగ్గుకొని అడుగులేస్తూ క్రిందికి దిగాడు. ఇంకా బ్రేక్‌ఫాస్టుకు వేళ కాలేదు. చీకట్లో షికారుకు బయలుదేరాడు_గబాగబా నడచిపోయి, మెల్లగా వెనక్కు-వచ్చాడు. అక్కడి చెట్లలోను, ప్రశాంతమైన నల్లని ఆకాశంలోను. ప్రశాంతి కనుపించలేదు. చులుకైనబుద్ధి మొద్దుబారింది. తన పెళ్లినాటి దృశ్యాలు, నిష్కలంకమై పవిత్రమై స్వర్గంవలెనున్న కారోలిన్ రూపం, అతని కంటి యెదుట నిలిచాయి. అలైను స్వప్నం అత్యల్పం. కాన్నీ, అతడు బాగా దుఃఖించాడు. తిరిగి వస్తూ ఉప్పగా కన్నీరు నోట్లోకి కారడం గుర్తించాడు. ఇప్పుడతను చేయ గలిగిందల్లా—సర్దుకొని పోవడమే.

## 10. అధ్యాయము

"నీ వెప్పుడైనా ఒక తల్లి, తన బిడ్డను గురించి పడిన కష్టాలను చెప్పుతుంటే, ఆవిడకు కష్టమంటే ఏమిటో తెలియ దని నీవు నిర్ధారణ చేసికోవచ్చు!' అని అతడు చెప్పాడు.

అతడు న్యాయప్రవర్తన గలవాడు. రాత్రుల్లో అరుపులు వినగనే చలిలో తిరిగివచ్చి, డాక్టరుకోసరం కాచుకొనేవాడు. తనతండ్రికి పిల్లలవల్ల సందడి గొడవ లేకుండా చేసేవాడు.

అతడు నియమంగా ప్రతి ఉదయం, వాల్టర్ స్కాట్ వంటి పెద్దవాళ్లకుమల్లే—నిజంగా నాన్నమాదిరి వ్రాస్తామనుకొన్నాడు. ఇంటిల్లిపాది తన నియమాలను పాటించేటట్లు ఆదేశించాడు. ఒక ఏడాదిపాటు సాగింది. పిల్లల అల్లరి తన నిశ్శబ్దాన్ని భంగపరచి, జీవితంమీద విసుగు కలిగించింది.

"రాండల్! వాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు" అంది అలైస్.

"ఆ! ఏడవకయ్! నీవు – నీపెంపకం – వాడ్ని చెడగొట్టున్నావ్. బిడ్డలదగ్గర నీ అరుపులు నాన్నను లేపుతవి. తెల్లవారి ఆయన ఏమన్నాడో తెలుసా! "అతని బిడ్డలు ఎప్పుడూ ఈ విధంగా ఉండేవాళ్లుగాదట. లేదు – అతని భార్య చనిపోయినా, వాళ్లు శాంతంగా ఉండేవాళ్లట. బిడ్డల్ని చూస్తుంటే విసుగేస్తున్నది. ఈ మైదేండ్లగా ఒకరాత్రిగూడ సరిగా నిద్రపోలేదు! ఛీ! అరవకు. నీ గొడవకు తాతయ్య లేస్తాడు. రాల్ఫ్! నడవలో అలా పరుగెత్తకు; హేయ్ జీన్! మెల్లగా నడవలేవూ?– ఇల్లు కదలించేస్తున్నావు. రాత్రింబగళ్లు ఇదే వరుస – రాండల్! ఇంక నేనిది భరించలేను ఏమాత్రం!'

స్టీవ్ అల్లరివాడయ్యాడు. అలైస్ తరుచు క్లాసుకు వెళ్లడం ప్రారంభించింది. చెల్లెలు మే మంచికార్యాలు చేసింది. అలైస్ పూర్వం మాదిరి సంతోషంగా వుందామనుకొంది.

సెటిల్ మెంటు హౌసులంటే చాలకాలం పడుతుంది. కమిటీలలో సేవచేసి, సభలకు వెళ్లి నిధులను చేకూర్చి పనిచేయవచ్చు నను కొంది.

మే తోబాటు అలెక్స్ గూడ సమితిలో చేరింది. ఈ విషయం కామ్టన్ తో చెప్పలేదు. అలెక్స్ గ్రామ నగరాలకి రెంటికి అనుకూలంగా జీవితం జరపవలసి వచ్చింది. గారట్సన్ తాతయ్యకు స్త్రీసంఘాలంటే కోపం; అందువల్ల ఆ విషయం ఆయనతో చెప్పలేదు.

మే ఒక ఆదివారంనాడు - ఒక యేడాదికి తరువాత మొదటిసారిగా చూడవచ్చింది. అప్పుడున్న ఫాషన్‌కు అనుగుణంగా కొద్దిగా ప్లెయిన్‌గావున్నా చాల అందంగా వుంది. ఆవిడ ముఖంలో ఎముకలు కనుపిస్తూన్నా వింత అందాన్ని చేకూర్చింది.

భోజనానంతరం మే, రాండల్ సాయంత్రపు నీరెండలో గ్రామంవైపుకి షికారు వెళ్లారు.

“నీవు అప్పుడప్పుడు వస్తూవుంటే బాగుంటుంది; గ్రామాలుగూడ నచ్చుతయి.”

“నీవు అన్నిటికంటె గ్రామాల్ని ప్రేమిస్తావుగదూ రాండల్!”

“అన్నిటికంటెకాదు మే? ఇదే నాకు సర్వం. మనమంతా దీంట్లోనే వున్నాం.”

“అంటే- దేవుడివల్లనా రాండల్?”

"ఆ! సరిగ్గా అదే! నీవు ఆ విధంగాకూడా చూస్తావా ?" అతను తలమెత్తి ఆవిణ్ణి చూచాడు. అదే మొదటి సారిగా ఆవిణ్ని చూడడం.

"కానీ, అలైక్సను మాత్రం నా మార్గానికి తీసుకోలేక పోతున్నా. ఇచ్చట జీవితం ఎంత ఆహ్లాదకరంగా వుంటుందో అర్థం చేసుకోలేదు. నేను చెప్పినట్లుగా నీకు తోచటం లేదూ?"

"నేనొక వేదాంతిగా వుండాలని చూస్తున్నావా రాండల్?"

మళ్లీ ఆపె కేసి చూచాడు. తియ్యనినవ్వు, మాటల సొంపు, తిరిగీ అతనికి వచ్చాయి. "మొత్తానికి నీవు తెలివిగల పిల్లవే?"

ఆవిడ తలను వాల్చింది. ఆవిడ ముఖతేజస్సు మెల్లగా ప్రకాశించింది. అప్పుడు అతను గమనించ దగ్గదల్లా, చూడడా నికి బాగుందని.

మే తలమెత్తి. "సరే! నేను చెప్పడానికి ప్రయత్ని స్తున్నా" ఆవిడ మాటలు తీక్ష్ణంగా, ప్రశాంతంగా! మధురంగా వున్నవి. "నీవు ప్రకృతినే సర్వమని భావిస్తావు. నీవు సత్యాన్ని, సౌందర్యాన్ని తలచేటప్పుడు–వాటిని చెట్లు, మంచు, మబ్బుల్లో చూస్తావు. ప్రకృతిలో మానవత్వం ఇమిడియుందని అంటావను కుంటా. మనమంతా పక్షులు, మృగాల్లాగ ఈ భూమి బిడ్డలం' పరిహాస ధోరణిలో–"నిజంగా నువ్వు మనుష్యత్వాన్ని వదలి పెట్టుతున్నావు?"

"లేదు మే! నిజంగా—నిగ్రహం చేసికోలేదు. ప్రతిమనుష్యుడు– ప్రతిప్రాణి—ఈ ప్రకృతిలో బ్రతికి, జన్మసాఫల్యాన్ని పొందుతుంది." 'కొండలపై దృష్టి సారిస్తాను. అంతా అంతే—మే!'

ఆవిడ చిఱునవ్వునవ్వి, తల ఊపింది. "కాని, రాండల్! అది నీకొక్కడికే నచ్చుతుంది. నీకు ఈ ఏకాంతానికై - నాకే గనుక కలకాలం గ్రామంలో జీవించవలసిన గతి పట్టిందంటే - ఏ విధమైన శబ్దము మానుషస్వరము లేకుండా దీనికంటె నేను మరణాన్నే వరిస్తాను."

రాండల్ జాగ్రత్తగా పలికాడు. "కాని, నీవు మాత్రం మమ్మల్ని అప్పుడప్పుడు చూస్తుండాలి."

"రాండల్! నేను ఏ జోక్యాన్నైనా కలిగించుకుంటే క్షమించు. అలైస్ నిరుత్సాహపడిపోయింది—నీకు అలా తోచటంలేదూ?"

అతడు జాగ్రత్తగా మాట్లాడాడు. "అవును! నీతో నేను ఒప్పుకుంటాను." ఆవిడ నిరుత్సాహపడింది.

"నీవు ఆవిడకు మార్పుగలగటానికి ఇక్కడినుండి వెళ్ళలేవా?"

ఆతడు తటాలున తిరిగాడు. "మే! నాకు నిజంగా అర్థం కావడంలేదు. మావల్ల నయినంతవఱకు మొదటినుండి ఆవిడ సుఖంగా వుండడానికే చేసాము. లిడ్డీ చేసిందానికంటె ఇంకెవరు

ఎక్కువగా సహాయం చేయరు. చాలకాలం వాసేది చేసింది, ఇంత చేసినా గాకా - ఊం! సరే! నీవు చెప్పినట్టే..." కానియ్యి

"రాండల్! అసలు సంగతేమిటో చెప్పరాదూ?"

"నిజంగా ఏముంది? ఏదో చిన్న చిక్కులున్నాయంటె సరేగాని, పెద్ద అవస్థ ఏమీ లేదు."

"సరే! ఇది-ఇల్లు తన సొంతంగాదని-చాలామంది స్త్రీలు అట్లా భావిస్తారు. అందులో అలైస్ కొంచెం ఎక్కువగా నేమో?...అటువంటి విషయాల్లో దానికి పట్టుదల ఎక్కువ!"

"కాని, ఆవిడ ఇది తనదిగా చేసుకోవచ్చుగదా? బిడ్డలతో పాటు నేను, లిజ్జీ ఈ విషయంలో నచ్చచెప్తున్నాం"

"నువ్వో నేనైతే ఇంకేదన్నా మార్గం చూచేదాన్ని. ఆవిడని, బిడ్డతోగూడ ఇంకో యింటికి మార్చేదాన్ని."

ఆ సలహా అతన్ని ఆశ్చర్యపరిచింది. "మేం మా విధంగా చేయడానికి లేదు. అది జరగని పని." అన్నాడు తీవ్రంతో.

"ఎందుకు కాదు రాండల్?"

"ఊం! అది అర్థంలేని పని. నీవనేది, ఈ వూళ్లోనా? కామ్టన్‌లోనా?"

"అవుననుకో! పట్టణంలో అయితే, అలైసు ఇంకా ఉత్సాహంగా వుండేది."

"మే! నేను పట్నంలో వుంటానని తలుస్తున్నావా?"

"కాదనుకో, రాండల్. కాని, అలైసును కాపాడడానికదే మార్గం."

"కాపాడటమా? నిజంగా ఆవిడకంత కష్టమేమివచ్చింది!"

"అవును. అది అటువంటిదే!"

"అటువంటి అరేంజిమెంటు చేయడానికి శక్తిలేదు. నా ఆదాయం చాలతక్కువ... నేనేమంత గొప్పరచయితను కాదని నీకు తెలుసుగదా? ఎక్కడో యిక్కడ సర్దుకొని, సుఖంగా ఉండటానికి యత్నించాలి."

మే మ్మాట్లాడలేదు, మారటం జరగనిపని అని రాండల్ మళ్ళీ అన్నాడు.

"ఈ ప్రపంచంలో నీవంటివాడు లేదని అనుకొనేదాన్నని తెలుసా రాండల్? నన్నడిగితే, మనిషికుండదగిన అందం నీలో వుంది!' అతడు ఉప్పొంగిపోవడం చూచి, తానూ అట్లే తలచింది. "నీ ముందలి ఇటువంటి మాటలు చెప్పకూడదు. ఐనా, నా అక్కకోసం విచారిస్తున్నా. నీకు హృదయం లేదు—వలపింపు లేదు. అలైసు ప్రేమకోసం బ్రతుకుతున్నది. అందరు గాలినెల్లా కోరుతారో, అల్లాగ అలైసు ప్రేమను కోరుతున్నది. రాండల్! నీకు నిజంగా మనుష్యులంటే లెక్కలేదు. నివాకవిధమైన నిర్మానుష్యంలో జీవిస్తున్నావు. దానికై అలైసు కృశిస్తున్నది.

రాండల్ పెదిమలుబిగబట్టి దృఢంగానిల్చున్నాడు. నీవు చెప్పిన సత్యం అంత సులువైందిగా [illegible] కుణా ఆగాడు.

"నిజంగా నేను విధంగా పలుకగలేదు. సర్దుకుపోవడానికి ప్రయత్నించాం ఎంతో ఎక్కువగా.

"కనీసం అల్లైసును ఈ వేసవిలో 'మెయిన్'కన్నా తీసుక వెళ్లు!"

సరేనన్నట్లు తలవూపించాడు. "మే! నీవు చక్కగా చెప్పావు. ఎప్పుడూ నీవు సరిగ్గా చెప్తుంటావు"

ఆవిడ అతనికేసి చూచింది! 'అవును. ఎప్పుడూ కాదు. కొన్ని సమయాల్లో తప్పే చెబుతుంటాను!"

## 11. అధ్యాయము

అల్లైసు వేసవికి ముందు జబ్బుపడింది. "నేను ఇంటికి వెళ్లాలి. అంది ఉన్నట్లుండి.

డాక్టరు జీవిట్ మెల్లగా నవ్వి "నీవు అక్కడే ఉన్నావనుకో"

"అమ్మ కావాలి"

"ఆవిడ వస్తుంది. ప్రశాంతంగా వుండు ప్రస్తుతం"

"నెమ్మదిగా నేనిక్కడ ఉండలేను; చచ్చిపోతాను." ఆవిడ స్వరంలో భయం తోచింది.

"మేము ఏర్పాటు చేస్తాములే. కొన్ని నిమిషాలు విశ్రాంతి తీసుకో." "ఆవిడకు ఆస్పత్రిలో బాగుంటుందనుకుంటాను లిడ్డీ? అయినా రాండల్ని అడిగి చూడు..."

"లేదు." అలైసు స్వరం హెచ్చులోనుంది. "నేనింక ఇంటికి వెళ్లడమో? లేక ఇక్కడ చావడమో?"

డాక్టర్ జీవిట్ తలయూపి, "సరే! అలైసు! నేను రాండల్‌తో మాట్లాడుతాను."

నిస్పృహతో ఏడుస్తూ అంది. "డాక్టర్! నీకర్థం కాదు. నీవు—నీవు—ఆ విధంగా ఉండకూడదు. నాకు బాధగా వుంది— నేనంతా తప్పే చేశాను...ఇక్కడ తల్లిగా, భార్యగా... నే ననుకొన్నట్లు ఏమీ జరగలేదు. నా కిక్కడ నిరాశ తప్ప ఇంకేమీ ఉండదు. నేనతని జీవితాన్ని పాడుచేసానట!

వాళ్లు నిజం చెప్పలేని నాగరికులు. నన్ను నాశనం చేశారు. ... నేను మళ్లీ యీ యింటికి రాను; ఉండలేను. డాక్టర్! ఆ బిడ్డల్ని ఏంచేయడం? చాలా మంచిపిల్లలు. వాళ్లు వివిధమైన కష్టాలు లేకుండా బ్రతుకుతుంటే, నేనిట్లా ఉండే దాన్నిగాదు నిజంగా. ఇప్పుడైనా వెళ్ళవచ్చా డాక్టర్?"

"అట్లే—త్వరలోనే" అతడు ఆవిడ వెచ్చని ముఖంమీద కన్నీటి బిందువులను పైకి దువ్వాడు."

డాక్టరు జీవిట్, రాండల్ సమాధానపడేటట్లుగా చెప్ప వలసి వచ్చింది. "ఆవిడకు మాటయిచ్చాను. ఆవిడ వెంటనే వెళ్లిపోవాలి"

"అందుకు నాన్న ఇష్టపడడు. విరుద్ధంగా వుంటుంది." అన్నాడు రాండల్.

"ఇదే ఆవిడ ప్రాణాల్ని రక్షించడానికి సదుపాయం. ఆంబులన్సును పిలిపించాను. మీ నాన్నను, ఇరుగు పొరుగు వారిని తరువాత సమాధాన పరచుకోవచ్చు."

ఆవిడని తీసికొని వెళ్లారు.

రాండల్, అలైసు తల్లి సోదరుల సలహాలతో మారి పోయి, తనగదిలో వుండటంమానాడు. ఏడేండ్ల తరువాత మళ్లీ మొదటి పరిస్థితికి వచ్చినట్లుగా భావించాడు మేడక్రింది వరాండాలో పచారుచేస్తూ.

మిసెసు హాలిస్టర్ క్రిందికి దిగివచ్చింది "మిద్దెమీది చిన్నగదిలో ఉండవచ్చు. అక్కడ నీకు బాగానే యుంటుంది."

"నేను డాక్టరు జీవెట్‌తో మళ్లీ వెళ్లుతున్నాను"

"అరే!...అలాగా? నేననుకొన్నదేమిటంటే? – బిడ్డల్ని చూచుకోవలెనని."

"ఆఁ! అవునులే, నీవు అంత బాధ్యతతోనుంటున్నావు. నాకు ఎంతో సంతోషం. నీవేం విచారించనక్కర్లేదు ... వాళ్లు తల్లిచేతుల్లో ఉన్నారని గుర్తించుకో. ఇక్కడ నీవేంచేయ నక్కర్లా!... నేననేదేమిటంటే? నీవెప్పుడైనా రావచ్చు; ఉండ వచ్చు...నాకు సంతోషమే?...నీకేది మంచిదో అలాచెయ్."

డాక్టర్ జీవెట్, రాండల్ కామ్‌టన్‌కు బండిలోవచ్చారు. నిశ్శబ్దమైన వీధుల్లో ఇంటివైపుకు నడుస్తూ ఇల్లా మాట్లాడు కున్నారు.

"నీకు అర్థం అయిందనుకుంటాను రాండల్? ఈ జబ్బు, మనస్సు అశాంతి పొందటంవల్లనే శారీరకంగా చాల బాధ కలిగింది.

"అవును. నాకుగూడా తెలుసు."

"అరే! నీకు తెలుసా?"

"అలైన్ ఇక్కడ ఉండటానికి రాదనుకొంటాగా?"

"కాదుగానీ, నాసలహా ఏమంటే-ఇక్కడికి తీసుకరాకూడటమే?"

"మానసికంగా నాకుగూడ సలహా ఇవ్వండి డాక్టర్?"

ఆ ముసలిడాక్టరు తల ఆడించి, చిఱునవ్వునవ్వి, "వాతావరణం మార్పు చేయడం మంచిది అని డాక్టరుగా-చెప్తున్నాను. కాలిఫోర్నియా బాగుంటుంది."

"నాకుగూడా డాక్టర్?-పిల్లలకు కూడానా?"

"అవును. నిశ్చయంగా అందటికీని."

"కానీ, రాండల్ గొంతు తడబడింది-, కానీ,-ఇదీ-ఇదేనా జీవితం."

"అవును. నా కర్థమయింది. కాని ఇతరులకుగూడా, జీవితాలు, జీవితమార్గాలు ఉన్నాయి-గుడ్ నైట్ రాండల్."

రాండల్ ఇంటికి వెళ్లాడు. డాక్టరు మాటలు మెదడులో-పై భాగంలో నిలిచాయి. కాలిఫోర్నియాను చెప్పాలంటే చంద్ర

మండలం దాని వెనుకవైపు—పాత సమీపం కాదో, అట్లావుంది. రాండల్ మనస్సు ఈ ప్రదేశాల రొంటిలో కొట్టుకులాడుతున్నది. తనకు తెలిసినంతవఱకు ఈ కామ్‌టన్ ఒక్కటే మొదదులో మెదులుతున్నది.

జూన్‌లో అలైన్ జబ్బునుండి తేరుకొనునప్పుడు చూడడానికి వెళ్ళాడు. అప్పుడప్పుడు చూచాడుగాని, ఈ సారి పలుకరించి విషయం తెలపాలనుకొన్నాడు. ఇప్పుడావిడ కూర్చొంటున్నది; ఇంటిచుట్టు తిరుగుతున్నది. ఆవిడ అనుకోనంత ఆనందంగా వుండడం రాండలుకు అసూయ గలిగించింది.

పెద్దగా నిట్టూర్చి, మృదువుగా, "అలైన్! మనమంతా 'కాలిఫోర్నియా'కు వెళ్లుదామనుకో—నీవు, నేను, పిల్లలు—"

"అక్కడ కాపురముండటానికేనా?"

"అవును. అక్కడుండటానికే"

"కామ్‌టన్ను వదలిరావడం నీకిష్టమున్నట్లా." అలైన్ ముఖం పాలిపోయింది. 'ఎప్పటికేనా? అక్క డెట్లా బ్రతికేది?'

"నాకేమైనా పని దొరుకుతుందని, అనేకంగా శిల్పవృత్తివాళ్ల మాటల్నిబట్టి అక్కడ భాగ్యానులంతా జరుగుతున్నాయని—"

ఆవిడ ఆగి సంశయంతో, సివ్వోఆశ్చర్యంతో చూచింది "నీవెందుకు ఈ విధంగా, ఈసంగతి తెచ్చావో నాకర్థంకాలేదు."

"ఊఁ నీవు– –" దుఃఖంతో ఆగి, "మనమంతా కలిసి యుండడానికి, ఇదొకటే మార్గం."

"మనమెందుకు కలిసియుండాలి?"

"మనం పెండ్లి చేసికొన్నాము గనుక"

ఆవిడ ముఖం ఎఱ్ఱబడడం గమనించాడు. 'మరి పిల్లలు?' అని వేగంగా అన్నాడు.

ఆవిడకు ఏడ్పు రాలేదు; కాని కోపంవచ్చింది.

"ఆ బిడ్డల్ని నా నెత్తినెయ్యకు రాండల్? నీవెల్లా బ్రతుకుతున్నావో? వాళ్లు అల్లాగే అఘోరిస్తారని అనుకుంటా!'

"వాళ్లని వదలివేయటం లేదు, వాళ్లకొక మంచిగృహాన్ని కల్పిస్తామని?– –"

"ప్రియం లేనియిల్లు– – అదేం లాభం?" అంటు ఆవిడ పోరాకలేసింది. "నీవెప్పుడన్నా తలకెక్కించుకొన్నావా? ప్రియం లేకుంటే ఏది బాగుండదని."

"ఇంతకీ నీ సలహా నేమిటీ?"

"రాండల్! నేను చెప్పగలిగిందల్లా, నీవేమో మంచి వాడివి. నీ నియమాల్ని కచ్చితంగా ఆచరిస్తావు. నీవు ఈ ప్రదేశాన్ని వదలి పడమటివైపుకి వెళ్లుతానన్నప్పుడు – కామ్టన్‌ను వదలి–అది నీకెంత ప్రియమో! నాకు తెలుసు. నా అభిప్రాయాలు నీ ఉద్దేశ్యాలతో ఏకీభవించవు; మొదటినుంచి ఇంత

జరగడానికి కారణం నా తప్పే. నేను జబ్బులో నున్నప్పుడు అంతా ఆలోచించుకొన్నాను."

అలైస్ మళ్ళీ కుర్చీలో కూర్చుంది. ప్రశాంతంగా - గర్వంగా ఆవిడ ముఖం యధారూపాన్ని పొందింది. కోపం చల్లారింది. ఈ శతాబ్దంలో స్త్రీలు ఏ విధంగా పురుషులలో వాళ్ల హక్కుల్ని గురించి తయారుచేసికొన్న ఉపన్యాసాలుగా మాట్లాడింది. మనుష్యుడు స్థాపించిన సంఘాల్లోని లోటుపాటు లను ఆవిడ నిర్దేశిస్తుంటే, రాండల్ తలవంచి ఒప్పుకోవలసి వచ్చింది. స్త్రీలకే గనక కనీసం సగం అవకాశం ఇస్తే, సామాన్యవిషయాన్ని నిష్కల్మషంగా ఎలా వాళ్లు తయారు చేస్తారో? అనేదాన్నిగూర్చి ఒక అభిప్రాయ మిచ్చింది.

"క్లబ్బులకు,- వాటికోసరం తిరిగి, సాధించి కష్టించి పనిచేయడం అద్భుతంగా వుంటుంది. నిజంగా రాండల్! నీవు, మేము--ఏంచేస్తున్నామో? అని తెలిసికొంటే ఆశ్చర్యపడ తావు."

అతని శాంతమైనముఖం మెరిసింది. "సందేహం లేదు." స్వరంలో దార్ఢ్యం తోచింది. "నీవు చాలా గట్టిగా నిశ్చయించు కొన్నట్లున్నావు? ఇంతటితో మనపెండ్లి ముగింపుకొచ్చిందన్న మాట." నిశ్శబ్దం. "అది సత్యమేనా అలైస్?"

"రాండల్!" అంటు ఏడ్వడం మొదలుపెట్టింది.

దుఃఖంతో తడబడ్డాడు. "సరే! దీన్ని స్పష్టపరచుకోవల సిన అగత్యం ఉంది."

"నాకు తెలుసు - నాకు తెలుసు."

"మళ్ళీ నేను తెలివిలేనిదాన్ని. కాని, నీవామాట చెప్పి నపుడు— ఇప్పుడు చెప్పినమాట —చాల భయంకరంగా వుంది నేను ఇప్పుడే—" ఆవిడ అతికష్టంతో ధైర్యాం తెచ్చుకొని, "నీవు మంచుకొండలా వున్నావు. అయ్యో! దైవమా? పెండ్లి నీకు-ముగింపు అయిందనుకొంటున్నావు." కొద్దియేడ్పు. "సరే రాండల్! అది అలా జరగవలసియుంది. నీవే కోరుకున్నావు- మంచి పనే చేశావు. నేను ఒప్పుకోను. నీవు భద్రంగా కాంట నెకు నిశ్చలంగా వెళ్లవచ్చు—మొట్టమొదట వెళ్లిపో!-త్వరగా వెళ్లు—ఏమీ మాట్లాడకు—దయచేసి వెంటనే వెళ్లిపో—"

## 12. అధ్యాయము

అమ్మ నాలుగవయేట ఒళ్లు జబ్బు చేసి కాలిఫోర్ని యాకు పోయిందట! ఆవిడ మళ్లీ తిరిగీ రాలేదు. మాలిడ్డీ అత్తయ్యా, నాన్న 'పిల్లలికి నిజం తెలిస్తే ప్రమాదం'-అనుకో న్నట్లున్నారు.

కొంత కాలానికి న్యాయ సమ్మతంగా విడాకులు పుచ్చు కోడం జరిగింది. నేరుగా ఆవిషయం తెలియక పోయినా, దాని భయంకర ఫలితాలను గమనించాం. వాకిటి తలుపు అనేకంగా మూసి ఉండేది. తలుపు సందుల్లోంచి మాకు అఱుపులు విన బడేవి.

ఈ విడాకుల పరిణామాలు గారట్సన్ను చాల బాధిం చాయి. పత్రికలన్నీ ఈ విషయాన్ని ప్రకటించాయి. రాండల్

సుప్రసిద్ధ రచయిత కుమారుడు సాంఘికంగా పేరుగలవాడు. ముఖ్యంగా మిసెస్ గారట్సన్ అయిన మిస్ హాలిష్టర్ స్త్రీల సమాజాలకై పాటుపడటం ప్రచురింపబడింది. విడాకుల విషయాన్ని అన్నిటికంటే ఇదే దేశీయ ప్రాముఖ్యత నిచ్చింది.

రాండల్ తన తండ్రితో సంప్రదించి గౌరవ జీవితానికి ప్రయత్నించాడు. ఇంట్లో అన్నీ సైనిక నిర్బంధాలతో జరుగుతున్నవి. కొద్ది పొరబాటైనా పెద్దలకు తెలిస్తే భరింపరానిదే.

ఒక స్త్రీయోగనుక అయితే ఆ యింటిని మామూలుస్థితికి తెచ్చియుండేదేమో? మే, హాలిస్టరు ఆ పనిచేసియుందురేమో? మా గారట్సన్ తాతయ్య ఎటువంటి వాడంటే? ఎవరైనా ఆడుది స్త్రీ సహజంగా తనకు పరిహాసాలుగా పొగడ్తూవుంటే. అతను సాధువుగా మారిపోయేవాడు. మా నాన్న బాగు కోసరం అన్నీ చేసేవాడు. అప్పు డతని ఉద్దేశ్యాలు దయగా పక్షపాతంగా శాంతిని కలిగించే విధంగా అమానుషంగా ఉండేవి.

మా తండ్రి ఎందుకు మళ్లీ పెండ్లాడా? అని నేను అర్థం చేసికోలేక పోయాను. మంచి విషయం కనీసం నాకుగూడ కనిపించలేదు. అది ఇప్పటికిని కలగా తలుస్తుంటాను—ఈవిషయం యోచిస్తూ ఉంటే, అది గొప్పదిగా తోస్తుంది ఇప్పటికి.

ఆవిడ పేరు మిస్‌లూసీ బ్రాటిల్. స్మిత్ కాలేజీలో గ్రాడ్యుయేట్. ఆవిడ చాల కాలం కామ్టన్‌లో వసించింది. ఆవిడ 'డిక్లైన్ ఆఫ్ ది స్పానిష్ ఎంపయర్' వ్రాసిన థియోటర్

గ్రాటిల్ మనుమరాలు. రాండల్‌కంటె తొమ్మిదేండ్లు చిన్నది. ఆవిడ భక్తి పరురాలైన 'బోటనిస్టు,' యూనిటేరియన్ - మధ్య యూరప్‌లోని 'యూనిటారియనిజం'ను గూర్చి ఒక గ్రంథం వ్రాసింది. ఫ్రాన్‌క్లిన్ గ్రేను తరువాతి రచనలకు సహాయపడింది. ఆవిడ చాల తెలివి గలది.

అలైన్‌వలె ఆమెకూడ స్త్రీలు ప్రాముఖ్యం వహించాలని నమ్మింది. కానీ, క్లబ్బులతోను, టీపార్టీలతోను, స్త్రీ సంఘాల ఆర్భాటలతోను ఆవిడకంత జోక్యం లేదు. ఆవిడకు సదాచారాలలోను, విజ్ఞాన ఫలితాలలోను దృఢ విశ్వాసం గలిగి యుండేది. ఎప్పుడు నిక్కచ్చిగా, ఊహాతీతమైన సత్య వర్తనలో నుండేది. ఎంత కష్టాల్లో ఉన్నా సవతి బిడ్డల్ని ముగ్గుర్ని పోషించే భారం వహించింది. నేను నా పదిహేనవ యేట ఆ యిల్లు వదలి పోయెంతవరకు ఎప్పుడు చిన్న తప్పు చేయడంగూడ చూడ లేదు.

ఎన్నడూ ఎలాటి మనస్పర్థలు, తగవులు లేవు. ఆవిడ ముగ్గురి పిల్లల్ని కన్నది; కాని దయగావుండేది. ఆ పెండ్లి తెలివి గల మనస్సులకు రెంటికి జరిగింది.

రాండల్‌కు సంతోషించదగిన కాలం. అతని ఆలోచనలకు, ఏకాంతానికి, మంచి వ్యాసాలు వ్రాయడానికి సహాధ్యాయి యేర్పడింది. కాని అవి ఫలవంతం గాకుండా దు:ఖాలకు దారితీస్తుంది మనస్సు. అతడు లూసితో షికారుకు వెళ్లుతు నల్లులు, పురుగులు, పక్షులు, ప్రకృతి రామణీయకాన్ని గూర్చి చర్చించే వాళ్లు. ఆవిడ చక్కనిది; పొడుగ్గా సన్నని ఎముకలతో

ఆమె కూడా చలువరాతితో చేసినట్లుండేది. ఆవిడ చురుగ్గా అన్ని విషయాలు మాట్లాడుతూ—జంతువులు—కాయగూరలు—దైవాన్ని గూర్చి తన అభిప్రాయాలను గొప్ప శక్తిగల గణిత శాస్త్రజ్ఞుడుగా మాట్లాడేది.

ఆవిడ స్వరం వేణుగానంలాగా వుండేది. సురాసముద్రం, అరుణోదయం, ధవళ నేత్రాలుగల ఎతీన్, ప్రతి భగల ఒడీసన్, —ఆవిడ సూటిగా మాట్లాడటం, శాంతమైన వాక్యాలు—మంచు నీటి గుటకల్లా నాకు చెప్పడం నా కిప్పటికీ జ్ఞాపకం వుంది. ఆవిడ మమ్మక్ష క్రమంతో, జాగ్రత్తతో జ్ఞానము, చక్కదనము, చక్కని భాష, అభిమానంతో గాక సత్య విశ్వాసంతో నాకు నేర్పుతుండేది. చాలా కాలందాక నాకు పెద్ద సాహిత్య మంటే హేమంతంలోని సూర్యకాంతిలేని ఆకాశంలాగ వుండేది.

ఇంటి విషయాల్లోను అలాగే ఉండేది. ఆవిడ క్రమ శిక్ష వల్ల ధైర్యం, మంచి నడవడిక అలవడ్డవి నాకు.

తాతయ్య జబ్బుపడి, చాలారోజులకు బలం చేకూర్చుకొని, మాట్లాడగలిగినప్పుడు నన్ను పిలవనంపాడు. అది మార్చిలో ఒక శనివార ముదయము. పచ్చని సూర్య కాంతి గదిలోని రగ్గులు, దుప్పట్లమీద ప్రకాశవంతంగా పడింది. అప్పటి దృశ్యం నా మానసంలో నేలమీద, గోడలమీద, కలప మంచంమీద తెల్లటి బట్టలమీద. పడిన వెలుతురు మెరుస్తున్నది. అందులో ముఖ్యంగా ముసలివాడు నిశ్చలంగా రాతి విగ్రహంలాగా తెల్లని దిండు నానుకొని కూర్చున్నాడు.

నేను మెల్లిగా నడిచి నిలబడి పోయాను. అతని మిట్ట ముఖం, చక్కని మబ్బు తెరలవంటి తెల్లని బొమ్మకలు, వెనుక నల్లని టోపీ, నాకు బాగా జ్ఞాపకం వుంది. ఆ వంగిన ముక్కు, దృఢంగా, సన్నగా నున్న గడ్డం—ఇవి అతనిలోని రాజలక్షణాల్ని తెలుపుతున్నాయి. ఇక్కడికి భయంతో వచ్చాను ముసలివాని భయానికి.

"రాల్ఫ్! ఇటు కూర్చో!" ఆస్వరం హెచ్చుగా, మృదువుగా, మందలింపుగా ఉంది. అతని మాటల ఠీవికి ముగ్ధుడనైనాను. నాభయం భక్తిగా మారింది.

"ఒరేయ్! నేను ముసలివాణ్ణి అని, జబ్బు పడినవాణ్ణి అని, బాధపడకు. ఏదివచ్చినా సంతోషంగానే ఉంటాను"

నేను కుర్చీ అంచున కూర్చొని. అతన్ని ఆశ్చర్యంతో చూస్తున్నాను. ఆయన నవ్వ లేదు. అతని కంట్ల రెప్పలమీద, మూతిమీద ముడతలు విడివడ లేదు.

"రాల్ఫ్! స్వభావంలోను, భక్తి భావంలోను నీపేరు చాలా గొప్పదయింది. ఈ ప్రపంచంలో ఏది ఇంత గొప్పది కాదు--ఇది బాగా జ్ఞాపకం ఉంచుకో. భావి కాలంలో నీవు—నీ పేరువల్ల సూచింపబడే ఆశయాలను కాదనే వాళ్లనేగాక, తృణీకరించే వాళ్లనుగూడ కలుసుకుంటావు. నాకొక ప్రమాణం చెయ్యాలి రాల్ఫ్!—" అతడు తలయెత్తి లోతుగా రెప్పల్లో నుండి మెటికేసేటట్లు చూచాడు. "నేను చెప్పింది అర్థమయిందా?"

"సరిగా తెలీలేదు తాతయ్యా!"

"నేను నీవు బాలుడవని మరచాను. నీకు సరిగ్గా అర్థం కాకపోయినా, చెప్పేతీరాలి. ఒకనాటికి ఈ కుటుంబంయొక్క పేరును నీవు నిలబెట్టవలసియుంది రాల్ఫ్! ఏ ఆశయాలవల్ల దాని కంత పెద్ద పేరువచ్చిందో, వాటికి నీవు గౌరవం ఇవ్వాలి. మన గట్టినమ్మక మేమిటంటే? విజ్ఞానం, న్యాయ ప్రవర్తన, ప్రపంచంలోని రాజ్యాలలో మనం కోరదగింది. ఇప్పుడు శాంతి స్వాతంత్ర్యం, నీతివర్తనం అవి ఉన్నాయంటే కొద్దిమంది పోరాటంవల్లనే. నీ వెప్పుడు మంచి కార్యాలకే పోరాడుతావు రాల్ఫ్! అది మన వంశపారంపర్యంగా వచ్చేగుణం. దాన్ని నిలబెట్టటమే నీ బాధ్యత."

అతని స్వరం గాంభీర్యంగా ప్రశాంతంగా—దైవమే అతని భవిష్యత్తును తన ద్వారా చెప్పిస్తున్నట్లుంది. అప్పుడు అతనిలో రెండు రూపా లగుపించాయి—ఒకటి నవీన యువతుల వైరుధ్యం—రెండవది, దేవుని యెదుటి కట్టకడపటి ప్రశాంతమైన జ్యోతిష వాక్యాలు.

"రాల్ఫ్! మనుష్యులను శక్తితో కాపాడలేవు. కాని, విజ్ఞాన గౌరవాలయందలి సంపూర్ణ భక్తి భావంతో విజయాన్ని పొందుతావు. నీవు స్వతంత్రుడివిగా వుండగల్గుతావు."

నేను మళ్లీ అతన్ని చూడలేదు . . .

## 13. అధ్యాయము

చిన్నతనంలో నేను త్వరగా పెరిగాను. నాకో పెద్దతల, ఒత్తుగా పెరిగి వంపులు తిరిగిన మొద్దుకలు, అవకతవక శరీరం

హాస్యాస్పదంగా వుంది. పదునాలుగేండ్లకల్లా పెద్ద స్థూల కాయంతో నూట అరవై పౌన్లు తూగాను నేను. ఆకారంతో బాటు సోమరితనం, పెద్దవాండ్లకు కోపం కలిగించే దురాచారాలు పెరిగినయ్. బుద్ధికూడ వంకరయయింది. వాదించడం, ఎదురుతిరగడం, విసుక్కోవడం నాకు ఎక్కువైంది. నేను దయాభూత్వాన్ని, పెద్దమనిషితనాన్ని, పెద్దవాళ్ళను, దైవకార్యాలను నిరసించడం మొదలుపెట్టాను.

మిగతవాళ్లంతా తమ జీవితాలను ప్రశాంతంగా గడుపుకుంటున్నారు. జీన్ మంచిపిల్ల. స్టీవ్ దాచేస్వభావం గలవాడు. ముగ్గురు పిల్లలు గడియారంలాగ పనిచేస్తున్నారు. రాల్ఫ్ సరిగా వుండేవాడుగాడు.

మేడిగన్స్ అందరు సిడ్, స్టీవ్ సామాన్యంగా కామ్టన్ హైస్కూలుకు వెళ్లేవారు. రాల్ఫ్ వాల్థేమ్ పట్టణంలోని బ్రౌన్సన్ ఆల్కట్ మగపిల్లలబడిలో చదవటానికి రైల్లో వెళ్ళవలసివచ్చింది. నేనొక మంచిడ్రస్—తెల్లటి కాలర్, టై, నీలంటోపీ పెట్టుకొని ప్రతి ఉదయం స్టేషనుకువెళ్లే హైస్కూల్ పిల్లల గుంపులో కలుసుకొనేవాణ్ని. ఈలలు, కేకలు, నవ్వులు మారుమ్రోగేవి.

ఆ రోజుల్లో పిల్లలందరు స్కూళ్లను నిరసించేవాళ్లు. నేను మాత్రం బ్రౌన్సన్ ఆల్కట్ మిక్కిలి అవమానకరస్థలమని నిశ్చయించుకొన్నాను. నేను పిల్లలందరికంటె పెద్దవాడినే గాని, తెలివిగలవాణ్ణిమాత్రం కాదు. అదొక ఆడవాళ్ళ తరహాగా—వివిధమైన ఆటలు లేకుండా — సాహిత్యం, ఆచారం

పేటితో జరుపబడేవి. నేను ఏదీ పూర్తిగా చేసేవాణ్ని కాదు. బొమ్మలువేయడం మొదలుపెట్టానంటే, పిచ్చిగీతలుగ, ఒకటా కటికి సంబంధం లేకుండా తయారు అయ్యేది. ఏదైనా ఆల్జీబ్రా (లెక్క)ను మొదలుబెట్టానంటే, కొంచెం సేపట్లో కాగితాలు చివరిదాకా తప్పు'ఆన్సరు' వచ్చేది. నేనేంచేయబోయినా అది చివరికి ఏ విధంగాను పూర్తికాదు. ఎవ్వరు దాన్ని ఏమీచేయ లేక పోయేవాండ్లు.

ప్రతిశుక్రవారం డాన్సుక్లాసుండేది. మిస్ మిఫ్లిన్ చేతులతో తట్టుతూ, కోడి నడకలతో రంగస్థలాని కొచ్చేది. అపుడు అందంగా పెద్దపావడాను ఆడిస్తూ చేతులు దూరంగాబెట్టి నిల బడేది.

మేము ఆవిడను 'ప్రూన్' అని పిలిచేవాళ్లం. ఆడపిల్లలు 'పిఫిల్' అని పిలిచేవాండ్లు. "ఓ ఆడపిల్లలూ! తరుణులూ! మీరా గోడచివర కూర్చోండి. మగవాళ్లంతా అటువెళ్లి నిల వండి."

గుడ్డలు నలిగిన చప్పుళ్లు, నిట్టూరులు—

ఒరేయ్ వెధవా! గ్లేడిస్! మీద చెయ్యితీసెయ్"

"ఈసారి 'మిక్టల్'ని ఎవరు తీసికొంటారు? నేను తీసి కోనబ్బా?"

"రాల్ఫ్! ఓ ఎద్దూ! యీసారి నీవు 'జీన్ పోల్'ను తీసు కోవలసిందే!—" ఏయ్! పిల్లలారా అరవకండి. అంతా రెడీనా? సంగీతం!" చేతులు మెల్లగా దూరంగా బెట్టుకొని 'ప్రూన్'

నెమ్మదిగా అడుగు లేసుకుంటూ పియానో లయతో వాయిస్తుండగా రంగంమీాది కొచ్చింది.

నేను పార్టీకి "బీన్ పోల్"ను తీసికోవలసి వచ్చింది. దాన్నెంతో అలక్ష్యంతో నిరసించాను — కానీ, మా యిద్దరి మధ్య 'గ్లాడిసన్' గురించి పెరిగిన వైరుధ్యం రగుల్కొన్న ఆకలి వలె ఉంది—ఆ పిల్లలో ఏముందోగాని, - చిన్నపిల్లల్ని, పెద్ద వాళ్లని, ఎద్దులాగావున్నా రాల్ఫగారట్సన్నికూడ మైమరపిస్తున్నది. అది రోజాపూలవలె మృదువుగా పరిమళంతో - తెల్లటి దుస్తులతో- తేలికైన ప్రతిబింబంలాగ కదులుతూ మగపిల్లల్ని ఆశగొలిపేది.

"మాట్లాడకూడదు పిల్లలూ! నెక్స్టు డాన్సుకు మీామీా చోట్లల్లో నిల్చోండి—"

బీన్ పోల్ చిన్నగా నవ్వింది. ఆవిడకు సరిగా ఎత్తుగా వుండేవాడ్ని నేనొక్కడినే. ప్రూన్ అప్పుడప్పుడు డాన్సుకు ఇతరులను తీసికోమని దాంతో చెప్పేది. కాని పార్టీవాళ్లతో బీన్ రంగం మీాది కొచ్చేటప్పటికి నవ్వులు చప్పట్లు గల్లంతులు మొదలయ్యేవి. అది 5 అడుగుల 8 అంగుళాల పొడుగు— పంద్రాండేళ్లు. పాలిపోయిన ముఖం, మచ్చల శరీరం. ఆవిడ దుస్తులు- స్త్రీ స్వాభావికంగా కుచ్చిళ్లు, మడుపులు, రిబ్బన్లు వీటితో చాల ప్రియంగా నుండేవి. నేను దానికై ఒక విధంగా చింతించేవాడ్ని--ఒక్క- పలచని ప్రాణులను-వారికి వారినే ఆడవాండ్లలాగా డ్రస్సు చేసికోమంటే, వాళ్లనిచూచి ఇతరుడు సానుభూతి చూపుతాడు. అటువంటిదే నాసానుభూతి.

మే మెప్పుడు మాట్లాడుకో నేవాళ్ళం కాము. ఒకసారి నేను "ఎక్కడుంటున్నావ్! బీన్‌పోల్" అన్నాను.

అది పలక్కుండా నిల్చుంది. నేను దాని భావాన్ని తెలుసుకోలేక పోయాను.

"ఈ 'వాల్‌ఘాన్'లో ఎక్కడుంటున్నావ్? అని అడుగుతున్నా?" ఆవిడ తల ఊపింది. అప్పుడో కన్నీటిచుక్క జలజల ముక్కుల క్రిందిగా రాలింది.

"అరే? ఏం జరిగింది బీన్‌పోల్? నే నేమన్నా అన్నానా? ఏమన లేదే?"

అది అసంబంధంగా కనుపించింది. నేను భయపడ్డాను.

ఆపె వేగం తగ్గించడంలో, ఆవిడ చెప్పుచివరిలో నా అడుగులు తడబడి పడ్డాయి. అప్పుడది వెనక్కు తిరిగి గబగబ నడిచి, కోట్లు విప్పే రూములోనికి పోయింది. నిట్టూరుస్తూ వెంబడించాను.

బీన్‌పోల్ కిటికీ దగ్గర, రెండు చేతుల్లో చేతిగుడ్డను ముఖానికి కప్పుకొని నిల్చుంది. నా చప్పుడువిని కూడ వెనక్కి చూడలేదు. కాని, సహజంగా కనుపించడానికి ప్రయత్నం చేసింది వ్యర్థంగా.

"నన్ను క్షమించాలి—క్రిస్టీనా! అసలు సంగతేమిటి? అందరితో నన్నట్లుగా నే నన్నాను—" అన్ని సరిచేయడానికి అదొక సూత్రంగా చెప్పాను. ఆవిడనన్ను చిన్నెలతో చూస్తూ కండ్లలో అ యిష్టాన్ని తెలుపుతూ మాట్లాడలేదు.

"సరే! నీవు మాట్లాడలేవా?"

ఆవిడ స్థితి చూస్తే, దుస్తులు లేకుండా పట్టుబడ్డట్లు, భయంతో చూస్తున్నది. ఆమె నన్ను నిశ్చేష్టగా చూచింది, అసహ్యంతో గాదు; ఒక విధమైన విసుగుతో, అభిమానంతో.

"అసలు విషయమేమిటి?"

ఆవిడ దుఃఖంతో తల ఆడించింది.

"ఇటు చూడు—ఇదిగో నీవు పొడుగ్గా వున్నావనేనా చింత—" ఆవిడ దృష్టి కదలకుండా నిల్చింది.

"అరే! అదేంది క్రిష్టీనా??—ఈ వెధవలంతా—సరిగ్గా పెరగలేదు." గొప్పసాహసంతో నన్ను నేను అభినందించుకొన్నట్లు పలికాను; ఏదో మంచి చేస్తున్నాననే ఊహ నాకు పట్టింది. "ఆఁ వాళ్లు చిన్న వెధవలు." అంటు సాగిపోయాను. "వాళ్లు గూడ కొన్నాళ్లకు పెరుగకపోరు – ఇంతకు నీవు ముందుగా పెరిగావు" ఆవిడేమీ సంతోషించినట్లు లేదు. చీవాట్లు తిన్న చిన్నబిడ్డ దృష్టి ఆమె ముఖాన కనుపించింది. నాకు కోపం వచ్చింది. 'అదంతా నిలుపు. నీవు వట్టి చిన్న బిడ్డలాగ నడుచుకొంటున్నావు"

ఆవిడ వెనక్కి తిరిగి, కుర్చీలోని కోటునుతీసికొంది. అప్పుడొక చిత్రం జరిగింది. ఆవిడ తిరిగి నప్పుడు పావడాల గూడ ఆవిడతో కదిలింది. ఆవిడ రాగిరంగు జుట్టు భుజాలమీద పడింది. నే నావిడను వెనుకవైపునుండి చూస్తుంటే నాకొక విదమైన వణకు గలిగింది—ఏదో భయం, చేతులతో ఆవిడ

భుజాలను పట్టుకొని, నాప్రక్కకు త్రిప్పికొని, ఆమె ఏడుపు కండ్లల్లో చూస్తూ నిల్చున్నాను—"

సరిగ్గా అప్పుడే ఫ్రాన్ లోపలికొచ్చింది. "పిల్లలూ! ఏంచేస్తున్నారిక్కడ? రాల్ఫ్! ఇది చాల అవమానకరం—నిన్నెప్పుడూ నమ్మకూడదు. క్రిస్టినా!—నీవు నిజంగా సిగ్గుపడవలసింది."

ఫ్రాన్ చెపుతూనేయున్నది. నూ తల్లులేమంటారు? ఇతరు లేమంటారు? తలఎత్తుకొని ఏలా తిరగడం? ప్రజలు ఆవిష్నిగూర్చి ఏమనుకొంటారు?

ఉన్నట్లుండి ఒక కేక వినిపించింది. "వెధవా! నోరు మూసుకో! ఎవ రేమంటే, ఎవరికొక్కవాలి? నీవు ఎవరనుకుంటున్నావో?—అట్లా మంచి పిల్లల్తో మాట్లాడుతావా?" ఆ స్వరం కీయిచ్చిన అలారంలాగా, భయపడిన వుడుతకూతలాగ వినిపించింది. "ఇక్కడొక పిల్ల జబ్బుతో బాధ పడుతూంటే, నీవు గబగబా వచ్చి అవమానపరచి దాన్నిగురించి మాట్లాడుతావా? వాండ్లమ్మ ఏమంటుందో తెలుసా?— — మాటలుపడవలసివస్తుంది. నే నిప్పుడే చెబుతున్నాను."

నా స్వరం హెచ్చు స్థాయిలో వుంది. కాని—నాకేం వినిపించడం లేదు. "మళ్ళీ ఈ పాడు క్లాసులకు వస్తానేమో చూడు — — ఛీ. ఫ్రాన్! నీవు — —" నేను తలుపును టపీలుమని మూసేసి వెళ్లాను.

నేను ఫ్రాన్ని—క్షమాపణ కోరియుండవలసింది. నేను మొటూటు అడవిగుఱ్ఱంలాగా నిరాకరించాను—కొద్దిరోజుల్దాకా

స్కూల్లో నా సాహసానికి మంచి పేరుంకింది. తరువాత మరచి పోయినారు బీన్ పోల్ తప్ప. కొద్దిరోజులదాకా నేనావిడను చూడలేదు. ఎందుకంటే, మళ్లీ నేను డ్యాంసుక్లాసుకు పోలేదు– కానీ వీధిలో కలుసుకొన్నాను. అవిడ నన్నుదాటి అసలు పోల్ (స్తంభం)లాగా నడిచిపోయింది.

"ఏయ్! క్రిస్టినా! నీకేమైన పిచ్చా?"

మూడడుగులదాకా బదుల్లేదు.. అప్పుడు నీతో మాట్లాడటం నాకిష్టంలేదు. అంతే!"

నాలో ఉడుకెక్కింది. "బాగుంది నీ వరుస. నీవే నన్ను ఈ ఊబిలో దింపి, ఇప్పుడిల్లా మాట్లాడుతున్నావు. నీవు కూడా ఆ ఫ్రాన్‌కు మల్లె మాట్లాడుతున్నావే?..."

"నీ పనేదో నీవు చూచుకుంటే ఏ విధమైన బాధ నీకు కలిగేది కాదు." ఆవిడ నిటారుగా తలెత్తుకొనిపోయింది. వెనుక నుండి కేకవేశాను. "నీవు, నీసంగతి ఏట్లోకిపోనియ్!" కోపంతో వణకిపోతున్నాను. "ఏ! బీన్ పోల్! బుద్ధిలేని గాడిదా!

## 14. అధ్యాయము

కామ్‌టన్‌కు ఉత్తరాన మైలుదూరంలో 'సడ్ బరీ లే'లో కింగ్స్‌లేవారి భూమి ఉంది. మా యిల్లుదాటి ఆ వీధిలో కొంచెందూరంపోతే, సన్న సందులోంచి 'మేదో' భూములు దాటి, పైన్ చెట్లలోగుండా వెళ్లితే – – చిన్న ప్రదేశంలో ఎప్పుడూ ప్రశాంతంగా పచ్చగా అరణ్యంలాంటి ఆ ప్రదేశంలో

గడచిన నూఱుసంవత్సరాలుగా కింగ్స్లీల యిండ్లు భూములు ఉన్నవి.

ఆ చోటు చిన్న ఈడెన్‌లాగా వుంది. ముఖ్యంగా వేసవిలో గంటలు మ్రోగుతవి. సూర్యకాంతి పచ్చనిపచ్చికబయళ్లమీద ఎత్తైన పండినచెట్లమీద వ్యాపిస్తుంది. స్వర్గపు ప్రహరీలాగ ఆ చిన్న ప్రదేశంచుట్టు చెట్లున్నవి. తూర్పున ద్వారంవద్ద ఉప్పుపెట్టెలతో చేసిన ఒక పాతయిల్లు ఉన్నది. దానిపైకప్పు ఉత్తరవైపున నేలకు తగిలేటట్లుగా వంగి ఉంది. దాని కవతల లోయలో అటు చివర గొడ్లసావళ్లు, ఇండ్లు, ఒక క్రొత్త ఇల్లు ఉంది – ఒకమైలు చదురంలో ఇదొక్కటే అసహ్యమైనచోటు.

చాలకాలంవరకు కింగ్స్లేలు మాకు విరోధులుగావుండేవాళ్లు. మేము పండ్లతోటలు, అవి దోచేవాండ్లం. వాళ్లు మమ్మల్ని బెదరించడానికి కుక్కలతో కాచుకొనియుండేవాళ్లు. ఇటువాంటివి తరతరాలుగా జరుగుతున్నట్లుంది. అది కామ్‌టన్ యొక్క పారంపర్యము.

కింగ్స్లేలందరు కొండజాతుల్లాగ గుంపుగుంపులుగా వుండేవాళ్లు. మార్విన్ కింగ్స్లే, జనరల్ గ్రాంట్‌యొక్క గడ్డంతో, అతని కొడుకు జిమ్ గడ్డంలేకున్నా తండ్రిలాగా వుండేవాడు. కాని ఆ పాత ఉప్పుపెట్టెల ఇంట్లోవుండే 'సేత్ కింగ్స్లే' అంటే చాల భయపడేవాండ్లం. అతడు ఎక్కువగా ఇతరులవలె మాట్లాడకపోయినా, అతని ముఖం గ్రద్దముఖంలాగా కోలగా భయంకరంగావుండేది. పడమటి సిపాయిలాగ అతని మీసాలు మెలితిరిగి నోటికి రెండువైపులూ క్రిందికి దిగియుండేవి.

మార్చిలో ఒక శనివారంనాడు - అప్పుడు నాకు పది హేనేండ్లు - అమ్మవాళ్లు నన్ను గ్రుడ్లుతీసుకొని రమ్మని పంపారు. కింగ్స్ లేల యింటికి వెళ్లడం చాలక్రొత్తగావుంది. నేను నెమ్మదిలో ఆయింట్లో అడుగుపెట్టలేదు. అక్కడ కుక్కలున్న వెనకటి స్పర్థలూ ఉన్నవి. మలుపుదిరిగి నీరెండలో మెరుస్తున్న ఆయింటిని చూచేటప్పటికి నడుము కలుక్కుమంది.

ఎందుకో సేత్ యింటిముందాగాను. కిటికిలో ఒక స్త్రీ ముఖం - అడుగుల చప్పుడుతో తలుపు చప్పుడు - తలుపు లోపలికి తెరుచుకొంది. "లోపలికివచ్చి మాట్లాడవచ్చు."

విశేషమేమీ జరగలేదు - నెరిసిన వెంట్రుకలముడి, పాలి పోయిన నీలికండ్లు, తెల్లని శరీరచ్ఛాయ, బాధల ననుభవించిన జీవితానికి గుర్తుగ మచ్చలుగల ఒక ముసలిది నన్ను చూస్తు న్నది. నాలో ఒకవిధం వేడిగల్గి వెకిలిగ పండ్లుబయటపెట్టాను. ఆ విశాలనేత్రాలు నన్ను ప్రేమతో చూచాయి.

నేను తెల్లటి వాటయింట్లోకి పోగానే తలుపు మూసు కుంది. "బాగా చల్లబడిపోయినావే," అంది ఆవిడ.

టోపీ తీసేసి, మెడ, గడ్డం తడువుకుంటూ చెప్పాను. "నేను ఎాల్ఫ్ గారట్సన్ను." మొద్దు బారిన పెదవుల్లో నుండి మాటలు వెలువడ్డవి.

"అదే నేననుకొన్నాను-" ఆవిడ స్వరం నన్ను సంతోష పెట్టించింది.

"అమ్మ గ్రుడ్లుకావాలంది - - ఇక్కడేమన్నా వెలకు దొరకతవేమోనని పంపింది."

"కోటు తీసెయ్... ఇక్కడ వెచ్చగానే వుంటుంది. ఆ పొయ్యిదగ్గర వెచ్చగా నుంటుందేమో చూడు. రెండు నిమిషాల్లో టీ తయారవుతుంది."

నేను పొయ్యిదగ్గర కుర్చీలో కాళ్లను స్టౌకు ఆనించి కూర్చున్నాను. అక్కడి సన్నివేశాలను గమనించాను. ఆ గళ్ల సోపు, పెయింట్-అంత శుభ్రంగా వుండటమే కాదు – కాంప్టన్‌లో మా యిల్లుకూడా అలాగేవుండేది. మిసస్ కింగ్స్‌లే వంటగది సరిగ్గా ఏలాగుంటుందో చెప్పటానికి సరియైన మాట నాకు రాలేదు. నాకు తట్టిందల్లా, 'పవిత్రమైన దేవాలయం' అని. బయట మంచు దుమారం నిటారు చెట్లను వంచుతూ, పొడిగిస్తూ, పొడిమంచును మూలలకు, దక్షిణప్రక్క - కిటికీల క్రిందికి చేస్తున్నది. కానీ. లోపలి పరిశుభ్రత, ప్రశాంతత మనుష్యుని కోరే అంతిమాశయంగా వుంది.

"నీకంటె మీ వాళ్లను గురించి బాగా తెలుసు. మీ నాన్న ఏలాగున్నాడు?"

"అతను ఇంట్లోనే యున్నాడు. ఇప్పుడు బాగానే ఉన్నాడు" అని తొందరతో అన్నాను. ఎందుకంటే? మిసస్ కింగ్స్‌లేను ఎప్పుడైనా వినియున్నానా? అని యోచిస్తూ, ధైర్యంతో "మీ రెవరో నాకు తెలుపకూడదా?" అన్నాను.

"ఏమా? నీవు గారట్‌సన్ గదూ?"

"దానికి నేనేం చేసేది?"

"నీ వేమైనా చేయగలవు? చేయాలనుకుంటే?" ఆవిడ యెప్పుడు మాట్లాడినా మొద్దు చేతినిముందు కూపుతూ మాట్లా డుతుంది—జార్జి వాషింగ్‌టన్‌లాగా - వెంటనే తుపాకిగుండ్లకు మల్లే మాటలు బయలుదేరాయి.

"నే నెప్పుడు మీ ఆపిల్స్, ద్రాక్షలు దొంగలించే వాణ్ని. కింగ్స్ లేలు పట్టుకొన్నారంటే నన్ను చంపేస్తారు."

"ప్రాణంతోనే కాల్చేస్తా రనుకుంటా నిన్ను. వాండ్లె ప్పుడు పట్టుబడ్డ పిల్లల్ని ఆలాగే చేస్తుంటారు. ఈ సారి నీ కేమైనా పండ్లు కావలిస్తే బుట్టతో ఇక్కడికి వచ్చెయ్. నీ కిప్పుడు పదిహే నేండ్లుగదూ?''

నేను తల ఊపాను.

"బాగా పెద్దవాడ వయినావు. మీ అమ్మను నీకు తెలియదనుకుంటా?''

"లేదు—కొంచెంగూడా తెలేదు. నీ కావిణ్ని తెలుసా?"

"ఆఁ! తెలుసు. నిన్నుగూడా తెలుసు--ఇంత పెద్దవాడి వవుతావని నే ననుకోలేదు-మీ అమ్మ ఎప్పుడు రెండువారాల కొక దాసీదాన్ని మార్చేది. వాళ్లలో నే నొకదాన్ని."

"నీవా?"

"నిన్ను గురించి తెలియని విషయాలే లేవు. ఇది మాత్రం నిజం." ఆవిడ నవ్వలేదుగాని, నోరు మాత్రం సంతో షాన్ని తెలిపింది.

"అంటే! నా చెడ్డ విషయాలని గురించేనా?"

"చెడ్డ విషయాలా?—మంచివి గూడా! రెండు."

ఆమె బ్రౌన్ కలర్ చైనా కూజాలో టీ తయారుచేసి రెండు పెద్ద తెల్లటికప్పుల్లో పాలు, చక్కెర, తినడానికి తెచ్చింది. ఆవిడ మాంత్రికురాలుగా పనిచేసింది. ఉన్నట్లుండి పొగలొచ్చే కప్పు, బిస్కట్లు ప్లేటులో కనిపించింది.

నీవంటి పదిహేనేండ్ల వాడికి కడుపెప్పుడు సరిగ్గానిండ దనుకొంటా. ఆ ముసలి 'ఐరిష్' వంటమనిషి నీ కడుపుకు వట్టి బంగాళాదుంపలు తప్ప ఇంకేం పెట్టదని నే ననుకుంటా. 'లూసీ బ్రౌటిల్' ఆరుగురు పిల్లల్తో, అంత పెద్ద యింట్లో-జరిగి స్తుందంటే నేను నమ్మను. అందులో తాతయ్యదగ్గర పని చేసే దదాక్క-తే; అది అంత సులభమయింది కాదని నీకూ తెలుసు. చాల కాలం ఆవిడున్నతావుకు కాలుమైలు దూరంలో వున్నా? నే నెవరో దానికి తెలేదు. అదే; మీ బ్రౌటిల్, గారట్సన్లతో వచ్చే గొడవ. పుస్తకాల్లో విషయం తప్ప, ముక్కు క్రింద ఏముందో మీరు తెలుసుకోరు. బలే వాళ్లు. కానీ, ఈ విధంగా ఎంతో సౌఖ్యాన్ని పోగొట్టు కొన్నారు."

మేము గ్రుడ్ల విషయం మరచి పోయినాం; 'మార్థా' వచ్చేంతవరకు దీపంగూడా పెట్టలేదు.

తలుపు మూసే లోపుగా మిసెస్ కింగ్స్లే అంది. "ఇక్క డొక రాల్ఫ్ గారట్సన్ ఉన్నాడు' మార్థా తల ఊపి

నవ్వి, పలుక్కుండా రెండు దీపాలు వెలిగించింది. ఆ వెలుగులో అన్నది. "హాలో! ఇక్కడేమన్నా లైటు కావాలా?"

ఆవిడ రూము మధ్యన దీపం పట్టుక నిల్చుంది. ఆవిడ ఉల్లు జాకెట్టు తెరుచుకోనుంది. పెద్ద కాలర్ ముఖాన్ని 'ఫ్రేమ్' చేసింది. ఆవిడ జుట్టు రాగిరంగుతో మృదువుగా పాయలు పాయలుగా గాలికి ఎగిరి ఉంది. ఆవిడ గొప్పగా, పరిశుభ్రంగా గ్రామీణారోగ్యంతో వుంది.

"రాల్ఫ్ గుడ్లకోసం వచ్చాడు. మనింట్లో కొద్దిగా వున్నట్లున్నై" అంది కింగ్స్లే.

"లేదు. అత్తయ్య అగ్ దగ్గఱ చాలా వుండాలి ఒక నిమిషంలో తెస్తాను." దీపాన్ని గూట్లోపెట్టి, "ఎన్ని కావాలి? రెండు డజన్లా?" ఆవిడ కండ్లు నన్ను నిశ్చలంగా చూచాయి.

"అవును—నేను కూడా వచ్చేదా?"

"సరే! రా?" ఆవిడ కాలర్ పైకెత్తి జాకెట్టుకు బెల్టు వేసికొంది. "నాన్న చాల ఆలస్యంగా వచ్చేటట్లున్నాడే?"

మేము ఈదరగాలిలో ఇంకో యింటికి నడుస్తున్నాము. మఱి కొందర్ని కింగ్స్లేలను కలిసికొని గుడ్లను తీసికొని వెనక్కు తిరిగాము. మబ్బులక్రింద చీకటి పడలేదుగాని, గాలి మాత్రం శబ్దంతో వీస్తున్నది. ఆ చీకట్లో నా ప్రక్కగా మార్థా నడచినతీరు నాకు బాగా జ్ఞాపకం వుంది. నేను చూచిన వాండ్లల్లోకల్ల ఆవిడ మంచి పిల్ల. ఆవిడ నాకోసం తెచ్చిన గుడ్లతో ప్రక్కన నడుస్తుంటే చాల గర్వపడ్డాను.

మేము కిటికీదాటి వెళ్తుండగా "నాన్న వచ్చాడు" అంది. నేరుగా వెళ్లాలని తెలిసికూడా నేను ఆమె వెంట లోపలికి వెళ్లాను, వెచ్చని వంట యింట్లోకి పోగానే తలుపు మూసుకుంది.

మిస్టర్ కింగ్స్లే వెనక్కి తిరిగి నన్ను చూచాడు. కొద్దిగా తల ఆడించాడు.

"నీకు కూడా భోజనం తయారుగా వుంది. నీవు ఉంటే బాగుంటుంది." అంది మిసెస్ కింగ్స్లే.

"నేను వెళ్లాలి." — కృతజ్ఞుడను. "కాని—" నా నోరు బుద్ధిలేని తనంగా తెరచుకొంది. "అరే! వాళ్లు గ్రుడ్లు కావాలన్నారు. మరచిపోయాను త్వరపడటం మంచిది"

"వస్తూ — పోతూ — ఉండు" అంది మిసెస్ కింగ్స్లే. మార్థా ఆవిడ ప్రక్కకు చేరి భుజంమీద చెయ్యివేసి నిల్చుంది. వాళ్లిద్దరిలో చాలా భేదాలున్నా? ఎందుకో? వాళ్లిద్దరు నేనంటే ప్రియ పడ్డారు. దాన్ని వాళ్ల కంళ్లల్లో చూచాను.

"తప్పకుండా—వస్తుంటాను." అన్నాను నేను.

## 15. అధ్యాయము

మా నాన్న ఎప్పుడు బిజిగా వుండేవాడు. కొంత కాలం తనకు నరాల పటుత్వం తగ్గిందని హాస్యంగా చెపుతుండేవాడు. డాక్టరు ఉత్తరువు ప్రకారం మధ్యాహ్నం కొద్ది నిద్ర, ఆహారానికి ముందు ఎన్నో టానిక్కులు తీసికొనేవాడు.

అతడు అన్నిరకాల మందులతో సంతోషిస్తూ వాటి నన్నిటిని చేర్చి పెట్టేవాడు—పిల్సు, క్యాప్సిల్సు, పౌడర్సు, మిక్చర్సు—విన్న వన్నీ కొనేవాడు.

ఏదో మాత్ర కాలం తిరకు క్రొత్తరూపాన్ని తయారు చేస్తుందని నమ్మేవాడు; నిరీక్షించేవాడు—జీవిత మంతా నిరీక్షణ తోనే గడిపాడు. కాని నిశ్చయంతో మాత్రం కాదు. ఇక్స్ప్లైన్సా—జ్వరం వచ్చినప్పుడు ప్రక్క—మీద మా నాన్న పుస్తకాలతోనే బాహ్య ప్రపంచాన్ని మరచిపోయాడు. అది మా నాన్నకు సంతోషం. నేను వెళ్లినప్పుడు నాన్న ఈస్థితిలో ఉన్నాడు." రాత్రి ఏలాగుంది?"

"పొయ్యివగ్గర కూర్చున్న పిల్లిలాగుంది. అనారోగ్యాన్ని ఈ విధంగా అనుభవించడం అవమానకరం—"

"వాళ్లకని తెలుసుననుకుంటా? రాత్రిళ్లు నీవు బరకపం నాండ్లు విన్నారేమో?"

అతడు తీక్ష్ణంగా చూచాడు. హాస్యం అతని ముఖంలో మాయమయింది. రాల్ఫ్! నా అంత ముసలివాడవయితే, విసుగు అంటే ఏమో నీకు తెలుస్తుంది. ఈ చలిగాలిలో బైటి కెళ్లావా?" అన్నాడు నాన్న.

గ్రుడ్లు తీసికొని రావడానికి కింగ్సులెయింట్కి వెళ్లాను—వాండ్లు చాలా మంచివాండ్లు—నీకు వాళ్లను తెలుసా? నీ వక్క—పికి వెళ్లావా? మిసస్ కింగ్సులేతో టీ త్రాగాను—అంటే మొట్ట మొదటి పాత యిల్లు.

"ఉప్పుపెట్టెల యిల్లేనా?"

"ఆఁ! అదే!...ఆవిడ మనయింట్లో దాసీగా పనిచేసినట్లు చెప్పింది..."

"దాంట్లో సందేహం లేదు. కూర్చుంటేగది చూచావా?"

"ఊహుఁ! లేదు... నేను నాటయింటికి వెళ్లాను."

"వాండ్లు దాన్ని నాశనం చేశారనుకో? నిజంగా ఆ యిల్లును ఎవరిచేత మరమ్మత్తు చేయించలేదు."

ఉన్నట్లుండి నాకు కోపం వచ్చింది. శాంతంగా కూర్చున్నాడు. వెలుతురు దుప్పట్లమీద, దిండ్లమీద మెరుస్తూ, అతని నెరిసినతలను, ఆలోచనామగ్నమైన ముఖాన్ని తాకుతున్నది. అతడిట్లా చెప్పుకుపోతున్నాడు. "కొనగలిగితే నేను కొనియుండేవాణ్ని. అది లాభదాయకమైన పెట్టుబడి. సేత్ వద్దంగి దాని నిజమైన విలువ తెలిసికోలేదు."

కోపంగా మాట్లాడుదామనుకొన్నా! అత్యాశ లోభి అని అందామనుకొన్నా, కాని ఉపయోగించడానికి పదజాలం దొరకక ఊరుకున్నాను.

ఆటు తరువాత కింగ్సులేను గురించి మాట్లాడలేదు.

ఆ మరుసటి సోమవారము స్కూలునుండి మూడుమ్ముప్పావుగంటకు ఇంటికివచ్చి, వేరేదుస్తులను ధరించి, కింగ్సులేదగ్గరికి బయలుదేరాను.

మాటలు, తరువాత మండుచున్న నిప్పు చప్పుడు వినబడింది. కొయ్యకాలిన వాసన కమ్మగా వీస్తున్నది. ఆ యిల్లు

దాటి పోతూ, లోపల ఏం జరుగుతుందా? అని తొంగి చూచాను. ఇంతలో కుక్కలు మొరుగుతూ చంపేటట్లుగా నా పైకి వచ్చాయి.

ఆ జంతువులు ఎప్పుడూ అంతే, మార్థా నన్ను రక్షించింది. ఆవిడ కేకలేస్తూ కుక్కలవెంట పరుగెత్తివచ్చేటప్పటికి, చీల్చడానికి బదులుగా నా చుట్టూ తిరగడం మొదలుపెట్టినవి. ఆవిడ దగ్గరకొచ్చేటప్పటికి నిశ్శబ్దంగా కొట్లల్లోకిపోయాయి.

"అబ్బ! ఇక్కడుండేవాళ్లు అసుపులకు గుండె ఆగి చచ్చిపోరా?"

నా భయాన్ని గుర్తించిందనుకుంటా! భయం అణచుకుంటూ కూడా బయల్దేరాను. "ఇక్కడేం జరుగుతుంది?"

"అదా?—మామయ్య మార్విన్ చెట్లరసాలను కాగబెడుతున్నాడు. దాన్ని తీసుకరావడానికి నీవు సహాయపడతావా?- కొంచెం సేపు ఉంటావు గదూ?"

వాళ్లంతా అక్కడున్నారు. పెద్దవాడగు మార్విన్ ఇనుపకాగుక్రింద నిప్పు కలియబెడుతున్నాడు. జిమ్ రెండు చేతుల్లో బక్కెట్లు తెస్తున్నాడు; వారి భార్యలు - గ్రాన్-మాడ్, వెచ్చదనానికి దగ్గరగా నిల్చున్నారు. చిన్నపిల్లలు తిరుగుతున్నారు. అందరు సంతోషంగావున్నారు.

"మగవాని బలమంటె ఇదీ! ఆడవాళ్లు చేయిగూడ అందియ్యరు. ఏదో వెచ్చగానుంటుందని ఇక్కడికొస్తారు." అన్నాడు ముసలి మార్విన్.

గ్రాన్ గంభీరంగా పెద్దగా అంది. "చెయ్యొందియ్యడమా?? ఈ నిప్పులో పనిచేయడానికే ఇక్కడికి వచ్చాను - నేను, మాడ్ నీవు చేసేటట్లుగా మంచిగా చెయ్యగలం. కాని, దాన్ని వదలి వెళ్లితేగా? నీ ఆలోచనంతా వెచ్చగా నుందామనే?" ఆ భయంకర దృష్టులూ—వంకర్లు తిరిగే అవయవాలు—ఆవిడతో రాకుండా వుండవలసింది. ఈ మార్చి నెల చలిలో ఆమె కఠనస్వరం, మంచిబలంతోను, హాస్యంతోను కలిసియుంది. నేను పెద్దగా నవ్వాను.

ముసలి మార్విన్ సణిగాడు. "ఏం! నవ్వుతున్నావా? పెద్దవాండ్లను గౌరవించేటట్లు లేదే?" అతని బిరుసు గడ్డం నానైపుకు పొడుచుకొచ్చింది.

అనిశ్చయంగా నవ్వాను.

"అతడుగూడ కుక్కలాగా వున్నాడు నిన్నేదో భయపెట్టచూస్తున్నాడు." అంది గ్రాన్.

"ఈ పానకంతోనే సంవత్సరమంతా గడుస్తుంది. రోజల్లా కష్టపడితే రెండు గాలన్ల పానీయం వస్తుంది,—పొగ, బూడిదతో. ఆడవాళ్లను నవ్వించడానికే చేస్తున్నాననుకో"

"నీవు మమ్మల్ని హాస్యం చేయటానికే తింటుంటావా?" అంది జిమ్స్ భార్య మాడ్, సంతోషంతో ఆవిడ స్వరం కీచుపోయింది.

"మన మంతా నోరు తియ్యబడటానికి చేశాం! పని మెల్లాగుంది అబ్బాయ్." మార్విన్ నీలాకాశం చూస్తూ అన్నాడు.

"బాగానే సాగుతున్నది" అన్నాడు జిమ్.

"నేనుగూడా వచ్చి పని చేయాల్సిన అవసరం వుందా?"

"అంటే—అతని తో పని చేయడంలో ఇష్టం లేదా?" అంది గ్రాన్.

"రాల్ఫ్, నేను పనికి వెళ్తుతాం" అంది మార్థా.

మేము వెళ్లాము. బొక్కెన్లు తీసికొని తడి నేలలో మాల్ చెట్లప్రక్కగా నడుస్తూ, చెట్లకు కట్టిన డబ్బాలు కూజాలు నుండి వృక్ష రసాన్ని పోసుకొన్నాం. నేను ఇంకో ఇంటికి పోతుంటె మళ్లీ రమ్మని మార్విన్ కేకేశాడు. నేను మార్థా వెంట ఉత్సాహంతో సాగుతూ, ప్రేమైక జీవనలె ప్రతి అడుగు, ప్రతిశ్వాసము, ప్రతి కదలికలను గూర్చి ఆనం దిస్తూ నడిచాడు.

"లోపలికొచ్చి అమ్మనుచూడు" అంది.

"వెళ్లాలి...ఆరు అయినట్లుంది" అని నసిగాను.

ఒక్క క్షణంలో, ఆ పాత వంటయింట్లో, మిసస్ కింగ్సులే చురుకైన కండ్లు నన్ను వెదుకుతుంటే, చూచి నవ్వుతు కూర్చున్నాను.

"బాగుంది, మళ్లీ వచ్చావా? గ్రుడ్లేమన్నా అప్పుడే కావలా?"

"లేదు—ఊరికే వచ్చాను."

"నన్ను చూడ్డానికై అతన్ని లోపలికి లాక్కొని రావలసి వచ్చిందన్నమాట?"

"అవును. నీవు చేసేయుంటావు. ఇదో ఆ జాకెట్టు విప్పి కూర్చో! ఈసారి తప్పకుండా మాతో భోజనం చేయాలి. సేత్ వస్తున్నట్లున్నాడు — అదిగో అడుగుల చప్పుడు, కూర్చో. ఇంక మమ్మల్ని అవస్థ పెట్టబోకు."

నేను మంత్రం వేసినట్లుగా కూర్చున్నా. ఆ స్త్రీలు నాకు బిస్కట్లు, బంగాళాదుంపలు, మాంసం, ఆపిల్ రసాలు వడ్డించారు. మిసెస్ కింగ్స్లే ఒక విధమైన సంతోషంతో నావైపు చూచింది. "మీ సవతి తల్లితో నే నిక్కడ నిన్ను నిలిపినానని చెప్పు." అంది.

"సరే—ఆవిడ ఇష్టపడక పోవచ్చు."

అప్పుడే సేత్ నిశ్శబ్దాగా పెద్ద అంగలు వేసుకుంటూ ద్వారంతగలకుండా తలవంచుకొని వచ్చాడు. నా కెదురుగా కూర్చుని, రెండు కాళ్లు ముడుచుకొని, ఉర్లగడ్డలు తినడం మొదలు పెట్టాడు.

"ఇదుగో రాల్ఫ్ గాంట్సన్ భోజనానికి వచ్చాడు." అంది కింగ్స్లే. అతడు శ్రద్ధతో తింటూ సాగించాడు. కొంతకాలం ఎవ్వరూ మాట్లాడ లేదు. అప్పుడు సూక్ష్మంగా నా వైపు చూచి "హైస్కూలా"

"అహా! నేను వాల్థామ్‌లోని ఒక బడికి వెళ్తున్నాను. అది హైస్కూలే అనుకుంటాను." అతని ముఖంలో సంతోషం కనుపించ లేదు.

"అదే? ఆ బ్రౌన్‌స్టన్ ఆల్‌కట్ స్కూలు. నీచానింగు పోక్సను నీకు తెలుసుగదా?-వాండ్లు "కర్ట్"కు చివరిన ఉంటూ, ఒక స్కూలు నారంభించారు. ఆ పిల్లలక్కడ చదువు కుంటు న్నారు." అంది మిసస్ కింగ్స్లే.

"అందు కేమీ డబ్బు అక్కర్లేదనుకుంటాను" అన్నాడు సేత్ "ఇప్పుడు బాగానే జరుగుతుం దనుకుంటున్నా. అక్కడ ఆడ పిల్లలు మగ పిల్లలు చాల మంచి చదువుతున్నారు."

"దానికి నే నేం చేసేది? వాళ్లు పంపు తున్నారు; నేను వెళ్లు తున్నాను." అన్నాను తప్పభిప్రాయంతోనే.

సేత్ ప్రియంగా "చూచాడు." నీవు బలవంతంతో చదువు తున్నట్లున్నావు?"

"సరే! నేనదేమిటంటే... నాకక్కడ నచ్చలేదని" అన్నాను ధైర్యంగా.

"అమాయకుడు లాగున్నట్లున్నావు."

అతని కండ్లు క్షణం నన్ను చూచినయి. నాకు భయం వేసింది. "ఇంకేదైనా మంచిస్కూలు కోరేవాడ్ని" అన్నాను గర్వంగా.

"మరి ఏదైనా స్కూలేనా?"

నేను వాండ్ల ముందర మూర్ఖుడ్ని అయినాను. వాళ్లంతా నన్ను గమనిస్తూ, ఏమీ మాట్లాడలేదు.

సేత్ ఇలా అన్నాడు. "గొప్పవాడివి కావడం నీకు ఇష్టం లేదనుకుంటా?—పూర్వీకుల్లాగా! మనం కొందరం గొప్ప తనాన్ని జూచి, లజ్జిస్తున్నామేమో?—అంతేకదూ?"

"గొప్పతనమా?" అని పెదవి విరిచాను.

"అరే! ఊరకే అన్నాను! నీ కవకాశాలున్నాయి చాల మంది కంటె. మంచి మనుష్యులు, మంచి స్కూలు—ఇంతకంటె నీలాంటి చిన్నవాళ్లకు ఏంకావాలి?"

నాకు కోపంవచ్చింది, కానీ ఏంచేయలేక సందిగ్ధంగా చూచాను.

నీవు గాబరాపడకు. అతనెప్పుడు అల్లాగే మాట్లాడు తాడు. భోజనం గానీయి." అంది మిసస్ కింగ్సులె.

మార్థా, తక్కిన వాళ్లు కలిసి సంతోషంగా నవ్వారు. నా మనస్సుకు బాధగా వుంది. సేత్ నిశ్చలంగా నన్ను చూస్తు న్నాడు. "నీకు—నీవే ఆలోచించకు—పదహారేండ్ల కుర్రాడివేగా"

"కాదు. పదిహేనేండ్లు."

నీవు నీ భవిష్యత్తును నిశ్చయించు కొన్నట్లున్నావే? అన్నాడు చురుగ్గా.

అయ్యో! దైవమా! అల్లాంటి ఆలోచనలు ఏమీ లేవు. "అసలు ఏమీ లేదా? అతడు నాచదువును గురించి అడిగాడు" లాటిన్ అంటే ఇష్టమా? గ్రీకా?"

అవేమీ నా కిష్టంలేదు. ఇంగ్లీషంటే ఇష్టమేగాని, అదీ గ్రామర్ తప్ప. చరిత్ర బాగానే యుంటుంది. మళ్లీ అడగడం మానేసి భోజనంలోకి దిగాడు.

"అతని కెప్పుడు తగిన స్కూలు చదువు దొరక లేదు." అంది మిసస్ కింగ్సులే.

"ఒకప్పుడు నాన్న పడమటి దేశంలో చాలా రోజు లున్నాడు. అంతేగా?" అంది మార్థా.

"నేను మణులగనులు త్రవ్వడానికి నిశ్చయించు కొన్నాను." అన్నాడు సేత్ కష్టంతో, చప్పరిస్తూ.

ఎలాగో అందరం సద్దుకొన్నాం. కేటిల్ చప్పుడయింది. స్పూనులు, అవి చైనా సామాన్లమీద పడ్డ చప్పుడయింది.

## 16. అధ్యాయము

నేను కింగ్సులేలకు బాధకుడ్నిగా తయారైనాను.

ఏప్రిల్ నెల ఒక శనివారము నేనక్కడికి వెళ్ళేటప్పటికి నడవలో సేత్ కొయ్యలను కోస్తున్నాడు.

"నేను కొన్ని చీల్చియిచ్చేదా?"

అవి టేకు-చంద్రకొయ్యలు. గట్టిగా శుభ్రంగావున్నవి. నేను వాటిని, బలంకొద్దిచెక్కుతుంటే సన్నని పేళ్లు ఎగిరిపోతూ, పెద్దచెక్కలు ప్రక్కగా పడుతున్నవి. అరే! గొడ్డలి పదునుగా వుందో? మార్థామని బొటనవ్రేలితో బుద్ధితక్కువ గాపదును

చూచాను. అవి మంగలికత్తికివలె పదునుగా ఉండి-వ్రేలు తెగి, గాయమునుండి జలజల నెత్తురు కారుతున్నది.

“నేనెప్పుడు ఆ గొడ్డలితోనే గడ్డం గీచుకుంటాను.” అని, సేత్ తనపని చేసుకుంటున్నాడు.

నేను గాయపునెత్తురును పీల్చి, చేతిగుడ్డను గట్టిగా చుట్టి మళ్లీ గొడ్డలందుకొన్నాను. ఈసారి నాబలంకొద్దీ విసరి గొడ్డలిని కొయ్యలో దింపాను.

“ఈవిధంగాచేస్తే ఈ చలికాలంలో బాగానేవుంటావు?” అన్నాడు సేత్.

ఎగరొప్పుతూ ఒంటికి వేడిగలిగించేపని కొప్పుకున్నాను. అతడు నన్ను నిదానించి చూచాడు. “నీవెప్పుడైనా గొడ్డలితో పనిచేసియున్నావా? ఒక్క నిమిషం ఇటుచూడు” అని గొడ్డలి తీసికొని మాపిల్ మొద్దును నట్టికి ఒకపేడునుతీసాడు. దాన్ని యెడమచేతిలో పెట్టుకొని కుడిచేతనున్న గొడ్డలితో మెల్లగా రెండుదెబ్బలు తట్టాడు. వెంటనే పొయ్యిపట్టేటట్లు మూడు తునుకలయినై. తల ఆడించి, “నేను ఏండ్లతరబడి యీ విధంగా చేస్తున్నాను. ఇప్పటికీ నావ్రేలికి దెబ్బతగల్లేదు. కాని గోళ్లు మొద్దుబారుతవి. అంతే.”

నేను రెండుగంటలు పనిచేసి ఒక మోపు కట్టెలు పేర్చాను. సేత్ ఆసమయంలో కూర్చోకుండా కొయ్యను కోస్తున్నాడు.

మనుష్యులు కష్టించి, ఎక్కువగా బాధపడుతారు. ఎందుకని? తాము బ్రతికి ఉండడానికే-మళ్లీ పనిచేసి అవస్థపడవద్దూ! ఎలాగైతేనేమ్? అతని కష్టంతగ్గించడానికి నేనుచేసిన సహాయానికతను మెచ్చుకొన్నాడు.

అతని హాస్యపుమాటలు నా కిష్టపడలేదు. అతడు చెప్పుకుని పోతున్నాడు. నేను గొడ్డలిని జాగ్రత్తగావేస్తూ, ప్రతిచిన్న దెబ్బ వ్రణవైద్యుని కత్తిలాగా పడుతున్నదని ఆశిస్తూ, -- కాని అది కొన్ని అంగుళాలు తప్పిపడుతున్నా, విరామంలేకుండాపని చేసేవాడిలాగా చేస్తున్నాను. వంగటంవల్ల వీపుపోటెత్తుచున్నా, అరచేయి బొబ్బలెత్తినాసరే పనిచేస్తామనుకొన్నా. కింగ్స్లేల నడవలో పదునైన గొడ్డలితో పనిచేయడంకంటె గొప్ప ఇంకో శక్తి లేదనుకొన్నాను.

“నీవు పనికి అలవాటుపడ్డట్టులేదు” అన్నాడు సేత్ కషపటిగా తయారుచేసిన కొయ్యను పడవేస్తూ.

నా జరిగిన గోట్టుల్ని తలచుకొని నిట్టూర్చాను. “లేదు--నీకెందుకల్లా అంటున్నావు? కొయ్యను సరిగ్గా చీల్చలేదనేనా?”

“పనిచేసేవాడు తన బలాన్ని కాపాడుకొని చూస్తాడు. నిలబడి పనిచేసేవాడు, వాగిచేయలేడు. అతడు పూనికతో చేస్తాడు. నీవు గాలియంత్రంలాగా పనిలో జొరబడతావు -- ముందుకు వంగటం, ఊగటం, చెదరిన ముక్కలవెంట పరుగెత్తటం - క్రమంగా చేయడంలేదు.”

సేతు ఎప్పుడు ఆలోచించి చెప్పేటట్లుగా మాట్లాడు తాడు. ఈ విధంగా—ఇంట్లో—ఎవరైనా మాట్లాడివుంటే కోపంగా చెప్పేవాణ్ని. కాని, ఇక్కడ తలత్రిప్పుతూ నవ్వుతూ నిల్చు న్నాను. "ఈసారి నీవు చేస్తుంటే గమనించి చూస్తాను.

ఒక బాలుడు తనకు ఎక్కువ బలమున్నట్లయితే—వాడు దాన్ని ఉపయోగించడమో? వ్యర్థము చేయడమో? చేయాలి. ఈ ప్రపంచంలో పిల్లలందరు తమ బలాన్ని సద్వినియోగం చేస్తే! మావంటి పెద్దవాళ్లం పనిచేయకుండా కూర్చోవచ్చు."

నేను నాలో ఒక గొప్పబలాన్ని, సహనాన్ని చూచుకొ న్నాను. రంపం తీసికొని నాలుగడుగుల దుంగ దగ్గరకు వెళ్లాను — అతను చెప్పిన ప్రకారం జాగ్రత్తగా చూస్తూ పల్చని రంపంతో బరబరా కోయడం మొదలుపెట్టాను. కొంతదూరం పోయేటప్పటికి రంపం వేగం తగ్గింది; శబ్ద క్రమం తప్పింది; ఉన్నట్లుండి ఇరుక్కొనిపోయింది. బలమంతా చూపి తీయ ప్రయ త్నించాను — ఎట్లో రంపాన్ని తీసి దుంగను దొర్లించి రెండవ వైపునుండి కోయడం మొదలుపెట్టాను. చేతులు నొప్పిపుట్టి నయి. కానీ, దుమ్ము రేగేటట్లు బరాబరాలాగడం, తొయ్యడం— కొయ్య గట్టిగావుంది. రంపాన్ని తీసి ఆ దుంగను దూరంగా విసరి వేశాను. ఎలాగయితేనేం? ఆ విసరుతో రెండు చీలికలయింది. ఒక తునుక ఎగిరిపోయి గోడకానించిపెట్టిన రంపంమీద పడింది. ఆ దెబ్బతో రంపం పిడి విరిగింది. రంపంవంగిపోయి చీలబారింది.

ఆ పని అంతటితో ముగిసిపోయింది.

నేను సేత్ వల్ల తిట్లు తినాల్సివస్తుందేమోననుకున్నాను. రంపం పూర్తిగా పాడయింది. ఆ పనిముట్లు సేత్ కు జీవనాధారము. నేనతన్ని పిలిచేటప్పటికి ఒకవిధంగా తల ఊపాడు, పగిలిపోయినదాన్ని చూచి. "నిన్ను నీవు చిల్చుకోలేదుగదా—ఏదైన దెబ్బ తగిలిందా?"

"లేదు—కాని చాలవిచారిస్తున్నాను. నేను—అంటే, అటువంటి రంపం ఎక్కడ దొరుకుతుంది? వీలైనంత త్వరలో క్రొత్త దాన్ని కొనితెస్తాను."

సేత్ ఆ ముక్కల్ని చేతికి తీసుకొన్నాడు. "క్రొత్త పనిముట్లమీద నమ్మకంలేదు; కొన్నిటితో అలవాటవుతుంది. అది పదునైనది..ఆ రంపాన్ని నేను చేసుకొన్నాను."

రాల్ఫ్ అతని ఉద్దేశ్యాన్ని తెలుసుకోలేక క్షమాపణ గోరాడు. అతడు ఆవేగంతో చూచాడు. "అరే! దానికేం అబ్బాయి, ఫరవాలేదు. నీవేంకష్టపడబోకు—ఇక్కడొక కొయ్యముక్క, అక్కడొక కొయ్యముక్క వేయించాలి. రైతుకు సగంపని ఇట్టివి బాగుచేయడంలోనే — మేము సాధారణంగా క్రొత్తసామాన్లనే కొనము."

అతనివెంట ప్రక్కకొట్టుకు వెళ్లాను. అతడు విరిగినదాన్ని పట్టుకొని, అక్కడ వెదుకుతున్నాడు. "నీవు నమ్మవు. సరిగ్గా చూస్తే లోకానికి కావలసిందల్లా ఇక్కడ దొరుకుతుంది." అన్నాడు వినీవినబడనట్లు.

గటుకు కొయ్యనుతీసికొని, "ఇదిగో! దీన్ని సరిగ్గా వస్తువుగా చేస్తావా?"

"నన్నా? చెయ్యమంటావు? ఆ రెండంగుళాల ముక్కను నేను చేయలేను. నిజంగా పనిముట్లను గురించే తెలేదు."

"అది నిజమేనా?"

ఆదాని కొప్పుకోన్నాను. మధ్యాహ్నంపని వినయంతో నిశ్శబ్దంగా చేశాను.

"నేనొక మేకును కొట్టగలను, కత్తి విసరగలను నేర్పుగా. కాని ఈ కొయ్యను మీరాకారంగా చేస్తే, నేను చూచి నేర్చుకుంటాను."

అతడాకొయ్యను నా చేతిలో నుండి తీసుకొని బల్ల మీద పెట్టాడు. చిత్రికను తీసికొని ఆ కొయ్యని నున్నగా తోపుడు పట్టాడు. సేత్ కింగ్సులే పని చేస్తున్నప్పుడు, అతని వంగిన ధృఢమైన చేతులు, తిరుగుచున్న మణికట్లు, దీక్షతో పని చేయడాన్ని తలచుకోకుండా, నేను చిత్రికను గాని, ఉలిని గాని, బర్మానుగాని, రంపాన్ని గాని ముట్టుకొనే వాణ్ని గాను.

అతడాముక్కను ఆకారంగా జేసి, దాని చివరం రంధ్రాన్ని చేసి, రంపానికి గూడ సాదుచేసి, రెంటిని సరిచేసి తాపటం చేశాడు. దానికి నూనె పూసి దూలానికి తగిలించాడు.

..దాన్ని మళ్లీ రేపు ఉపయోగించవచ్చా?"

సేత్ తల ఊపాడు. "ఈసారి నిలువుగా కొయ్యి. నీవు వెనక్కు లాగేటప్పుడు దాన్ని వంచేశావు."

ఆ విధంగా ఆరంభ మయింది వారి పరిచయం. శని వారాలలో-అవకాశం వున్నప్పుడు, సేత్ ఇంటికి పోయినపుడు కట్టెలు కొట్టి రాశిగా పేర్చేవాణ్ని. అతని వడ్రంగం పని చాలా బాగుండేది. అత డెప్పుడు ఇంటికి తెచ్చే. పనులు చేసే వాడు. కొంతకాలం-అంగటిలోను, చుట్టుపట్లలోను, నేను అతని వెంట బోయి పనిని గమనిస్తూ, మాట్లాడుతుండేవాణ్ని.

అతడు కోళ్లగూటి తలుపు మొదలుకొని మెహాగని కొయ్య మేజావరకు ఏపని చేసినా గమనికతో చేసేవాడు. అతనికి దేవు డదొక విధమైన శక్తి నిచ్చాడు. అతడు ఉలితో గాని, ఆాపంతో గాని చేసే ప్రతి పనిలోను ఆత్మగౌరవం ఇమిడియుంది. "శుద్ధ సత్వాన్ని నీ కంతట నీకె తెలిసినప్పుడు నీ వా విధంగా చేయగల్గుతావు. అపద్ధతిని కొంచెంగూడ తగ్గించ లేదు."

జూన్‌లో బడికి శెలవు లిచ్చినప్పుడు, అతడు నన్ను పనిలోకి తీసికొంటానన్నాడు.

"నీవు చెప్పేది ఒక మనిషి చేసే పనేనా?" అంది అమ్మ.

ఆవిడ చెప్పింది నా కర్థమయింది; పెద్దవాడు చేయ దగిందని. ఇంట్లో ఏమన్నా చేయవలసి వస్తే-బూడిద తీసి

కెళ్లడం, దుప్పట్లు దులపడం, తెరగుడ్డలు కట్టడం, పక్కలు, మంచాలు క్రిందికి దింపడం — ఇట్లాంటి వాటికి అమ్మ ఒక మనిషిని ఏర్పాటుచేసింది.

నా పనిని ఒక వృత్తిగా చెపుదా మనుకొన్నాను. పెట్టెలు చేయడం, వడ్రంగం, సేద్యం——.

"రాల్ఫ్! నీ వల్లాంటి పనులకు అలవాటు పడ లేదురా?"

"నిజంగా అలవాటు పడ్డానమ్మా"

ఆవిడ పూర్వం న్యాయంగా మాట్లాడేది; నేను కోపంగా బదులు చెప్పేవాడిని.

"నాన్న ఏమంటారో అడుగు" అంది శాంతంగా.

మా నాన్న అది సరియైన పని అన్నాడు. అతడు పొలాలను, మంచి జీవితాన్ని గురించి కలలుగనే వాడు, వాటిని నిజం చేయలేక పోయినా, గ్రామ విషయాలని ప్రియంగా తలుచుకున్నాడు. "నేను కూడా నీతో కలిసి పనిచేసే అవకాశం దొరికింది. కానీ, చురుగ్గా పని చేసే రోజులు గతించి పోయినయి. ఇప్పుడు పెద్ద సాహస కార్యాలను చేయ గలనని కాదు—కాని——"

"సేత్ కింగ్సులే నీకంటే పెద్దవాడే గదా?"

"అదేంటి రాల్ఫ్! నేనొక పండితుడ్ని; వట్టి మాటల పుట్టను, కోరముట్లతో నుండే మనిషి, చివరికి అంత గొప్పగా

వుంటాడా? అని నా సందేహం. కనీసం అతనికి ఆలోచించే బాధగూడ వుండదు. అతని మనస్సు ఏవిధమైన హాస్యం లేకుండా నిశ్చలంగా వుంటుంది."

పెద్దగా "ఆలోచనలా?? ఏం? సేత్—ఆయన—అతను ఆలోచించేటట్లుగా. ఎవ్వరూ ఆలోచించగా వినలేదు."

నాన్న బాధ్యతగా నవ్వి, "దాన్లోనాకు సందేహం లేదు. అత డాలోచించగా విభియున్నాను. నిశ్చయంగా" సేత్ కింగ్సులే గొప్ప వేదాంతి. ప్రఖ్యాతికి తగినవాడు. కాలిఫోర్నియా, కామ్టన్ నిజంగా అతన్ని గురించి గర్వపడవాల్సిందే! అతని కాంతన్యానికి ఇక్కడుండటలు భయపడుతుంటాను, నే ననే దేమిటంటే? అతడు ముఖ్యంగా తన చేతులారా పని చేస్తాడు—ఇప్పు డతన్ని చూచి అసూయ పడుతున్నా. ఈ రోజుల్లో అతని జీవితమే బాగుంది రాల్ఫ్!"

"ఎలాగైనా, అతడు నా కెంతో బోధిస్తాడు."

"అతడు నిన్ను పనికి తీసికొంటాననిగదా చెప్పాడు! అది నిన్నొక వృత్తిగల వాడ్నిగా చేస్తుంది. ఇక ఆటల తరహాగా వుండదు."

"అవును. నాకు తెలుసు."

నిజంగా నాకూ తెలియదు; అంతకంటె నాన్న కూ్కడా.—

# 17. అధ్యాయము

మనుష్యుని బలం ఎప్పుడు ఒకే విధంగా వుండదు. నాలోని శక్తి వేసవిలో కింగ్సు లేలతో పని చేసినపుడు బయట పడ్డది.

మొదట నేను ఏవో చిన్న పనులు చేసేవాణ్ని, వేసవి కావడం చేత చెమటలు కారుతుంటే అలుపుతో కొద్దిగా కష్టేలు కొట్టేవాణ్ని. చిక్కుడు పాదులు పెట్టడం, పాగతో తోటలు త్రవ్వడం, పూల చెట్లను అందంగా కత్తిరించడం చేసే వాణ్ని. సేత్ కొడవలి నుపయోగించే విధం నేర్పాడు.

మొట్ట మొదట వ్యాయామానికి, పనికిగల భేదాన్ని తెలుసు కొన్నాను. కొడవలిని అవలీలగా నేర్పుతో ఉపయోగించడం నాకు ఆనందం కలిగించింది. ఒక గజం నిడుపు కత్తి కెంత ప్రాముఖ్యత ఇవ్వాలో అర్థమయింది. దానిలో అలువు సులువులు తెలిశాయి. కాని, అబ్బా! దానిలోని కష్టం? దొడ్డి వైపున నున్న పొలంలో పచ్చిక కోయడం మొదలు పెట్టాను- అదిగడ్డి, మొక్కలుగల పావుయెకరం. మొదట ఈదటంలోని దెబ్బలులాగా, అందంగా, బలంగా, సాఫీగా కోత జరిగింది. అలసట, చెమట, బాధ-ఆ గాలిలోని పొలంలో సూర్యుడు నిప్పులాగా నున్నాడు. కత్తి తొడబడుతుంది, గడ్డితెగి వంగి పోతున్నది; పని పెరిగి పోతున్నది. అది విశాల ప్రదేశంగా తోచింది.

"జాగ్రత్త! వడ పెట్టు తగులుతుంది. ఇట్లాంటి ఎండలో టోపీ నైనా పెట్టుకుందామని తెలేదా?" అని పడమటి కంచె దగ్గర నుండి మిసస్ కింగ్స్‌లే కేక వేసింది.

కొడవలిని క్రింద పడవేసి నడుము లెత్తి నిలబడ్డాను. "కష్టమైన పని. అతడు చూస్తే కోప్పడతాడు." అన్నాను బాధగా.

"ఏమైనా సరే! మొదట నీతో మాట్లాడాలి. ఈ మిడి యెండలో, నిన్నికక్కడ పని చేయమనడంలో అతని అభిప్రాయ మేమి? ఆ యెండలో నుండి ఇటు రా! నేను నిన్నెత్తుకో రాలేను." అంది నా తడబాటును చూచి కూడ.

"నాకు ఎండవల్ల పెద్ద బాధ లేదు."

"ఔను. తుపాకీగుండుకూడా నిన్నేం చేయదు... తగల నంతవరకు. లోపలికి రా! నీకు వంటకూడా చేశాను. మార్విన్ మధ్యాహ్ననికి ఇంకొకడ్ని కుదుర్చుకుంటాడు లే!" అంది.

నేను మొగం, చేతులు చన్నిళ్లలో కడుక్కొని, వెండి కొళాయినుండి వచ్చేనీళ్లను త్రాగాను. నేను ఖాళీగా, తేలికగా నీరసంగా కనుపించాను. బాగా కష్టించిన తరువాత కలిగే సుఖాన్నింతకు ముందెప్పుడూ ఎఱుగ లేదు. మనిషికి వయసొచ్చే కొద్ది తప్పించుకోకుండా రాత్రింబగళ్లు పనిలో వుండాల్సిందే.

కొన్ని నిముషాలు విచారించి, నీవు భోజనానికి రా; ఎంత సేపుం చేవి?" అంది కింగ్స్‌లే.

ఆ స్వరాన్ని ఎప్పుడూ వినేవాడిని. అవి మాటలను శాణాలుగా మార్చేది. అది నన్ను లాలించింది; పాలించింది; ముద్దాడింది - - అంతలోనే నా వయస్సును - చెడు నడతను, అమాయకత్వాన్ని నిందించింది. అయినా ఆ మాటలు హాస్యాన్ని ఆనందాన్ని గొల్పినయి.

"సేత్ ఆకుకూరలను తినడు. నీవే తినాలి - - క్రొత్త "క్రిస్ప్" బిస్కట్లు, తేనె...దీనితో విందు చేయవచ్చు."

"ఇవేగదూ మనిషిని తయారుచేస్తుందన్నావ్." అన్నాను నవ్వుతూ.

"తప్పకుండా! ఆయన్ని ఈ ముప్పైయేండ్లుగా తిన్నతిండే మనిషినిగా చేసింది...నిన్ను ఇవ్వాళ ఇక్కడుండమన్నా!"

ఆ వేసవి మట్టమధ్యాహ్నంలో తృప్తిగా భోజనం చేస్తుండగా, స్క్రీన్ తలుపు తెరచుకొంది; దూరంనుండి మాటలు విన్పించినయి.

"వాళ్ళకు భోజనాలయినయ్. నీకు తోచినట్లు చెయ్. పనిచేయడమో? మానడమో? నీవు వస్తావని మార్విన్‌తో చెప్పలేదు" అంది.

గుజ్జుపు సకిలింతలు, బాడ్లచప్పుడు వినిపించింది.

"ఏం తప్పకుండా పనిచేస్తాను."

కోయడం, బాడికెత్తడం - ఇట్లా అన్ని పొలాల్లో జరుగుతున్నది—చెమట, దుమ్ము, మిడియెండ, బాడ్లరొద, కోసిన

పిల్లను కుప్పలుపెట్టి కళ్లానికి తీసుకెళ్లడం - బండ్లనుండి గడ్డిని దింపి కొట్టానికి చేర్చడం - ఐదుగంటలు పనిచేశాను. ఇప్పుడే కొద్ది విశ్రాంతి; చెమటబట్టిన ఒంటిపై తగిలే చల్లగాలి. పాన కము - ఘాటుగా, తియ్యగానున్న వైను,-కబుర్లు - తరువాత అదే కార్యక్రమం.

అతడొక డాలర్‌ను ఇచ్చి, "ఇవ్వాళ బాగా పనిచేశావు. అలసిపోయినాక్. సరిపోయిందా? రేపు పడమటి పొలాన్ని దున్నిద్దామనుకొంటున్నా. నీ కిష్టమైతే గురువారం రా."

"వస్తానండి, థాంక్స్" అన్నాను.

అతడు వెనక్కి తిరిగి గుఱ్ఱాల దగ్గరికెళ్లాడు.

నే నంతకుముందెప్పుడు పెద్దవాడి ననుకోలేదు. తరు వాత సేత్ నన్ను తనకు సహాయంగా తీసికెళ్ళేవాడు. కొన్ని సమయాల్లో కట్టడపు పన్లుచేస్తూ ఇంకో జత చేతులుంటే బాగుండేది, అని తలచేవాడట. ఇప్పుడు నన్నుపయోగించు కొన్నాడన్నమాట. చక్కగా కొయ్యలు కోయడం, మేకులు దిగకొట్టడం నేర్చుకొన్నాను. రేఖా గణితం, కోణాలు, అతు కులు చేర్చి ఒకవస్తువుగా చేయడం చక్కగా గమనించాను. తలుపులు, దీప స్తంభాలు, వ్రేలాడేదీపాలు, కొయ్యసామాన్లు- అన్నిటిలోను మంచి నేర్పును పొందాను.

అప్పటినుండి గారట్సన్ల పక్షం వహించాను. ఇంట్లో వాళ్లపై దురభిప్రాయంతో అసభ్యంగా వర్తించడం జరుగు తున్నది. మా నాన్న ఇస్తానన్న అవకాశాన్ని నిరాకరించాను.

"రాల్ఫ్! మీ అమ్మ, నేను,—నిన్నొక స్కూల్లో చేరుస్తామనుకొంటున్నాము. నీకిష్టమేనా?"

"అంటే ఆల్కాట్‌స్కూలు వద్దంటారా? దానికొప్పుకుంటాను. అదొక చచ్చుస్కూలు...అక్కడెవరూ చదువుకోలేరు. అది రోతగా వుంటుంది."

నాన్న నవ్వాడు. "అయితే సరే! లింకన్‌లోని మిస్టర్ హాక్‌కు వ్రాశాను, అతడు నిన్ను, ప్రైవేసు తీసికెళ్లుతాడు. అక్కడే నేను చదివింది. హాక్ గొప్పవాడు."

"అంటే! నేను వెళ్లాలా?"

"ఆ! వెళ్లద్దూ మరి?"

"నాకు వెళ్లాలని లేదు నాన్నా! ఇంట్లో వుంటే ఈ బడికి వెళ్లుతాను."

"కాదు. రాల్ఫ్!...నీకీబడి పనికిరాదు."

"అదేమిటి నాన్నా! హార్వే, సిడ్ వెళ్లటం లేదూ? ఇంకా ఎంతోమంది మంచివాళ్లు పోతున్నారుగా?"

"అవిగాదు. నీవు మంచివిగా వుండాలి. కామ్టన్ బడిలో సరియైన బోధన లేదు...కాని, హైస్కూళ్లలోనే వుంటవి."

"కాని లింకన్...అదొక మనుష్యులగుంపు" అన్నాను నిస్పృహతో.

"హాక్ నీకు తెలియదు. రోమన్ దేశస్థుడు; న్యాయ బుద్ధిగలవాడు, గొప్ప ఆటగాడు కూడా. 'విర్టస్' అనే పదం అతన్ని, అతని బడిని వివరిస్తుంది. అతని కిచ్చిన "మూటో" పట్టం అతని సౌశీల్యాన్ని తెలుపుతుంది. అది మనుష్యత్వాన్ని గిలి గిస్తుంది" అన్నాడు నాన్న.

నేను బదులుచెప్ప లేక పోయినాను. నాకు దుస్స్వ ప్నాలు వచ్చాయి.

"గొప్ప విద్యనభ్యసించు. ఎంతోమంది ఇటువంటి అవ కాశానికి తపిస్తుంటారు." అన్నాడు సేత్ కింగ్సులే.

## 18. అధ్యాయము

నాన్న నన్ను గాక్స్ కారులో లింకన్‌కు తీసికెళ్లాడు. కొద్ది సేపులో మేము పెద్ద గేటు, మైదానం, ఆటస్థలాలు, పెద్ద కట్టడాలతో నున్న పాఠశాల భవనానికి వచ్చాము. లోపల ఉపాధ్యాయులు, ఆహ్వానికులు, సంతోషంతో కేక లేస్తున్న విద్యార్థులు, నూతన విద్యార్థులు, అక్కడ నున్నారు. వారి తలిదండ్రులు సామానులు—మూ నూనెరి-మోటారు కారులు—పెద్ద గదులు, హాలులు, ఎత్తు గదులు-ఇంకా ఎన్నో.

సాయంకాలము ప్రధానోపాధ్యాయుడు నా బాధ్యతను తీసికొన్నాడు. మేము పెద్ద ఎత్తు స్తంభాల హాలులో ఆంగ్లేయా చారాను గుణంగా భోజనం చేశాము. మర్యాదస్తులందఱు ప్లాట్‌ఫామ్ మీద కూర్చున్నారు. మా నాన్నగూడ అక్కడే వున్నాడు. ఇంకా పురాతన విద్యార్థులు, వారి పిల్లలు, ఇంకా

ఎంతో మారి నాకు తెలియని వారు—'మిష్టర్ ముక్' అతని గంభీర రూపం అందరిలో గొప్పగా కనిపించింది; తేజోవంతమైన శరీర కాంతి, అతని స్వచ్ఛమైన జుట్టు, నల్లటి దుస్తులు, పెద్ద కంఠస్వరం గంభీరంగా వినిపించింది. నేను, అక్కడున్న వాళ్లం దఱు-అతడు మమ్మల్నే చూస్తున్నాడని తలచాము.

"సోదరులారా!—" ఆ స్వరం మహిమ వంతంగా తేజోవంతంగా, ఘనీభావంగా కనిపించింది. వెంటనే ఆ ప్రదేశం 'చర్చి'వలె నిశ్శబ్ద మయింది.

అతడు టేబిలు ముందుకు, ప్లాట్‌ఫామ్ అంచుకు వచ్చి తన ఆరడుగుల రెండంగుళాల శరీరాన్ని, గంభీరంగా తిరుగుతు ఉద్రేకంతో ముందుకు వాచి, తన దృఢమైన చేతుల్ని మా వైపుకు జాపాడు.

"సోదరులారా!...మన మీరోజు యువకులు, వృద్ధులు, అందఱు కలిసి, ఈ ప్రియమైన హాలులో, పరస్పరం అనుభవించే ఉత్సాహం--క్రొత్త సంవత్సరంలో సాహసంగా పేర్కొనదగిన యీ యుత్సాహం—ఇదే లింకన్ స్థాపనకుండే-ప్రధాన శక్తి."

అతని స్వరం ఆగినా, మాటలు మాత్రం స్థిరంగా నిల్చినై. ఎవ్వరు ఊపిరి గూడ వదలలేదు.

"మీారు ప్రపంచమంతా తిరిగి రావచ్చు; నేను బ్రతికినంత కాలం బ్రతుకవచ్చు; మానవ సమూహంలో ఇంతటి భక్తిని ఎక్కడ చూచియుండలేదు. మనము-నీవు, నేను అందరము

కలిసి స్కూలు సంఘ శక్తిని సృష్టించాము. అనేటున్నాను. నేను నా చుట్టు ప్రక్కలా జూచి, మనస్సులో అను కొంటున్నా. ఇదే లింకన్ ...”

ఆ క్షణం నుండి లింకన్ శక్తి మమ్ములని జారవిడున లేదు. స్కూలంతా ఆటల జట్టువలె పెద్దదిగా తయారగుతున్నది. క్లాసులు క్రమశిక్షణతో నిర్బంధంగా జరుపబడేవి. ఎవ్వరికి సంతోషం లేదు——అప్పటికి టోరీల పరిపాలన రోజుల్లో వలె పాఠాలు చదవటం, వల్లించడం అంతే. యూరప్‌లో యుద్ధం రెండేండ్లగా జరుగుతున్నది. లింకను మతస్థులమగు మేము—గౌరవాభిప్రాయంతో భావించే సూత్రాల ననుసరించి పాస్టినుల చావో, బ్రతుకో అనేవాడిన్ని — ఆటలపోటీగా భావించే వాళ్లం.

క్రొత్త విద్యార్థినైన నేను కొంతకాలం పురుగుల కంటె నీచంగా చూడబడ్డాను. కొంతమంది క్రొత్త విద్యార్థులు గౌరవంగా చూడబడడం గమనించాను. కొందరు ఆటల నేర్పు వల్ల, రూపం, నడతలవల్ల, మాటలు, అలంకారంవల్ల గౌరవాన్ని పొందారు. నేను తెలివితక్కువ వాణ్ణిగా చూడబడ్డాను. వీరుడిగా పేరు పొందక పోయినా, కనీసం మంచి వాడుగానైనానవుదా మనుకొన్నాను. కాని మొదటిసంవత్సరం తక్కువగానే ఉండవలసి వచ్చింది.

నేను మొట్టమొదట చేసిన తప్పు అక్టోబరు శనివారం 'ఎస్సెక్స్' పోటీ నాడు. ఆ ఎస్సెక్స్ పోటీ ముఖ్యమైన ఉత్సవంగా అధికారయుతంగా ప్రకటింప బడింది. ఆ రోజు ఉదయం

స్కూలుకు శెలవు. మీటింగులు, దేశ దేశాలకు పోటీలు, ఫుట్‌బాలు, టెన్నిస్ టోర్నమెంటు, డాన్సు, వినోదాలు జరుగుతవి.

కానీ, నా మనస్సు ఇక్కడ లేదు. ఆహ్లాద కరమైన శరదృతువులో అడవిలోని చెట్లు ఎర్రని పచ్చని కాంతితో ప్రకాశిస్తూ, కమ్మగాలులు వీస్తూ—బాగుంటుంది. నా మనస్సు కొండలపైన విహరిస్తూ, చల్లటిగాలుల్లో పరుగెత్తుతూ, గ్రామము వీధుల్లోను, పొలాల్లోను, తిరుగుతున్నది. నేను ఎప్పుడూ, కింగ్స్‌లేల గురించి, - సేత్, మార్థా. మిసస్ కింగ్స్‌లే, పాతయిల్లు, వంటయింట్లో మండే కుంపటి—మళ్లీ నే నక్కడికి వెళ్లినట్లు, స్వేచ్ఛగా వున్నట్లు కలలు గనేవాడిని.

ఆ గొప్ప ఎస్సెక్స్ ఆట పోటీ లప్పుడు ఆ మంచి శనివారంనాడు—ఉదయపు ఫలహారాల సందడిలో నెమ్మదిగా జారుకున్నాను. నిశ్శబ్దంగా, ఖాళీగా వున్న గదులు, కట్టడాలను దాటి వెళ్లిపోయినాను. నేను ఉత్తరపు హామ్‌టన్‌కువచ్చి, అక్కడి నుండి దక్షిణంగా గుట్టలు మీదుగా. 'ఆర్చర్డ్' తోటల గుండా తిన్నగా సేత్ ఇంటికి వచ్చాను.

అప్పుడు సరిగ్గా మధ్యాహ్న భోజనాల సమయం. వాళ్లు నా కోసరం చూస్తూన్నట్లుగా కనిపించారు.

"ఇదుగో రాల్ఫ్!" అంటూ, మార్థా నవ్వుతూ, మిసస్ కింగ్సులే పెదిమలమీద నంపుగా నవ్వుతూ—ఆ రోజు చూచిన. విచిత్రమైన విషయం నేనే అన్నట్లుగా—చూచారు.

"నశించివచ్చినట్లున్నాడు. ఏదో ఇటువంటివెఱ్ఱిపనిచేస్తాడు. ఏమీ చేయలేక ఇంటికి పరుగెత్తి వచ్చేలాగ" అంది మిసస్ కింగ్స్లే.

నేను వెఱ్ఱిగా వాళ్లను చూస్తూ నిల్చున్నాను. "కుర్ర తన స్వభావాన్ని మానలేదు. అంతేగదూ?"

ఆకలితోనున్న బాలుడూ అంతే. సరే! రాత్రిగాని, పగలుగాని, నీ వెప్పుడు వచ్చినా సరే ఆహ్వానిస్తాము"

నేను ఇంటికి వెళ్ల లేనని, వెళ్లను అని తెలుసు కొన్నప్పుడు కొంత గొడవ జరిగింది.

"నీవు తప్పకుండా వెళ్ల వలసిందే" అని యిద్దరూ అన్నారు.

తలుపు దగ్గర సేత్ అడుగుల చప్పుడు విని కేక వేసింది. "భోజనం తరువాత నీ నతన్ని పిల్చుకొనిపో -- ఎక్కడో దొరికాడని చెప్పాలి."

సేత్ నే ననుకొన్నట్లుగా దీర్ఘంగా చూచాడు వారిద్దరి ముఖాలని, మళ్లీ నన్నూ చూచాడు. "ఏమిటీ గొడవ?" అన్నాడు.

"నేను తప్పించుకొని వచ్చాను."

ఏదో తృప్తితో తల ఆడించాడు. "అంతటి అవసరము వచ్చిందా?"

"నాకు ఇంటి బెంగ కలిగింది."

అతడు కొంచెం యోచించాడు. "నీవు ఇక్కడే వుండా మనుకుంటున్నావా? మళ్లీ వెళ్లుదామనా?"

నేను వంటగదిని చూస్తూ, కిటికీలో నుంచి పచ్చిక బయళ్లను చూస్తూ నిల్చుని.—"నా వుద్దేశ్యం – –" అంటూ మొదలు పెట్టాను.

"ముందు భోజనం కానియ్. తరువాత లే"

భోజనం తర్వాత, నన్ను గురించి సేత్, మిసస్ కింగ్సు లేలు వాదించుకొన్నారు. సేత్ స్కూలు కెళ్లడం మంచి దన్నాడు; ఆవిడ మొదట ఇంటికి వెళ్లాలన్నది. అతడు ఉత్తరపు హామ్టన్‌ను దాటి గుర్రాని కోసరం వెళ్లుతాడట. అందాక నన్ను గూడ తీసికెళ్లుతా నన్నాడు.

అతడు నార్త్ హామ్టనుకు బండిలో పోతుంటే, నూడా ఎందు కెళ్ల గూడదు? ఈ గొడవ వదలి మంచైన కలుగవచ్చు. ఆవిడ మెల్లగా నవ్వింది.

నేను 8 గంటలకు స్కూలుకు చేరుకున్నాను. ప్రతివాడు ఆ శెలవు రోజు ననుభవించాడు.– – నేను గూడ ఆ ఉత్సవంలో పాల్గొన్నట్లుగా వారితో చేరాను.

" గారట్సన్ ! ఆశ్లాంకె టప్పుడు కనుబడ లేదే ? " అన్నాడు 'లాయడ్ నోబిల్' టీ పార్టీలో.

అతని బెదరింపును గుర్తించాను. అతడు మాగ్రూఫ్ (జట్టు)కు ప్రతినిధి.

"గారట్సన్ ! నీవు శనివారం భోజనానికి రాలేదే? కారణ మేదైనా వుందా?" అన్నాడు 'లాటిన్స్' హాజరు పట్టికను జూచి.

మూడు రోజుల్లో - రాల్ఫ గారట్సన్ దూషణ అధి కార నిరసన, న్యాయ బద్ధంగాను ఇంకా అధికంగాను శిక్షను పొందాడు. విద్యార్థి సంఘంలో స్కూలు మర్యాదను కాపాడ లేదని, అందుకని ఒక సంవత్సరం ప్రొబేషన్ ఉంచాలని తీర్మా నింప బడింది. ప్రధానోపాధ్యాయుడు నన్ను పిలువ నంపాడు. అప్పుడు తిక మకలు పడి నిజంగా ఏం జరిగిందో? ఆలోచించుకో లేని స్థితిలో నున్నాను.

ఆయన టేబిల్ ముందు కుర్చీలో నున్నాడు. "కూర్చో గారట్సన్! శనివారం నాడు ఒక ఆట ఆడావన్నమాట? సహ జంగానే వుంది."

నేను ఒక నిట్టూర్పు విడిచాను. ఆ వృద్ధ ముఖం దయా ర్ద్రంగా కనుపించింది.

"నిజమే పిల్లలు మార్పు పొందరూ ? నేను యాభై ఏండ్లగా చూస్తున్నాను. మీ నాన్నగూడ షికారు వెళ్లడానికి ఇష్టపడేవాడు." ఆ నొక్కి పలకడం నాకు భయం వేసింది.

"ఇప్పటికీ అలాగే చేస్తాడు." అన్నాను గొణుగుతో.

అతడు తన పెద్ద తల నాడించాడు. "నీవు వెళ్ల దగిన కాలం వుంది. అప్పుడు సమ్మతి యిస్తాను. నీ ధర్మాన్ని నిర్వ ర్తించవలసి నప్పుడు గాదు గారట్సన్? ఇదిగో అర్థమయిందా?"

నా స్వరం నిలిచి పోయింది. ఎట్లో "థోర్యు సంగతి" అని అనగల్గాను.

అతని రూపం రాతి విగ్రహంలాగ నిల్చింది. "సరే."

అతడు నన్ను భయ పెట్టాడు. కాని మాటలు వస్తూనే యున్నై. "అతడు తానే ముఖ్య మని నమ్మేవాడు. నియమిత కార్యాలుగా, షికార్లను చేసేవాడు - - సరిగ్గా ఇక్కడే 'వాల్డన్'లో ఒక గదిలో వుండేవాడు—"

"అవును! నాకు తెలుసు గారట్సన్?"

నేను 'థోర్యో' నందుండే నమ్మకాన్ని పోగొట్టు కొన్నాను

'మనిషి యొక్క ధర్మ మేమిటంటే? స్వాతంత్ర్యంగా వుండటమే — -' అనే వాడు 'ఎమర్సన్' కూడా 'అన్నాను ధర్మాన్ని చిక్క బట్టుకొని.

ప్రధానో పాధ్యాయుడు ఆలోచనలో గడ్డం తవ్వుడు కుంటూ అన్నాడు. "ఈ ప్రపంచంలో రకరకాల వారున్నారు గారట్సన్ - — కొందరు నాయకులు, కొందరు సేవకులు, కొందరు ప్రేక్షకులు. కాని, లింకన్‌లో మాకొక గొప్ప అభి ప్రాయమున్నది - ఇక్కడ నాయకులుగా తర్ఫీదు చేస్తాము. మంచి నాయకుడు స్వార్థం లేకుండా వుండాలి - - అర్థ మయిందా? ఒక ఆఫీసరు మొట్ట మొదట తాను సేవకుడుగా నుండి ఆజ్ఞలను అంగీకరిస్తాడో, ఆలాగే నాయకుడు అను చరుడుగా వుండే విధాన్ని తెలుసుకోవాలి. మనం మొదటి ఐక

మత్యంవల్ల జరిగే శారీరక - మానసిక బలాలను గుర్తించాలి-మనం దాన్ని సంఘ మంటున్నాము. అతడు ఆ సంఘ బలాన్ని ఎలా ఉపయోగించాలో? పరోపకారం ఎలా ఆచరించాలో? స్వార్థాన్ని ఎలా త్యాగం చెయ్యాలో తెలుసుకోవాలి. అదే నిజమైన నాయకుణ్ణిగా చేస్తుంది. తెలిసిందా రాల్ఫ్? నీ థోరోస్, ఎమర్సన్‌లు - స్వార్థ పరులు, ప్రేక్షకులుగా వుండే వాళ్లు - అంతే కాని, లోకానికి పాటుపడడం లేదు-నిజంగా ఎందరో గొప్ప జ్ఞానులవలె తమ విధ్యుక్త ధర్మాలను మరచి పోయినారు.''

ఆ సంఘటనమునుండి నాకు ఆలోచనగలిగింది. ఉద్రేకంతో గదుల్లోనుండి వెళ్లిపోయినాను. ఆలోచనాపరులంతా ఒకే తెగకు చేరియుంటారనుకొన్నాను. బైబుల్, షేక్స్పియర్, మిల్టన్, ఎమర్సన్-వీరంతా ఒకేవిధమైన సత్యానికి పాటు పడ్డారు. కాని, 'రెవరెండు కాడ్ ఫిష్' ఒక్కడే విజ్ఞానము అసంబద్ధంగాను, భయంకరంగాను ఉన్నదన్నాడు.

## 19. అధ్యాయము

మరు సంవత్సరం లింకన్‌లో నా ప్రవర్తన క్రమంగా క్షీణదశకు వచ్చింది. నాకు దుర్వృత్తి అలవడినది, మంచిని నిరసించేవాణ్ణి. ప్రతిదాన్ని క్రూరంగా నిరసించడంవల్ల, ఒకప్పుడు ఆదరణ, పొగడ్త కలిగేవి. ఈ నూతన వైరాగ్యం నన్ను పాపాలకు దించింది. కానీ, కీర్తి ప్రతిష్ఠలు సత్యవర్తనలుగల గారెట్సన్ కుటుంబంలోని నాకు పాపంచేయడం సులభంగాదు;

అన్నిటికంటె ముఖ్యంగా నిర్మలమైన ఈ లింకన్ ప్రాంతాలలో అట్టి దుర్నీలతకు అవకాశం లేదు.

నేను ఎంతో కష్టంమీద పొగత్రాగడం నేర్చుకొన్నాను. టెక్సాస్‌నుండి వచ్చిన 'మస్టీ ఎల్లిస్' అనేవాడు దీన్ని నేర్పాడు. మిక్కిలి దుష్టుడు. వంకులుజుట్టు–చిరునవ్వు– వాడు సులభంగా మనుష్యులను వంచించి సుఖంగా వుంటాడు. తనకు తోచినట్లు వర్తించేవాడు–ఎండికాట్, సిటిగోష్ఠాలద్వారా ఇండ్లపైకెక్కడం, గొర్రెలను అద్దెకుతెచ్చి పోటీలనడుమ వదలడం – ఇలాంటివి అనుకొన్నంతలోనే నిర్భయంగా చేసేవాడు. అతడు దేని మీదనైనా, కూర్పుగలిగితే స్వారిచేస్తాననేవాడు; 'మిడిల్ సెక్స్' గ్రామానికంటె పెద్దవైన బీళ్లు ఉన్నాయట, వానికతడే వారసుడట. అతడు ఘాటు సారాయము, పొగ త్రాగేవాడు. రోత పుస్తకాలు చదివేవాడు. ఆడపిల్లల్ని వెదకుతూ ఊరంతా తిరిగేవాడు. అతని పనులను దుర్మార్గం అనలేను. అతనొక్కడే స్కూలుకంతా నవ్విస్తూ హాస్యంగా మాట్లాడేవాడు. అతనికది వరం. అతడు అందరిని కవ్వించి నవ్వించేవాడు. తరగతిలో లోకువగా చూడబడుతున్నానన్నది తెలిసికూడా అతడేమీ తలచేవాడుగాడు. అతనికి సద్భావాలు పెంపొందడానికై అతని తండ్రి పంపాడు. కాని అతడు నేర్చుకొన్నదల్లా పోకిరితనమే.

రాల్ఫగారట్సన్‌కు మొత్తానికి అతని స్నేహంవల్ల నష్టం గలిగింది. ఈ బంధ విముక్తికై ఆలోచించడానికి – అతడేదో మార్గం చూపేటట్లుగా తోచాడు.

వసంతర్తులో ఈ పరిస్థితులకు తట్టుకోలేకపోయాను. ఆటలు లేవు; స్వాతంత్ర్యం లేదు; చెట్లక్రిందికి షికారు వెళ్లడానికి లేదు; తోచినపని చేయడానికి లేదు. కనీసం దేనికి అవకాశం లేదు.

దానికి ఫలితంగా నేను ఏప్రిల్‌లో వెన్నెల రాత్రిలో 'గిమ్.' కప్పుమీదనున్నాను. లింకన్‌లోని పెద్దకట్టడాలు విచిత్ర స్వతంత్ర భావాలుండే బాలుడు కోరదగినయెత్తు, కప్పులతోనున్నవి. ఆ కట్టడాల పైకప్పులు ఒకటొకటి కలిసి, మధ్య మధ్య కోణాలు, మిట్టపల్లాలుగా వున్నై. మస్టీ ఎల్లిస్ గొట్టాలనుబట్టి యెక్కుతుంటే నేను ఆ వెన్నెలలో మెరిసే కప్పులకి అతని వెంట ప్రాకాను. అవి 'ఆల్‌పైన్' పర్వతాలవలె లోయలు, భయంకరంగా పల్లాలు ఉన్నవి. గిమ్ అన్ని కప్పులకంటె ఎత్తుగా, దృఢంగా వుంది. ఆ అర్ధరాత్రిలో ఆహ్వానిస్తున్నట్లుగా నిల్చింది. మస్టీ కొండపిల్లిలాగా జరజర ప్రాకుతూ, మధ్యమధ్య నన్ను లాక్కుంటూ, ఎల్లాగో పైకెక్కాడు - వెన్నెలలో తారు, ఇసుకతో చదరంగా చేసినచోట కూర్చున్నాం- - గిమ్ నిద్రించే మనుష్య ప్రపంచానికి ఎత్తులోవుంది.

మేము సిగరెట్లు ముట్టించి, హాయిగా పడుకొని, చంద్రుణ్ణి, నక్షత్రాలను, చెట్లచివర్లను చూస్తూ మాట్లాడుకొన్నాం. అతడు తనకున్న బీళ్లనుగురించి చెప్పాడు-నాకేమైనా భయంలేదు; మళ్లీ ఇంటికెళ్ళాలి. ఆ బీళ్లని వృద్ధికి తేవాలి అని.

మేము అక్కడినుండి క్రిందికిదిగి మా గదులవైపుకి వెళ్లుతుంటే, ప్రధానోపాధ్యాయుడే మమ్మల్ని "మీరంతట మీరు క్షమాపణ కోరుకోండి" అని కేకవేశాడు. అతడు తనమేడమీది గదిలోనుండి 300 గజాలనుండి నిప్పు వెలగడం చూచాడట! "గారట్సన్! వెంటనే దిగిరా! అబ్బాయ్! నీవు కూడా--మీరిద్దరూ?"

మస్టీ కుందేలుపిల్లలాగా పారిపోయాడు. నేను కొయ్యలను, గోట్టాలను పట్టుకొని తికమకపడుతూ క్రింద చెప్పుల చప్పుడు విన్నాను.

వెంటనే "ఒరే అబ్బాయ్! ఆగు అక్కడ్నే-" అని పెద్దగా వినబడ్డది.

ఆ కేకకు స్కూలంతా లేచింది. అతడు కావలివాడు (వాచ్ మన్) టీచర్లని, మానేటర్లని పిలిచాడు -- నేనంతకు ముందెన్నడు, ఆజ్ఞలివ్వడం, పెత్తనదార్లు సంరంభంగా తిరగడం, వెతకడానికి గుంపులుగుంపులుగా బయలుదేరడం చూడలేదు. తలుపులు తెరుచుకొని వెలుతురువచ్చింది. కొన్ని భుజాలు, తలలు తొంగిచూచాయి. కొన్ని గొంతులు అరిచాయి.

"ఆ కప్పుమీద నీతోబాటు ఎవరున్నారు గారట్సన్?" ఎల్లిస్‌లాగా వుంది. "ఇద్దో! మీలో కొందరు -- మిస్టర్ లాటిమర్! ఎలీస్, అతని రూములోనున్నాడేమో చూడండి పొగత్రాగుతూ -- వినిపించిందా? నా స్కూలులో పొగ త్రాగడమా? ఏమాత్రం సహించను -- మీరంతా గుణపాఠం నేర్చుకోండి. ఎలీస్ గూడ నీతో వున్నాడా గారట్సన్?"

నేను గుటకలు మింగుతూ నిల్చున్నాను. నా యెదుట ప్రధానోపాధ్యాయుడు ఠీవిగా నిల్చున్నాడు. వెనుక ప్రక్క అతని అనుచరులు దీన్ని గమనిస్తున్నారు.

"మాట్లాడవేం, గారట్సన్? నోరుమూసుకొని యుండే సమయంగాదు. ఇది న్యాయాన్ని ధర్మాన్ని అనుసరించవలసిన సమయం."

ఆ వాడిచూపు నామీద నిలిచింది. మాట్లాడవలెనని నాకు తెలుసు. ప్రధానోపాధ్యాయుని గంభీరస్వరూపం నన్ను బండక్రింద పెట్టినట్లు బాధించింది. మాటరాలేదు. అతన్ని నిశ్చలంగా చూచాను.

ప్రధానోపాధ్యాయునికి ఇతర విషయాలర్థమైనవి. ఆ సమయంలో తనని సాగదనుకొన్నాడు.

క్షణంలో ఆ రంగం మారిపోయింది.

"సరే!" అందరు వెళ్ళి పడుకోండి. 5 నిమిషాల్లో దీపాలన్ని ఆర్పివెయ్యాలి." అన్నాడు నిశితంగా, అధికారంతో. అతడు నన్ను గురించి, ఎల్లీస్‌ను గురించి అక్కర తీసికోలేదు. అందరు వెళ్ళింతర్వాత తానుగూడ వెళ్ళాడు.

మస్టీని గురించి ఎట్టి నిరూపణ పైకిరాలేదు. కాని, అందరికి అతని విషయం తెలుసు.

నేను ఉత్తీర్ణుడను (పాసు) కాలేదు.

## 20. అధ్యాయము

హార్వర్డ్‌లో రెండేండ్ల తరువాత అక్కడగూడ ఫెయిల్ (తప్పిట) అయినాను. నేను మళ్లీ దరఖాస్తు పెట్టుకొని, వాళ్లిచ్చిన పనిని చేయడానికి సమ్మతించివుంటే, నన్ను తీసికొని వుండేవాళ్లు.

కొందరు ధనవంతులు, మధ్యరకంవారు -- వివిధ భావాలతో హార్వర్డు చరిత్రనుగురించి భిన్నాభిప్రాయాలతో వాదించుకొనేవాళ్లు నేను తప్ప. ఇట్టి విషయాల్లో ఇష్టం లేకపోయినా, ఏదో ఒక పార్టీలోచేరి ఉత్సాహంగా వాదించాలని అనుకొన్నాను.

ఈ పాత కట్టడాలు, ఈ పెద్దమనుష్యుల మధ్య మా స్వాతంత్ర్యోద్యమాన్ని జరుపలేక పోతున్నాం. కనీసం పానీయాల్ని పుచ్చుకొనేటప్పుడుగూడ భయం కలిగేది. ఈ దుష్కార్యాల్లో నాకెంత వంతున్నదా? అని ఊహించుకొంటే, సులభంగానే తోచేవి. త్రాగుడు, దుస్సహవాసం. దేవుడు లేదనడం మంచిదని వాదించవచ్చు. మొత్తానికి యువకులు సంతోషంగా వుండలేకపోతున్నారు. దుష్కార్యాలు సులభంగా చేయవచ్చు. కాని చేయాలని మనస్కరించడం లేదు. చీకటిపడేదాక తీరికగా లోకంలోని మంచిచెడ్డలను తర్కించుకొనేవాళ్ళం. దేశంలోని దురాచారాలను బహిష్కరించడం మా ధర్మం అని తలచాము.

నాతోపాటు సోమరితనంగా ఊరకేవుండక తెలిసికొన్నదేమంటే-విజ్ఞానులు, గొప్పవారు, 1920 సం॥నకు పూర్వము

దున్న ప్రజ - దురాచారాలను గమనించడం తప్ప ఏ చదువూ లేదు. నేను స్వాతంత్ర్యం అనుభవించడానికై కామ్‌టన్‌కు వచ్చాను. నాకు గొప్ప ఉద్దేశ్యాలుగాని, బాధ్యతలను గురించి గాని ఏ చింతా లేదు. సాధారణ ప్రజలకంటె అతీతుణ్ణి అనుకున్నాను. ఉద్యోగం సంపాదించాలంటే ఈ నాగరికయుగంలో ఆమెరికావలె వస్తూత్పత్తి చేయడం ఇష్టం లేదు. కాని, నేనేం చేయగలనో? నా నైపుణ్యాన్ని ఎట్లా ఉపయోగించాలో నాకు తెలియు లేదు.

"రాల్ఫ్! నీవు చాలాసార్లు ఫెయిల్ కావడంచేత నిన్ను తీసేసారని విన్నాను."

"అవును నాన్నా! అంతే అయింటుంది."

నాన్న విచారంతో గడ్డం తడవు కుంటూ నిట్టూర్చాడు. "నీ తప్పిదాలకు కారణాలను చెప్పగలవా?"

"బహుశా! అంత శ్రద్ధ చూపలేదేమో?"

"అందువల్ల చదువు నూనా వన్నమాట. ఏం చేద్దామనుకొన్నావ్?"

"కాదు నాన్న! ఇప్పుడే మొదలు పెడుతున్నాను. చదువుకోటానికి కొంత కాలం గావాలి." అన్నాను అసమ్మతంగా. "నేను కొద్దిగా వ్రాత పని కూడ చేయాలనుకుంటున్నా."

"నీ చెప్పుడూ వ్రాయలేదుగదూ?"

"ఏవో కొద్దిగా పద్యాలు వ్రాశాను. వ్రాయలేక పోయినా, వడ్రంగిగా జీవితం గడుపుకోగలను. ఆపని చేసే సామర్థ్యముంది"

మంచి నేర్పుగల వడ్రంగులు కూడ గొప్పరచయితలుగా నున్నారని అభిప్రాయ పడుతున్నా; కనీసం బ్రదుకు తెరువు చూచుకోవాలనే అభిప్రాయంగలగడం మంచిదే. అన్నాడు నాన్న.

## 21. అధ్యాయము

నేను ఆ రోజు మధ్యాహ్నం మిసస్ కింగ్సుతో ఇంటికి వెళ్లి, మీతో కలిసి యుండవచ్చా? అని అడిగాను. నేను నా భోజనానికి, ఉండ డానికి వలసినంతపని చేస్తాను - - చేయదగిన పనిని దేనినైనా సరే?"

"నీవు రాను రాను తెలివి తక్కువగా తయారవుతు త్నావ్" అంది ఆవిడ.

"బహుశః అంతే నేమో? - - నేను బుద్ధిలేని వాడ నే?"

"కొన్ని సమయాల్లో ఆలాగే అనిపిస్తుంది."

"ప్రతి విషయం పెద్ద గందరగోళంగా వుంది - నే నెక్కడ వున్నానో నాకే తెలియడం లేదు."

"సరే! ఇప్పుడిక్కడున్నావ్ - హాయిగా కూర్చొని విశ్రాంతి తీసుకో."

"నే నిక్కడే వుందామనుకుంటున్నాను."

"ఇదో చూడు రాల్ఫ్! నిజంగా నీవు కష్టాల్లోనే వుంటే నేనే పిలిచేవాన్ని. నీవు ఉండదగ్గచోటు కాదు రాల్ఫ్!—వాళ్లు నీ కా విషయం చెపుతారు—మీ నాన్న, లూసీబ్రౌటెల్. ఆయన గూడవస్తే చెవుతాడు. నీవు మమ్మల్ని తెలివి తక్కువమూకగా తలుస్తున్నట్లుంది."

"నే నిక్కడ తప్పుగా వర్తిస్తానని అనుకుంటున్నావా?"
"నీవు సరిగ్గానడుచుకోలేవు; అంతే."

సేత్ ఆ విషయాన్ని ఆలోచించడానికి గూడ సందియ్యలేదు. కంష్ట స్థితి పర్యంతం వాదించాను. కొయ్యపనిని క్షుణ్ణంగా నేర్చుకోవాలని ఉందని, అంతకంటె సదవకాశం చిక్కదని చెప్పాను. జీతం బత్తెగం లేకుండా సహాయం చేస్తానని, వచ్చే వసంతఋతువు పెద్ద తోట నొకటి ఇద్దరం పెంచుతామని అన్నాను. రచనాసక్తిని చెప్పేటప్పటికి సేత్ తల ఊపాడు.

"రాల్ఫ్! ఇది పెద్ద వీధిలోనుండి చీలినసందు. ప్రస్తుత పరిస్థితుల్లో నీవు రాజబాటనుండి మరలి, ఈచిన్నదారిని పోదామని తలుస్తున్నావు. అది నిన్ను ఎక్కడికి తీసికొని పోకపోవడమేగాక, మళ్లీ వెనుకకు తిసుకరా లేదు. నీవా మహారణ్యాలో తప్పిపోతావు. మంచి భవిష్యత్తుగల గారట్సన్ యువకుని విషయం ఏమయిందోనని ప్రజలంతా వాపోతారు. నేనలాంటి చెడ్డపని నెత్తినపెట్టుకొన దలచుకోలేను."

అవును. నేను గొప్ప ఆశయాన్నుండి మరలిపోతున్నాను. సేత్ ఊహాప్రపంచంలో నా వాళ్ళంతా గొప్ప ఘనకార్యాలు చేశారు; నేనుగూడ అట్లాచెయ్యాలని తలుస్తున్నాడు.

ఒక విద్వాంసుడుగా, గొప్పవాడుగా వుండటంవల్ల కలిగే లాభమేమిటి? నాన్ననుచూడు -- ఇరవైయేళ్లుగా ఒకరోజు పనికూడా ఉపయోగంగా చేసియుండడు."

"మీ నాన్ననుగురించి అల్లాచెప్పడానికి నీవు సిగ్గుపడాలి. అతడేగనుక లేకపోతే అందంగా శుభ్రంగా - దేశపు చివరి నున్న ఈ పట్టణం ప్రసిద్ధిలేని చిన్నపల్లెగా ఉండేదే --అంతే కాదు ఇక్కడ ప్రతియింట్లో అతన్నిగురించి గర్వపడుతుంటారు. "ఇక్కడొక తోట, గేటు ఉంటే బాగుండేది; అనే వారితో, రాండల్ గారట్సన్‌ను అడిగి చూడండియని అంటుంటారు. ఇటువంటి పాతయిళ్లను బాగుచేయడంలో అనుకోనంత శ్రమ, కాలం తీసికొంటాడు. నేనేగనుక ఈ యింటిని బాగుచేయవలసి వస్తే, అతని సలహా లేకుండా ఒక చీలనుగూడ కొట్టను.

కొన్నిరోజుల తర్వాత, నేనేదైన పనిచేసేదా? అని సేత్‌ను అడిగాను. అతడు సరేనన్నాడు. అతడీమధ్య పనులన్నీ ఇంటికి తెచ్చే చేస్తున్నాడు --బెంచీలు, కుర్చీలు, చిన్నచిన్న వస్తువులు. నేను చేయగలిగినంతపని లేకపోయినా నన్నుంచు కోటానికి సమ్మతించాడు. నాకు చదువుమీద ఇష్టముంటే ఎందుకు వ్రాయగూడదు?

నిజంగా నాకు వ్రాద్దామనిలేదు. సేత్ ఆ మాటను విచారంతో చెప్పాడు. ప్రయత్నిస్తున్నాను. టైమ్ లేదు అనేవాడిని. మొత్తంమీద అవస్థగానే వుంది. నేను తెలివితక్కువగా వర్తిస్తున్నానా? అని సందేహంగానే వుండేది.

అనతనితో క్రమంగా పనిచేసేవాణ్ని కాదు — కొంత సేపు కొద్దిగా - కోయడం, బెజ్జాలు వేయడం చేసేవాణ్ని. మిగత వేళల్లో ఊరికె చూస్తూ కూర్చుండేవాణ్ని. అతడు మిష న్లను ఉపయోగించేవాడు. పెద్ద దుంగను చీల్చి, వస్తురూపం లోకి తీసికొనిరావడం ఎంత కష్టమో తెలుసుకొన్నాను. సేత్ ఓర్పును, నా ఓర్పును పోల్చి చూచుకోడంలో సరిపోయేది. చివరికి యీ పనులకన్న ఓర్పును ఎక్కువగ నేర్చుకొన్నాను.

కానీ నాకాలం రాను రాను సందిగ్ధావస్థకు వచ్చింది. చల్లని శరదృతువులో ఆకురాలుట, పండ్లుపండుట, ఎండుగడ్డివాసనలు నా కష్టాలను ఎక్కువచేసినై. రాబోయే శీతకాలానికి ప్రతి ప్రాణీ ఎలాగుండాలో తెలుసుకొన్నా. నా కెన్నో ఊహలు— మస్టీ పొలాలకు పోదామా? లేక గ్రామాల్లో పండ్లను పోగు చేసి "గ్రీన్‌విచ్" గ్రామంలో పండ్లంగడి పెడదామా? అని, నా అనూాయకత్వం నన్ను ఏ సాహసానికి దింపలేదు.

ఇలాంటి పరిస్థితుల్లో మనోవిచారంతో వాల్థామ్‌కు వెళ్ళి ఒక పనిలో కుదిరాను.

## 22. అధ్యాయము

మగ్గంగుడ్డలు చుట్టే చక్రాలు తయారుచేస్తున్న ఒకవర్త కుడు మాటిమాటికి సేత్ కొట్టుకి వచ్చేవాడు. అతనికి సేత్‌ను గురించి గొప్ప అభిప్రాయంవుండేది. అందువల్ల తన యంత్ర శాలలో కొయ్యలను తొలిచేవాణ్ణిగా నన్ను తీసికొన్నాడు.

నేను మొదట ఎంతో విచారంతో ఈ జీవితంలో ప్రవే శించాను. కాని, ఆ పనిలో ఒకవిధమైన ఆనందాన్ని పొందు

తున్నాను. నేను అసహ్యమైన పట్టణాన్ని, ఫ్యాక్టరీల ఇటుక గోడలను, పొగగొట్టాలను, మసిబొగ్గుతో నుండే యంత్రాగారాలను నిరసించేవాణ్ని; అంగళ్లు, ఇండ్లు, మురికిగావుండటాన్ని గమనించాను. కాని, ఉత్సాహంగా పనిచేస్తున్నాను. అపారమైన సంసారంలోపడ్డ కష్టజీవిలాగ రోజుకు 9 గంటలు పనిచేస్తున్నా.

నేను వారానికి 5 డాలర్ల అద్దెకు ఒకగది తీసికొన్నాను. ఈ జీవితంలోని కళ్మలాన్ని, ఒంటరితనాన్ని ఎదిరించి నిలువగలిగాను. నాకు బలవత్తరమైన సంతృప్తి కలిగింది.

ఆ జీవితం పొకర్యమైన చెఱలోవలెనుంది. నా కార్యక్రమం పూర్తిగా మారిపోయింది. అది 8 నుండి 5 వఱకు క్రమంగా మెల్లగా సాగుతుంది. దానికి జ్ఞానంగాని, నిశ్చయంగాని, ఏకాగ్రతగాని అవసరం లేదు. మనస్సు, బుద్ధి ప్రశాంతావున్నై. కాని భవిష్యత్తునుద్దేశించి చాల హీనస్థితిలో నున్నాను. దైవంమీద భారముంచి నిర్విచారంగానున్నాను.

ఆహారం సరిగా లేక చిక్కిపోయి సన్నపడ్డాను. కాని, బలంగానే వున్నాను. నేను మెత్తగా స్థూలకాయంతో 6 అడుగుల 1 అంగుళం ఎత్తున వుండేవాణ్ని. ఇప్పుడు తగిన ఆకారంతో 180 పౌన్లున్నాను. నేను అంగడివాళ్లు కోరినట్లుగా చక్కగా పనిచేసేవాడిని. మా పై అధికారి 'మిస్టర్ క్విన్' నన్నింకో పనికి మారుస్తూ డిశెంబరులో నా జీతం 3 డాలర్లు అధికం చేశాడు. అతనికి నాయందు మంచివిశ్వాసం గలిగింది.

"ఆపనివాండ్లంతా నీవంటే ప్రియపడతారు. ఎందుకో? నీవు చిన్నగా నవ్వుతావు. నీవు మాతోనే వుండు రాల్ఫ! నీకేం కష్టముండదు."

పొడుగ్గా, పల్చగా కటువుగా వుంటాడు. అరచేతి మందం కండ్లజోడులోనుండి భయంకరంగా చూస్తాడు. అతనికి ఆఫీసులో ఒక డ్రాఫ్‌టింగు టేబిల్ ఉండేది. దాని మూదు కూర్చొని కొయ్యలపై రకరకాల ఆకారాలను గీస్తూ ఆనందించేవాడు. దాని నైపుణ్యమే అతన్ని సంతోషపరుస్తుండేది.

నేను యంత్రంలోని చక్రంలాగా పనిచేశాను. ఆ పనికి అర్థమే లేదు. క్విన్‌ను మంచిచేసుకుంటే వృద్ధికి రావచ్చు. నాకా అభిప్రాయం లేదు.

ఇక్కడికెందుకు వచ్చాను? కర్మఫలాన్ని అనుభవించడానికేమో? ఇక్కడి స్వాతంత్ర్యాన్ని చూచి సంతోషించాను. ఇంకేవో నన్ని పనికి పురికొల్పివుంటవి. ప్రపంచంలో ఒంటరిగా జీవించాలనుకొన్నాను -- అనందంగా కామ్‌టన్‌లో గారట్సన్ సృష్టించిన లోకంలోగాదు. ఏ ప్రపంచం నన్ను దూరంగా బెట్టి భయపెట్టిందో, ఆ ప్రపంచంలోకే, నాకు ఈ ఫ్యాక్టరీల నిండిన నగరాల మాలిన్యము, మగవాండ్లు, ఆడవాండ్లు ఎలా బ్రదుకుతున్నారో, ఆ విషయం కావాలి.

నేనొక సాయంత్రం మిస్టర్ క్విన్‌ను కలుసుకోడానికి భోజనంచేసి బయలుదేరాను. ఆ వీధిగుండా వెళ్లుతూ నెంబర్లు చూస్తూ అతనియింటికి వెళ్లాను. అతడప్పుడొక కుక్కతో నిల్చియున్నాడు.

'హలో' అన్నాడు నా ప్రక్కకు మళ్లకుండానే. రెయిన్ కోటుతో, పొట్టిగాను, విచారంగాను కనుపించాడు కుక్క ను తదేకంగా చూస్తూ. కుక్క గొలుసు బట్టుకొని, "లోపలికి రా చూద్దువుగాని."

అతడు కుక్కతో లోపలికి నడిచాడు. ఆ యిల్లు పగుళ్లు పాడిన స్తంభాలు, నెర్రెబారిన గోడలు, సొగుసుమాసిన కిటికీలు, మధ్యహాలు - సమాధిమాదిరి భయంకరంగావుంది - -అక్కడి వాతావరణం, కొయ్యసామాన్లు, వస్తువులు, ఆర్ట్ - అంతా నిర్జీవంగా వుంది.

అతడు హాలులో ఇంకొకమూల ఒక దీపాన్ని వెలిగించాడు. "నాగదిలోకి రా. ఈ పెద్దయిల్లు నిర్జీవంగా వుందిగదూ? ఇది నా చదువుగది."

50 సంవత్సరాల నిస్సహాయమైన కలవరం ఈ గదిలో ఇమిడియుంది. 30 అడుగుల పొడవుగల ఆ గదిలో రెండు చలువరాతి కుంపట్లు, గ్యాస్ లైట్లు, దొంతర్లుగా పేర్చిన ఇంకా ఎన్నో పాత సామగ్రులు మూలబడియున్నవి. అనంతా చూస్తే, అప్పుడే బొక్లనుండి దింపినట్లున్నవి.

"కూర్చో! సిగరెట్లు కాలుద్దాం. ఇంత పెద్ద గదిలో రెండు కుర్చీలే అందుబాట్లో వున్నవి. తిరిగే కుర్చీ యొకటి, నేలకు తాకుతూ దీపం దగ్గఱగానున్న పచ్చని (మారిస్) కుర్చీ ఇంకొకటిగూడా వుంది - - నలిగిన ఊదారంగు దుప్పట్లతో సుక్కమంచం — ఈ గుహావాకిట కడ్డంగా వేసివుంది.

నేను మారిస్ కుర్చీలో దిగబడ్డాను. అతడు గొగ్గిపండ్ల తోనవ్వి అన్నాడు. "నా వీపు ఆ కుర్చీలో సరిపోతుంది—అవ స్థంతా - కూర్చుంటే లేవలేను - - మంచంమీద పడుకో డానికంటె రాత్రిళ్లు దాంట్లో పడుకోవచ్చు." అతని ముఖంలో విషాదం కనుపించింది. "నేను నిద్రపోను తెలుసా? ఎన్నోయేండ్ల యింది." ఎక్కడో "హాల్లో" టెలిఫోన్ మ్రోగింది. అడుగుల చప్పుడయింది. నా మనస్సు అక్కడికి పోయింది.

"నాన్నా! నీకోసరం!"

"ఆ! ఇక్కడే వున్నా!" అతడు ద్వారం దగ్గరనున్న అమ్మాయికేసి వెళ్లాడు. మళ్లీ తిరిగివచ్చి, "ఓ మేరిలిన్! ఈయన మిస్టర్ ఉహూ - ఉహూ - గారట్సన్" అన్నాడు.

ఆవిడ నిరుత్సాహంగా నన్ను చూచి, "ఓ హో!అలాగా?" అంటూ నాన్నను హాల్లోకి పిలుచుకొనిపోయింది.

అతడు కేకలు వెయ్యడం, టెలిపోను రిసీవర్ని టప్పని క్రిందపడవేయడం, సణగటం విన్నాను.

ఇంకా పెద్ద గొణుగుడు, ఒక స్త్రీకంఠం "నేనుచెయ్యను. వట్టి బుద్ధిమాలినవాడివి." మళ్లీ సణుగుడు. అడుగుల చప్పుడు. అతడు గదిలోకి వచ్చాడు.

"చూచావా ఆ పిల్లను? - -దానికి అధ్వాన్నపు స్నేహి తులు; దాన్ని హైస్కూలుకు పై తరగతులకు పంపి, తెలివి తక్కువపని చేశాను - - అది ఇప్పుడు మాతోకలిసి ఉండలే వంత గొప్పదైపోయింది."

ఆవిడ తల్లి యుద్దేశ్యము- మంచిదేమో? కాని అది పని చేయదు. కనీసం నీకు "హల్లో" అనికూడ చెప్ప లేదు... ఏదో నాన్న అంగట్లో పనివాళ్లని దాని యుద్దేశ్యం. మంచి మగవాడు అంటే పని లేకుండా ఊరిలో కారుపై తిరిగేవాడని దానితలంపు.

ఎలుగుగొడ్డు ఈగలు దులిపినట్లుగా అతడు ఇదిలించి వేశాడు.

"నేను ఇటువంటివి చెప్పగూడదు. కాని ఏదైనా తోచితే వెంటనే చెబుతుంటాను. సరే! అంగడి విషయాన్ని గురించి – అంగడినుండి రాగానే, ఎవరైనా దీన్ని చక్కగా నడిపేవాడు దొరుకుతాడా? అని చూస్తుంటాను. ఈ పని నీవు చేయగలవని నమ్ముతున్నాను..."

"నాకు వ్యాపారాన్ని గురించి ఏమీ తెలియదు."

"నీకు నేర్పుతాను అన్నిటిని. చివరికి నాకంటె గొప్ప వాడివవుతావు అన్నాడు.

ఇష్టం లేకపోయినా అంతా విన్నాను. ఆ నిర్జీవమైనయిల్లు, రెండుతరాల సామాన్లతో నిండి, భయంకరమైన ఆ గది, కిర్రు కిర్రుమని చప్పుడుచేసే కుర్చీలోనున్న విచారయుక్తుడైన ఎలుగొడ్డువంటి మనిషి – నేను ఆశించిన జీవితానికి సంబంధించినవి ఏవీ ఇక్కడ లేవు. నీరసంగా లోలోన నవ్వుకున్నాను. వ్యాపారం! నా ఆశయాలకు సంబంధమేమున్నది ?

"నీవు మెల్లగా ఆలోచించుకోవచ్చు. ఇప్పుడే తేల్చి చెప్ప నవుసరం లేదు."

నేను వచ్చేముందు, అతడు నావైపుకు వంగి, “అప్పుడప్పుడు నిన్ను పిలువగలిగియుంటే బాగుండేది. మిసస్ క్విన్ క్రొత్తవాళ్ళనెప్పుడూ చూడదు. తన ఒక్కకొడుకు యుద్ధంలో సరిగ్గా ఆ చివరి రోజుల్లో “ఇన్‌ఫ్లైన్‌జా ఎపిడమిక్”తో చనిపోయినాడు. మిసస్ క్విన్ ఆ దెబ్బనుండి ఇప్పటికీ కోలుకొనలేదు. ఎప్పుడు తనగదిలోనే వుంటుంది. ఆ విషయం నీవే అర్థం చేసుకో” అన్నాడు.

చిట్టచివరికి ఆ చీకటి హాలులోనుండి వీధివాకిట దాకా వచ్చి నన్ను సాగనంపాడు. “నీవు నన్నే చూడడానికిక్కడికి వచ్చినందులకు సంతోషం..”

ఆ రాత్రి పెద్దపెద్ద ఆలోచనలు గలిగాయి. కానీ సంతోషకరంగా లేను. బుద్ధి — వివేకము — రెండు విరుద్ధంగా నిలిచినవి. మిస్టర్ క్విన్ సాధారణమైన మనిషిగాడు; అతడు సంతృప్తిగా సాగుతున్న యంత్రాగారాన్ని సొంతంగా నడుపుతూ, దానినిస్తానని నన్నే రమ్మంటున్నాడు.

వివేక మిట్లంది—చాల మంచి వ్యాపారం. శుభ్రమైన కొయ్యలు, పదునైన పనిముట్లు, చక్కని వస్తుసృష్టి; మంచి వయసులో నున్న రాల్ఫ గార్టన్ దాన్ని అభివృద్ధిచేసి, చక్కని టేబిల్లు, కుర్చీలు, మంచాలు. తయారు చేసి అమెరికన్ల అభిరుచిని పెంపొందించును; చివరికి మంచి ఆర్థిక స్థితిని, సంఘ గౌరవాన్ని పొందగలడు.

అదంతా తెలివి తక్కువ పని. ఎవరో ఆశాపరులు, మూర్ఖులు, ధనాన్ని గుణించి, సంఘంలోని స్థానాన్ని గురించి మాట్లాడుతుంటారు.

రెండు వారాల తర్వాత ఒక ఉదయం మిస్టర్ క్వీన్ ఒక ఉదయం ఒంటరిగా చూచి, నన్ను ఆ సాయంత్రం భోజనానికి రమ్మన్నాడు. నేను రావడం అతనికి, మేరి లిన్‌కు సంతోషవ గలుగుతుంది అన్నాడు.

నేను 'సరి' అన్నాను.

## 23. అధ్యాయము

నేను క్వీన్ ఇంటికి భోజనానికి వెళ్లినప్పుడు మేరిలిన్ తలుపు తెరిచి, నా కోటునందుకొన్నది. (నే నెప్పుడు హాట్ వేసికోను.) హాలు కుడి ప్రక్క గదిలో కూర్చొన రమ్మని పిలిచింది. పలుచగా, సంక్షేపంగా ప్రియంగా నున్న ఆవిడ ఎందుకో కొంచె బాధపడుతున్నటు తోచింది. నేను మొదట ఆవిడ మూర్ఖంగాను, స్వార్థంగాను వుంటుందనుకొన్నాను. కాని. ఇప్పు డావిడ నన్ను చూచి నవ్వి, తాను పశ్చాత్తాప పడుతున్నట్లుగా కనుపించింది. నన్ను అక్కడ కూర్చొపెట్టి విచిత్రమైన దృష్టితో చూచింది.

"నాన్న ఇప్పుడే వచ్చేస్తారు — — అమ్మ అంత ఆరోగ్యంగా లేదని చెప్పమన్నాడు. క్షమించాలి."

"నా కప్పుడే చెప్పాడు." అని అన్నాను.

ఆవిడ మళ్లీ నన్ను చూచింది. "మేమిక్కడ వంట గదిలోనే భోజనం చేస్తూంటాము."

ఆవిడ ఆతుద్దాలో నిల్చొంది. పేలవంగా. పెద్ద జుట్టుతో పీలగా వుంది. తండ్రి పోలిక ఆవిడలో లేదు. అసాధారణంగా, ఏదో ఆడంగా వుంది—ఏదో ఆఫాషన్ పుస్తకాల్లో చెప్పే విధంగా.

"నేను 8 అడుగుల గదిలో చదవటం, తినటం—సర్వం జరిపేవాడిని. ఇక్కడ ఈ వంట గదిలో తినటం గొప్ప కేను."

"నీవు 'హార్వర్డ్'కు వెళ్లావుగదూ?"

ఆ ప్రశ్న నాకు తుపాకి దెబ్బయింది. "ఏవో రెండేళ్లు." అన్నాను.

అక్కడున్న బాలుర విషయం నాకు తెలుసు. బిల్ మార్విన్! బ్రెస్ట్రిగ్స్, డాన్ ఆఫ్ స్ట్రెటర్, అతని తండ్రి 'సామో సెట్ టెక్స్టైల్' మిల్స్ అధికారి—ఎడ్ స్టైల్స్, స్టైల్స్‌హాట్స్, ఎడ్‌ను తెలుసునా?

"లేదు. నాకు వాళ్లను తెలియ దనుకుంటా."

మెట్లమీద చప్పుడయింది. మిస్టర్ క్వీన్ లోపలి కొచ్చాడు. అతడు ముందుగానే క్రిందికి వద్దామని అనుకొని—అలా ప్లాన్ వేసియుంటాడు. (ఆలోచించి) కాని, అతని కాలర్ బొత్తాము ఎక్కడో పడి పోయింది. 10 నిమిషాలు వెదుకగా చివరికి సిల్ల తొట్టి క్రింద కనుపించింది.

మేరీ లియన్ తటాలున తిరిగి వంట యింట్లోకి వెళ్లి పోయింది. ఆవిడ కళ్ల నీళ్లు రావడమే తక్కువ.

"భోజనం తయారయిందా చూడు" అని నా వైపు తిరిగి. "నేను గ్రామును గురించి మాట్లాడగూడదని దాని తలంపు" అన్నాడు నే నతనికి సపోర్ట్ చేస్తా నేమోనని.

మేరిలిన్ మమ్మల్ని పిలవగానే, మేము హాలుదాటి విశాలమైన వంట గదిలోకి పోయినాము. మధ్య సరిగ్గా ముగ్గురికి తెల్లగా గుడ్డ బరచిన టేబుల్లు వున్నవి.

నన్ను వంట మనిషి మిసస్ ఎన్స్ట్రామ్‌కు పరిచయం చేశాడు. ఆవిడ సేనానిలాగా మావైపు చూచింది. ఆ వంట గది మిగత గదుల్లాగా లేదని గమనించాను—పాత సామాన్లుండి కూడ సజీవంగా ప్రకాశిస్తూ వుంది. క్రింద కొయ్య పలకలు పరచిన నేల పడవలోని భాగంలాగ వుంది. అలమరలు, బల్లలు, శుభ్రంగా ప్రకాశంగా వున్నవి.

మేము మిసస్ ఎన్ యొక్క అధికారపు దృష్టిక్రింద కూర్చున్నాము. మిస్టర్ క్వీన్ ఉత్సాహంగా పెద్దగా మాట్లాడుతున్నాడు "మీ కంతా ఆకలిగా వుందిగదూ రాల్ఫ్! అంటూ— అన్ని పదార్థాలు ఎక్కువగా వేసికోమని బలవంత పెట్టాడు. మిసస్ ఎన్‌తో పెద్దగా చెపుతున్నా ఆవిడ ఏమీ మాట్లాడ లేదు. భోజన సమయంలో మేరిలిన్ కూడ ఏ మంతగా మాట్లాడ లేదు.

భోజనానంతరం కొద్ది సంభాషణ తరువాత శెలవు తీసికోడానికి యత్నించాను. కాని వాళ్లు నన్ను వదల లేదు.

నే నొక ఖైదీలాగ వుండిపోయినాను. మేరిలిన్ దగ్గరగా కూర్చొని నన్ను తదేకంగా ప్రియంగా గమనిస్తున్నది. నే నేదైనా మాట్లాడితే ఆవిడ జాగ్రత్తగా నవ్వి, నేను ఎక్కువగా మాట్లాడే టట్లు బదులు చెప్పేది.

నాన్నా! మనం ఇక్కడొక పెద్ద పార్టీ—అంటే స్నేహితులకు, వాళ్లకు విందు చేయవచ్చు. అప్పుడు డాన్సు, ఎన్నో వింతలు చేయవచ్చు. ఒక సారిగూడ నేను విందు చేయలేదు."

అతడు విచారంతో "ఊహూ—వీలులేదు" అని నావైపు తిరిగి యథాలాపంగా 'మిసస్ క్విన్‌కు బాగాలేదు. ఆవిడ కలుసుకోనందుకు విచారిస్తున్నాను' అన్నాడు.

మేరిలిన్ గ్రుడ్లనీరు గ్రుక్కుకుంది ప్రక్కకు తల త్రిప్పుకొని. చివరికి సెలవు తీసికోగా. వారిద్దఱు వాకిలిదాకా సాగనంపి చీకట్లో పోతున్న నన్ను చూస్తున్నారు.

తర్వాత నేను క్విన్ ఇంటికి ఎక్కువ పరిచయుడనైనాను. కాని రహస్యంగా.

"ఈ విషయం నేను చెప్పగూడదేమో? మిసస్ క్విన్ మనం సంతోషంగా వుంటే ఇష్టపడదు. మాకు పరిచయులు తక్కువేయని గమనించి ఉంటావు—నిజంగా నీవు తప్ప మాకెవ్వరూ లేరు. ఇప్పుడావిడకు ఏమీ బాగుగలేదు. ఆ విషయం మాకు కష్టంగానే వుంది; ముఖ్యంగా మేరిలిన్‌కు."

అందు వల్ల నేను భోజనానికి నిశ్శబ్దంగా వస్తూ, మిసస్ ఎక్స్ గ్రాహమ్‌తో ఎక్కువ పరిచయం చేసుకున్నాను. మేమిద్దరం వంట యింట్లో కూర్చొని మాట్లాడుకొనే వాళ్లం.

నేను అక్కడున్న వాళ్ల బాధ్యత పైనబడ్డట్టుగా తలచాను. మిస్టర్ క్విన్ ఎన్నో కార్యాలను నూతనంగా తల పెట్టాడు. కాని తగిన ప్రోత్సాహం లేక ఊరకొన్నాడు. అతడు నాకు ఎన్నో గడియారాలు, చేతి గడియారాలు చూపించి, వాటిని బాగు చేయడానికుపయోగించే కొరముట్లను చూపాడు. గడచిన 30 ఏండ్లు 'నేషనల్ జగ్రాఫిక్' ఎంతో సాయ పడిందతనికి.

మేరిలిన్ మూడు వంతులు తన కాలం మేడమీద గడిపేది. ఆవిడక్కడ ఏం చేసేదో, ఎవరికీ తెలియదు.

నే నావిడను వారానికి 1, 2 సార్లు సినిమాకి తీసుక వెళ్లేవాణ్ని. బాస్టన్‌లోని నాటక శాలకు తీసుక వెళ్లాను. నేను నా జీవితంలో మిగిలిన డబ్బును ఆవిడకై ఖర్చు పెట్టేవాడిని. శీతం హెచ్చినపుడు గూడా. ఒక ఫోర్డు కారును కొన్నాను. దాన్ని పెట్టుకోడానికి క్విన్స్ దొడ్డి వైపున ఒక చిన్న పాకా ఇచ్చాడు. కొద్ది కాలంలో మేరిలిన్ కా సొంతమయింది.

ఆవిడ నిస్తేజమైన మైన ముఖం ఇప్పుడు కొద్ది కొద్ది తేజస్సుగా అందంగా ప్రకాశించింది. చెప్పవలసివస్తే ఆ ముఖంలోని తేజస్సు నాచుంబనంవల్ల వచ్చిందని చెప్పాలి. ఏమీ సందేహం లేదు.

అది నాలోగూడ కొంత మార్పు తేచ్చింది. మొదట మూర్ఖంగా, అంద వికారంగావున్న ఆవిడ - ఇప్పుడు అందం గానే, తరుణిగానే, కోరదగిన యువతిగా-ఒక దేవతగా భావించాలే. ఆవిడ మృదువుగా ప్రియంగా వుండజొచ్చింది. ఆవిడ ఒక విధంగా పరిచయమైన నవ్వునవ్వేది. బహుశా ఈ సమయానికోసరమే మో? నా సంరక్షణ క్రింద, ఆవిడ శరీరం, ఆత్మ చరిస్తున్నవి. ఆవిడ అమాయకంతో బాధలన్నీ తీరినట్లు నిర్భయంగా నాతో వుండేది.

నేను సర్వజ్ఞుణ్ణి కాకపోయినా, తెలియదగినంత తెలుసు కొన్నాను. ఎప్పుడు బాగాను రాజకుమార్తె కావాలని అను కొనే వాడిని ; చివరికి ప్రియమైన యువతిని చూచాను-- నిజంగా నే నావిడను రక్షిస్తున్నాను, 'పిగ్మలియన్' గెలటీని సృష్టించిన విధంగా. నే నావిడ చిన్న మెదడులో గ్రంథాలను గురించి, కళలను గురించి ఎటువంటి ఉద్దేశ్యాలను కలిగించాలో? ఆలోచించుకొనే వాడిని.

నే నావిడను ముద్దు పెట్టుకొంటున్నప్పుడు, ఏమి చేస్తున్నానో నాకు తెలియదు. అది అట్లా జరిగిపోయింది. ఆ పాత సోఫాలో-నా చేతుల్లో - అందాల రాసి నుంచుకొని కూర్చున్నాను -- నాకు తెలియకుండానే ఏదో బలమైన శక్తి నన్ను త్రోసివేస్తున్నది.

"ఓ రాల్ఫ్!...నీవు...నిజంగా?...నీ విలా..."

"అవును, నిజంగా - నిప్పు, తుఫానులాగ—"

ఆవిడ స్వరంలో పెళ్లి అనే విషయం తోచింది. కాని, ఎందుకు కాకూడదు ? పెళ్లి అనేది సర్వ సాధారణమైన విషయం. భోజనం, వసతి గృహం, ఉద్యోగం మొదలైన అవసరాలవలె, మనుష్యుడు దీన్ని కూడా ఒక అవసరంగా ఒప్పుకోవాలి. విపరీతమైన ఉద్రేకం ముందు నాకిట్టి విషయాలు లెక్కకు రాలేదు.

మే మిద్దరం చాల అమాయకంగా ఉండేవాళ్లం. కొన్ని సమయాల్లో ఒకరి నొకరం భయంతో నిస్పృహతో కౌగిలించుకొనే వాళ్లం; వణకుతూ, అర్థం లేకుండా పెద్దగా నవ్వుతూ సాగి వర్షంలో నిట్టూర్చేవాళ్లం. విశేషంగా వుంటూ ఏం... ఇష్టం ఒప్పుకొనే వాళ్లంగాదు.

నే నావిడతో కవిత్వ ధోరణిలో మాట్లాడుదాం అనుకొనేవాణ్ణి. కాని అనుకొన్న విధంగా నోటినుండి వచ్చేవి కావు. ప్రేమను విచిత్ర పదాల్లో వ్యక్తపరచాలని, కాని, కౌగిలింతలు, ముద్దులు తప్ప మాటలతో వ్రాశవు, పైగా ఆవిడే నన్ను పలుకరించేది.

ఆవిడ తన ఏకాంతతను గూర్చి చెప్పింది; స్నేహితులు లేరు; ఏమీ చేయడానికి లేదు, అని. తన తల్లి మనుష్యులనంతా దూరంచేసి, తన్ను మాత్రం ఇంట్లోనే వుంచేసిందట. ఆవిడ ఏదన్నా వ్యాపార సంబంధంగా చదువుకొని ఉద్యోగం చేస్తా మని అనుకొందట – కాని సాగక ఇంట్లోనే ఉన్నదట. నాన్నది విపరీత స్వభావం. ఆవిడని అర్థమే చేసికోలేదు. ఏదో తన గొడవతోనే గడుపు కున్నాడు.

అంత దాకా అమ్మకు నన్ను గూర్చి తెలియదట, రేపు ఆవిడకు తెలిస్తే ఏం జరుగుతుందో? దైవానికే తెలియాలి. కాని ఎప్పుడో ఒకప్పుడు ఆమెకు తెలియవలసిందేగదా?

అవునని ఒప్పుకొన్నాను. ఆ విషయాన్ని తండ్రి చెపుతాడేమో?

నాన్న ఎప్పుడూ అమ్మకు కోపం తెప్పించేవాడు, తన అన్ని విషయాలు ప్రశాంతంగా జరుపవలసివస్తే; అతడు స్కూలు పిల్లవాడులాగా ఆవిడ చుట్టూ తిరగడం నటించేవాడు—ఆవిడ నెమ్మది స్వరంలో అణకువతో బదులు చెప్పుతుంటే ఆవిడ స్వరూపాన్ని చూచి నవ్వాను. ఆవిడ కొంటె చూపు చూచి సిగ్గుతో చిఱునవ్వు నవ్వింది.

మనం ఈ విషయం నాన్నకు చెపుదామనుకొన్నాం గదూ?.

## 24. అధ్యాయము

నేను నిజమైన ప్రేమ అని, పవిత్రమైన దేశాన్ని లక్ష్య పెట్టుకొన్నాను, నేను సాహస స్వాతంత్ర్యాలపై లక్ష్య ముంచాను. నే నిప్పుడు పూర్తి మనిషినై నానని నా బలాన్ని సామర్థ్యాన్ని గుర్తిస్తున్నాను. లక్ష్యం నెరవేరలేదు.

ప్రకాశం లేని అంధకారంవలె, సంతోషమైన స్వాతంత్ర్యం లేకుండా, అపోలో లాంటి ఇతరకాంతి దేవతల ఆశీర్వాదములు లేకుండా—రహస్యంగా నడుచుకొనవలసి వస్తున్నది. విచారంతో నాకెక్కడో, ఏదో తప్పు జరిగిందని తెలుసుకున్నాను.

సదుద్దేశ్యాలతో సత మత మవుచున్నాను. నా సామ ర్థ్యాన్ని గురించి మిస్టర్ క్వీన్ ఎన్నో గొప్ప ఆశలుంచుకొన్నాడు. (ఇప్పటికూడా సేత్ అతని పాత అంగడి, దానిపై గౌరవం చేతనే అనుకుంటూ) ఏదో గొప్ప దయార్ద్ర హృదయంతో తన వ్యాపారాన్ని తీసికొమ్మని, తన కూతుర్ని రక్షించమని కోరుతున్నాడు. నే నీక్రొత్త బాధ్యతలను మొదట ఆ పెద్ద మనిషియందుండే గౌరవంచేత నప్పుకొన్నాను. తరువాత క్రమేణ కృశిస్తున్న యువతి యొందలి దయచేత (అనుగ్రహంచేతనైనా అనుకోండి) ఒప్పుకొన్నాను. తరువాత ప్రేమ కలిగింది. ఆటుతరువాత ప్రకృతి దాన్నుండి నన్ను మరలి పోనీయలేదు.

ఫలితం పెండ్లి ఏర్పాటు.

చాల రోజులవరకు ఈ గొప్ప ఫలాన్ని నేను రహస్యంగానే ఉంచుకొన్నాను. కాని నన్నాశ్చర్య పరుచిందల్లా ఒక ఉంగరం ఆవశ్యకము కావడమే.

"రాల్ఫ్! నివు ఉంగరం కొనే ముందు నాన్న నిన్ను కనుపించమన్నాడు. నీవు దాన్ని ఎక్కడ కొనాలనో చెబు తాడు; అంటే టోకువ్యాపారి అంగడి.

"అలాగా?. అది మంచి యోచనే?"

నేను జీవితంలోని సత్యాలను అర్థం చేసుకొన్నాను. ఈ పెండ్లి ఉంగరం నా నెల జీతం విలువ చేస్తుంది. కాని దానికి అసలు విలువ ఏమీ లేదు. అని నా అభిప్రాయం.

"నీవు—నీకు నిజంగా ఉంగరం వుంచుకోవాలని లేదా?"

"ఏం రాల్ఫ్! ప్రేయసిని అడుగ దగిన ప్రశ్న యేనా ఇది?"

నిరుత్సాహంతో తక్కిన విషయాలు యోచించ దొడ గాను. పెండ్లి అంటే? నా అవసరాల కంటె ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టాల్సిన విషయం. డబ్బంటే నాకు చికాకు; అది లేకుండా జీవించవచ్చు ననుకొనేవాడిని. కాని వజ్రాల ఉంగరం నన్నెదుర్కొన్నది. అదేకాక అద్దె, తిండి, బట్టలు ఇట్టి వాటిని ఎదుర్కోవలసి వస్తున్నది. మొత్తానికి ఇప్పుడు మేరిలిన్ అందంగా ప్రియంగా, చక్కని వొంపులతో స్త్రీ సహజంగా వున్నదనే విషయం మరవడం సులభమని తోచింది. మే బుద్ధ అం చీకట్లో ఒకరొకరం అనుకొని నడచినప్పుడు జీవితం అనే సమస్య తేలికగా వుంటుం దనుకొన్నాను. నేను ఏ విషయం గాని అధికంగా మాట్లాడేవాడిని గాను. మాలో రక్తం సంతో షంగా పాడింది. కాలం కల లాగా జరిగిపోతున్నది.

మా ఈ ప్రేమలు, ఆలోచనలు—మిస్టర్ క్వెన్ తీక్ష్ణ దృష్టితోను, దయార్ద్ర హృదయంతోను గమనించాడు. సంతోషించాడు.

"రాల్ఫ్! నేను నీతో చెప్పకూడదు. అయినా చెప్తు న్నాను. నే నీ వ్యాపారాన్నంతా నీ పేర విల్లు వ్రాద్దామను కొంటున్నాను.

నేను ఇసుక బస్తా నెత్తిన బడ్డట్లు తలచాను. "వద్దండి" అని బిగ్గరగా అన్నాను.

అతడు నివ్వెలా పాటుగా చూచి 'అది నా వుద్దేశ్యం-" అంటున్నాడు.

"వీలులేదు. అలా చేయకండి. నా కీవ్యాపారం వద్దు. ఆ స్థిపాస్తులను గురించి ఏమీ తెలియదు...ఆస్తులంటే ఇష్టం లేదు—" అన్నాను భయంతో వణుకుతూ.

"నీతో చెప్పకూడదని నాకు తెలుసు. వచ్చిన చిక్కల్లా ఇంకా చిన్నతనం. 22 ఏండ్లేగా? నాకు గూడ ఆ వయస్సులో అంతగా తెలిసేది గాదు." అన్నాడు బాధతో.

వార్థాంలో ఒక సంవత్సరం వున్న తరువాత భయంకరమైన విషయాలను తెలుసుకొన్నాను.

ఈ విషయం అమ్మతో చెప్పడం ముఖ్య ధర్మమని యింటికి వెళ్లాను. అడుగు పెట్టగానే ఏమీ మాట్లాడ లేక పోయినాను-వార్థాంలో వసిస్తున్న రాల్ఫ్ కు-ఆదివారం కుటుంబంతో ఇక్కడ భోజనానికి కూర్చున్న రాల్ఫ్ కు-వ్యత్యాసం వుంది. మంచి అభిరుచులతోను, నిర్మలమైన నడవడికతోను, మంచి నిర్ణయ జ్ఞానంతోను ఉన్న ప్రశాంతమైన ఈ గ్రామ జీవితానికి—కలుషంగా యాంత్రికంగా అన్యస్థలంలో గడపిన జీవితానికి సంబంధం లేదు. అమ్మగూడ ఈ నా జీవితాన్ని ఒప్పుకోదు. ఆవిడ నా తప్పిదాన్ని బయలుపరచి, పూర్వాచారాన్ని త్రోసివేస్తూ, అసమ్మతంగా నేనక్కడ జీవితాన్ని గడుపుతున్నాననే విషయాన్ని స్ఫురించేటట్లు తీక్ష్ణంగా చెపుతున్నది.

ఎవరికైనా తెలియ పఱచాలి గనుక, నేను కింగ్స్లేలకు అక్కడి విషయాల్ని చెప్పి, నా రక్షణకు తగిన అభి

ప్రాయ మిస్టారేమోనని ఆశించాను. మిసస్ కింగ్స్లే బుద్ధి మాలినవాన్నిగా నన్ను దూషించడం గమనించాను. వెంటనే ఒప్పుకొన్నాను.

"అది చాల మంచి వ్యాపారం. చురుకుగా నున్న యువకుడు నాలాగా ఆశపడి పట్టుకొని ఇంట్లో కూర్చోకుండా చేయవలసిన పని అది." అన్నాడు సేత్.

"రాల్ఫ్! నీవు తెలివిగా చేసిన మొదట పని ఇదే" ఆ యజమాని కూతురిని పెండ్లి చేసుకుంటే జీవితంలో కుదురు పడుతావు. ఆ అమ్మాయి కూడ నీవు చేసికోదగినదే అని అభిప్రాయ పడుతున్నాను. అంతే." అంది కింగ్స్లే.

## 25. అధ్యాయము

ఆ రోజుల్లోనే నొక్కసారి కూడ మిసస్ క్విన్ గొంతును వినలేదు. ఆవిడ ఒకమూల పడక గదిలో తలుపు మూసుకొని మసక చీకట్లో వున్నట్లు చెప్పేవారు. ఎలాగైతేనేం, ఆవిడ ఉన్నా, లేకపోయినా యింట్లో ఆవిడ అధికారమే. ఆమెకు తెలియకుండా ఏ పని జరుగదు. ఈ పెండ్లి విషయం మిస్టర్ క్విన్ భార్యతో చెపుతా నన్నాడు. అతనిదే ఆ బాధ్యత. ఏ పనినైనా తాను నిర్ణయించుకొని, ఆ విధంగా సాధించేవాడు. కాని ఈ విషయంలో ధైర్యంగా నిలవడం లేదన్నాడు. పరిస్థితులంతా ఆశ్చర్యంగా వున్నవి.

ఎల్లాగో మిసస్ క్విన్‌కు తెలిపారట. నవంబరులో ముహూర్తం నిశ్చయమైంది. వాళ్లు వెళ్లి వస్తుండే మెథాడిస్టు

చర్చిలో ఏ ఆడంబరాలు లేకుండా వివాహం జరగడానికి మేరిలిన్ గూడ ఒప్పుకొంది.

మిస్ క్వీన్ ఈ పెండ్లి జరిగితే చచ్చిపోతా నన్నదట. మేరిలిన్‌ను ఒకవారం రోజులు ఏడ్చేటంతగా చేసింది. మిస్టర్ క్వీన్‌ను గూడ విచారంలో ముంచేసింది. నన్నొక మూర్ఖుణ్ణిగా నిరసించింది. మేరిలిన్ అమాయకపు పిల్ల కాదు అన్నదట. క్వీన్ ఈ విషయంలో కఠినంగా వర్తించినట్లు చెప్పాడు.

క్రమంగా ఈ గొడవల్లో నాకు ఎక్కువ జోక్యం ఏర్పడ్డది. మేరిలిన్ దుఃఖించడం—ఆమెను ఓదార్చి సంతోషం కలిగించి మళ్లీ నవ్వించడం ఇది నాకు ఆనందంగా వుంది. మిస్టర్ క్వీన్ నన్ను ఎక్కువగా నమ్మాడు. ఆ గృహ సమస్యలన్నీ నాపై నిలిచి నిరుత్సాహ కార్యాల్లో జోక్యం కలిగించినాయి. ఆస్తులు, వాని పైపెత్తనం, కౌలు చేయించడం, పన్నులు, కొలువులు సరిచేయడం—ఇల్లాంటివి.

ఈ విషయాలు సముద్రపు పోటుపాటులవలె జరిగినవి. ఒక సంవత్సరంపాటు ఎక్కడ నుండో వచ్చి ఊహించరాని జీవితంలో పడ్డాను.

నా సాహసాలు చెప్పక ముందు రెండు విషయాలు చెప్పవలసి యున్నవి.

మేరిలిన్ విందు చేద్దామనుకొంది—ఏ విధమైన దైనా సరే ప్రసిద్ధిగా జరగాలని. ఒక పురుషుని చేపట్టి, వశంగా చేసికొంది. కాబట్టి ఆవిడ విజయాన్ని పొందింది. ఆత్మ విశ్వాసం గలిగి

అందంగా తయారయింది. యువకులు ఆవిడను గురించి పండుగ పద్యాలకు ఆహ్వానించేవారు. ఆ పిలుపులో నాపేరు కూడా కలిపారు. మేరిలిన్ చక్కందని తెలిసికొన్నారు.

విధి కృతం మొదటిసారి శరదృతువులో డ్యాన్సులో జరిగింది. డ్యాన్స్ మధ్య మేరిలిన్ ఎక్కడికో పోయింది. నేను సాధారణంగా వెదికాను—హాలు, బయళ్లు, తోటలు, దొడ్లు—కాని మేరిలిన్ కనుపించలేదు. కోపంతో—విసుగుతో వేసారి వసారాలో కూర్చున్నాను.

"నీవు కూడ తప్పిపోయి నట్లున్నావే?" చీకట్లో దగ్గరగా ఒక గొంతు వినిపించింది.

వెంటనే తిరిగి చూచాను; లేచాను, తిరిగాను ఏమి కనుపించలేదు. అదేదో ఒక యువతి గొంతు. ప్రేమోద్రేకంగా లేదుగాని, పేలవంగా నిరుత్సాహంగా వినిపించింది. ఆ స్వరంలో ఇంకేదో ధ్వనించింది; అర్థం కాలేదు.

"ఎవడైనా తనకు దాను తప్పిపోయినానను కొంటాడా?"

"లేదనుకో? తప్పిపోవట మనేది ఊహ. అంతేనా?"

"సరే! నీవే తప్పి పోయినట్లుగా ఒప్పుకొంటున్నావుగా? ఎందు కలా చేశావు?"

"ఏదో తోడుగా వుంటావని." నీ విదంతా వెదకి విసిగి వచ్చి కూర్చోటం నేను చూచాను. ఏం జరిగిందో అర్థం చేసికొన్నాను

ఇప్పుడు మోహం కనిపించింది. నా కుర్చీని ఆవిడ ప్రక్కకు లాక్కున్నాను.

ఒక స్త్రీగా వుంటే, ఎంత కష్టమో చూశావా?. నేను స్వతంత్రంగా ఒంటరిగా షికారుకు కూడ వెళ్ళడానికి లేదు. మాయమై పోయినట్లుగా వెళ్ళాలి.

ఆవిడ స్వరం అస్వాభావికంగాను, పెద్ద కష్టాలలో మాట్లాడుతున్నట్లుగా వుంది.

"ఈ విధంగా పదేండ్లుగా వుంటున్నాను. నే నెంతో చదువుకొన్నదాన్నని నీవు అనుకొంటున్నట్లున్నది."

"నిన్నెవరు తీసుకొచ్చారు?"

"ఓహో! అతని పేరా? నిజంగా మన మాట్లు మాట్లాడ కూడదు. నన్నెవరూ మోసం చేయలేదు. ఈ విషయంలో దూషించవలసి వస్తే అది నన్నే త్వరగా వెళ్ళి ఆ అమ్మాయిని వెదకండి."

అప్రియంగా ఉభయులం ఒక గంట దాకా మాట్లాడుతూనే వున్నాము. అప్పుడు ఆర్కెస్ట్రా చివరి పాట వినిపించింది. నే నావిడను డాన్సుకు వస్తావా? అని అడిగాను. ఆవిడ నేను ఆరడుగుల పొడవున్నానా? అని నిల్చుంది 5 అడుగులు 10 అంగుళం—ఏదో మూర్ఖుడు ఆవిడ రూపాన్ని పరిహసించినా, ఆమె మెచ్చుకొంటుంది; మాలో చాల మంది ఆవిడను విచిత్రంగా చూచే వాళ్లు.

మే మిద్దరం డ్యాన్సు చేస్తూ ఒకరి నొకరం చూచు కొన్నాము.

మొదట పేలవంగాను, ముభావంగాను నున్నదని అలా చిన ఆవిడ స్వరం అప్పుడు సజీవంగా, ఆహ్లాదకరంగా మారింది. మా అమ్మ తప్ప ఇంకే స్త్రీగూడ చక్కగా ఆలోచించ లేదని నా తలంపు. కాని మా అమ్మలాగే గొప్పగా ఆలోచించడం చూచాను. ఆవిడ స్త్రీగా వుండడం, మే మిద్దరం దైవికంగా కలుసు కోవడం, అప్పటి సంభాషణ, ఇవన్నీ ఆవిడకు సంతోషం గలిగించనవట. ఆవిడ కదలిక సున్నితంగా అసాధారణంగా వుంది.

ఆవిడ చెప్పినంత యెత్తుగానిల్చున్నది. ఆమె కండ్లు, నోరు, ఇసుకరంగు వెంట్రుకలను ఒక్కక్షణం చూచాను. హాస్యహాసంతో, గనునికతో ప్రకాశంగా మెఱిసినయి. వెడల్పు నోరు – దంతంతోను, చలువ రాతితోను చేసినట్లున్నది. మధ్య గోధుమ రంగుతోటి ఆకు పచ్చని కండ్లు నన్ను గమనిస్తున్నయి ఆవిడ ముఖం ఏదో గ్రహించినట్లు స్నేహ పూర్వకంగా నవ్వింది.

"నీవు రాల్ఫగారట్సన్ గదూ?"

"అవును. నీ వెవ తెవ్వు?"

నే నావిడ ముఖాన్ని గమనించాను. కాని నవ్వినంత సేపు ఎవరో తెలుసుకోలేక పోయాను. ఆవిడ మామూలు ముఖం నిలువు నోరు చూచేటప్పటికి ఏదో పూర్వపు కల జరగడం– మళ్లీ చూచాను.

"అరే! నువ్వా!!"

"తెలుసుకొన్నావన్న మాట."

నే నా పేరును చెప్పలేక పోయాను. బరువుగా ఊపిరి విడిచి బీన్‌పోల్ అన్నాను.

"వెధవ ముసలి బొక్క లే.'' అంది సమాళించుకొని.

ఆ తెలిసికోడం మమ్మల్నిద్దఱిని సంతోషంలో ముంచింది నిజంగా మా జీవితాలు అద్భుతంగా అయినది - ఆ విధంగా మేము తటాలున కలుసుకోడం, 8 ఏండ్ల ముందు కలిసియున్నప్పు డేలాగావున్నామో అల్లాగే వుండడం.

'ఆ డాంన్స్‌క్లాసు' ఆరోజు చంపేసుందేవాణ్ని.

"ముఖ్యంగా నన్నేగదూ!"

"అవును. నిన్నుగూడా"

నీవు రాను రాను బలేగా తయారవుతున్నావు. నీవు మంచి వాడవయేకొద్ది నాకు కోపం హెచ్చింది. నీవు ప్రతి సారి 'బీన్‌పోల్' అనగానే-తుపాకితో కాల్చేస్తా మని వుంది. నా కంత కోపం వచ్చేది."

"కాని, ఆ కోపం మాత్రం పైకి కనుపించదు గదూ!" అన్నాను. అప్పు డావిడ చిఱునవ్వుతో, నమ్మకతో 'డయానా' లాగ కనుపించింది.

వాకిటి దగ్గర ఒక కారు ఆగింది. కొంతమంది యువకుల కంఠాలు వినిపించినాయి. మేరిలిన్, మరికొందరు యువకులు లోపలికి వచ్చి బాగా నున్న రంగస్థలాన్ని నవ్వు ముఖత్వాగారు.

“హే, రాల్ఫ్! నువ్వు ఈ వచ్చియుండవలసింది. మేమంతా ఆనందంగా గడిపాము...బ్రాడ్‌ను అరెస్టు చేశారు. అందరూ ఆడటం బ్రాడ్ వీపుమీద దబదబా బాదుతూ, కేకలెయ్యడం ఆరంభించారు.

నేను బీస్‌పోల్ వైపు ఒక దొంగచూపు చూచాను. ఆవిడ కనుసైగ చేయగా ఆశ్చర్య పడ్డాను. పెదవులమీద నవ్వు కనుపించింది. పోలుగుపాటివాడు ‘వాలి’ ఆమెతో మాట్లాడు తున్నాడు. ఆమె నీ స్థితికి తెచ్చింది వాడే.

మేరిలిన్ నా వైపు చిరునవ్వు నవ్వి నవ్వి తనచేతిని నా చేత్తో కలిపింది. ఆవిడ చేతులలో, శరీరంలో ఆనందంతోటి కంపాన్ని నేను గమనించాను.

నాకొక కప్పు (టాప్) లేని ‘మాడల్ టీ’ చిన్న కారుండేది. మేరిలిన్ మిగతవాళ్ళతో సర్దుకోనేది–కాని ఆవిడకు నాతో రావడం ప్రియంగా తోచింది...నవ్వుతూ కేకలువేస్తూ కార్లు ఎక్కారు.

మేరిలిన్ ఎప్పటికంటె అందంగాను, మంచి తరుణిగాను ఉంది. ఆవిడ జీవితానికి తగిన చక్రనిరూపాన్ని పొందింది. ఆవిడ పరిచయం నాకు కాలవశాత్తు జరిగింది. డబ్బు, వయస్సుగల ఏ యువకుడైనా, ఆవిడతో నాకంటె బాగా మెలిగేవాడేమో? అని తోచింది నాకు.

"ఆ క్రిస్టినారాస్ తెలివి గలదని అంటారు. ఆ విధంగా ఊహించడానికి వీలుందా? విందుల్లో ఉండదగిన సంతోషం ఆవిడలో లేదు. ఏదో చీపురపుల్ల" అని అంటున్నది.

"ఎల్లాంటి తెలివైనదావు?"

"అరే! నాకేం తెలుసు? ఆవిడ ఎన్నో చేస్తుంది. కథలు, పద్యాలు... నాకు నిజంగా తెలీదు. సంగీతంలో పాల్గొనేది. 'మూన్ లైట్, వాట్సిస్' అని రాస వాయిస్తుంది.

"పియానా మీదనేనా ??"

ఆఁ! అంతే. అటువంటి వాండ్లను చూచి విచారిస్తుంటాను—ఆవిడ ఎప్పుడు సీరియస్ (తీవ్రం)గా వుంటుంది. ఒక స్త్రీ పొడుగ్గా వుంటే - - పిల్లలంతా ఏమంటారో తెలుసా? 'బీన్‌పోల్' పాపం! చాలా కష్టమ్.

## 26. అధ్యాయము

అక్టోబరులో ఒకవారం వున్నాను. ఆ వారంలో జరిగిన విశేషాలు బాగా జ్ఞాపకం వున్నాయి. విడుదల కెదురు చూచే ఖైదీలాగా వున్నాను. ఆ వాతావరణం—స్వచ్ఛంగా శుభ్రంగా కొంచెం మసక మసకగా వుంది. సూర్యకాంతి సోకి పచ్చని ఆకులు మెరుస్తున్నవి.

నేను పచ్చిక బయళ్ల వెంట బయలుదేరాను. స్టీవ్ ఇల్లు, మిస్టర్ క్విన్ చిమ్ముచున్న చర్చి—గమనిస్తూ మేడిగన్ల గుర్రాల సావడికి దారిబట్టాను. అక్కడొక ఎఱ్ఱటి 'గాసొలిన్' పంపు

తలుపు దగ్గఱ ఆనించి వుంది. ఆ చోటికి రోడ్డుకు మధ్య నున్న తావు నూనెతో తడిసి నల్లగా వుంది.

"జెర్రీ! పని తొందరలో నున్నట్లున్నావే?"

"అరే! రాల్ఫ్!—ఎప్పుడు ఏదో ఉండనే ఉంటుంది."

తెఱచిన తలుపు ప్రక్కగ నా దగ్గరకొచ్చి నిల్చు న్నాడు-అతని రూపం, అతడంత పెద్దవాడుగావడాన్ని - ఆశ్చ ర్యంతో చూస్తున్నాను. ఇంకా బాలుడుగా వుండా లనిపించింది. కాని అది గడచి పోయింది.

"పని తొందర ఎలా వుంది?"

అక్కడ విప్పి పడవేసి ఉన్న "చవర్ లెట్" కారును చూపి, నాకు పని అంటె ఇష్టం. చేయాలనిపిస్తే చేస్తాను. వద్దను కోని పనిచేస్తే చాల కష్టంగా వుంటుంది.

"జెర్రీ! నీ పనిని కొంచెం నిలిపి నాతోపాటు పడమటికి వస్తావా?"

"తప్పకుండా! ఎప్పుడు బయలుదేరుదాం?"

"నా 'ప్లివర్'లో వెళ్లుదాం" అన్నాను.

అదట్లా జరిగింది. ఆ వుద్దేశ్యం ఉన్నట్లుండి కలిగింది. ఆ విపరీతమైన వేసవి ఉదయం.

నేను తిరిగి పోతున్నప్పుడు నా నరాల్లో ఎలెక్ట్రిక్ షాక్' తగిలినట్లయింది; సంతోషం వల్ల గాదు; భయం వల్లనో, భవి ష్యత్తును చూడడం వల్లనో? ఏమో?

## 27. అధ్యాయము

నేను మేరిలిన్‌కు తరువాత, మిస్టర్ క్విన్‌కు జాబు వ్రాశాను; చించాను; మళ్లీ వ్రాసాను. నా బల్లపై అతికించకుండా పెట్టి, కింగ్స్లేని చూడడానికి వెళ్లాను.

నేను వంట యింట్లోకి వెళ్ళేటప్పటికి మిసస్ కింగ్స్లే ఎత్తు బల్లమీద కూర్చొని ఉడకబెట్టిన బాగాలా దుంపలు కోస్తున్నది. ఏదో ఒక అనుభవం నాలో ప్రవేశించడం వల్ల మళ్లీ అక్కడికివచ్చి నేను చేయరాని పని చేశాను. నేను ఒక చేత్తో ఆమె పైనవేసి భుజాలువంచి ముద్దు పెట్టుకొన్నాను.

"కాబట్టి నీవు తయారవుతున్నా నన్నమాట? వదలిపెట్టి పోవడాన్కి. అంతేనా? నాకు తెలేదు. నీవు ఆలస్యం చేశావు."

"ఇదో విను, నేను పడమటికి వెళ్లుతున్నాను. ఎవ్వరికీ ఇప్పుడు చెప్పొద్దు," అన్నాను.

నేను పొయ్యిదగ్గరగా కాళ్లు జాచి కూర్చొని, నలు ప్రక్కల చూచాను.

"నేను మళ్లీ వస్తే - ఎప్పటికైనా - నే నిక్కడికే వచ్చేస్తాను."

సరే! ఆ విషయం అతనితో మాట్లాడాలి.

సేత్ లోపలికి వచ్చాడు, మిసస్ కింగ్స్లే దీపం వెలిగించింది. ఆ గది వెలుతురుగా వుంది.

ఆమె సేతును జూచి "మళ్లీ ఇతనికి పిచ్చి ఆలోచన్లు కలిగినై యి. నేను సేత్ వైపు చూచాను." మనిషి ఎందుకు జీవిస్తున్నాడో చెప్పగలవా?''

సేత్ కెటిల్ చేతబట్టుకొన్నాడు. "అతడు చేయగలిగింది చేయడానికి జీవిస్తాడు." అని జాగ్రత్తగా చేతులు కడుగుకొన్నాడు.

భోజనం తరువాత జీవితాన్ని గురించి చాల మధన పడుతున్నానని అన్నాడు. నా కొక ఊహ తట్టింది. తన కిష్టమైన పనులు చేస్తూ చాలుకొంత సంతోష పడతాడో? ఆ విధంగా మనుష్యు డుండవచ్చు. ప్రపంచంలో మనుష్యుడు సుఖాన్ని వెంటాడుతూ పరుగె త్తడంకంటె విచారకరమైంది ఇంకేదీ లేదు.

వారిని వదలి వెళ్లేటప్పుడు నా జీవిత లక్ష్యమే మారి పోయినట్లయింది. నేను పడమటికి వెళ్లడాన్ని సామాన్యమేనని ఒప్పు కొన్నారు. కాని, ఒక్క విషయం మాత్రం — అదే నా పెండ్లి విషయ మేమయిందని హెచ్చరించింది మిసస్ కింగ్స్లే.

శనివార ముదయం వాల్థాంకు వచ్చాను. మేరిలిన్ తలుపు తెరచేటప్పటికి, ఆవిడ ఎడమ చేతిలో కాకితాల కట్ట యున్నది. "రాల్ఫ్! వీటి కన్నిటికి ఇవ్వాళ ఆర్డర్ ఇవ్వాలి. ఒక వారంముందే ఈ పని చేద్దా మనుకొన్నాను. కాని నీవు ఉన్నట్లుండి వెళ్లావు."

"సరే! నేను వారం రోజులుండాలసి వస్తుందని అనుకో లేదు."

ఆవిడ ఎంతో బాధ్యతగా ఆతుర్దాతో అన్నది. "ఈ వారమంతా చాల అవస్థ పడ్డాను. ఎన్నో పనులు చేయ్యాలి. కాని, నీ విక్కుడుంటేగా?"

తంగాలున నవ్వి నన్ను కౌగిలించుకొంది. నేను చెప్పే మాటను మార్చుకోవలసి వచ్చింది.

ఆవిడ నవ్వు, మెరిసే కళ్లు నన్ను ముగ్ధుడ్ని చేసినై. అందంగా. అమాయకంగా వున్న ఆవిడను మనిషిగా తలవక పోవడం స్ఫురించింది.. నా దురాలోచనల నావిడ తెలిసికొన్నట్లుగా వెంటనే దూరంగా జరిగింది. నన్ను చూచింది. నవ్వు మాయమైంది; కాంతి తగ్గింది; ఆవిడ వేలనమైన చూపు నన్ను పరీక్షించింది.

"సరే! లోపలికి రా?"

"లేదు. కొంచెం మాగు, నీతో మాట్లాడాలి." అన్నాను.

ఆవిడ ఒక నిమిషం నిశ్చేష్టగా చూచి, వెనక్కి తిరిగి మెల్లెక్కింది.,, ఒక సెకండులో మళ్లీ క్రిందికి వస్తాను" అని చెప్పింది. ఎర్రని వంటయింటి తలుపును చూచేటప్పటికి, నా బాల్యదశ గుర్తుకొచ్చింది. అమాయకంగా, సంరక్షణాతో ఏ అలజడి లేకుండా గడిచే జీవితం అది. పని, ప్రేమ-మనుష్యులను ఒడ్డే ప్రమేయం లేకుండా ఉండే దశ అది. అదే ఉత్తమమని తోచింది.

చేతులనిండా కాగితాలు పట్టుకొని ఆవిడ దిగివచ్చింది. "ఇదో! ఈ జాబితా చూచి నీకు కావలసిన పేర్లనుగూడ దీంట్లో చేర్చు—" ఆ వంటయింటి టేబిల్ మీద వాటిని పెట్టింది.

"మేరిలిన్! మనం పెళ్లాడటానికి వీల్లేదు – (స్వరం ఎవరో మాట్లాడుతున్నట్లుయింది) దాంట్లో అర్థం లేదు. తర్వాత అన్నీ సరిగ్గా వున్నయ్ అని నటించడంకంటె ముందే తెలుసుకోడం మంచిదయింది — — అది బాధాకరమైన విషయం."

"నిన్ను — — అనడం — — అంటే —నీవు చెప్పడం నాకే మీ అర్థంగా లేదు."

'ఏమ్? ఇదంతా అప్పుడే సూచించాను — — ('ఆవిడ ముఖం చూచాను.) నేను చెప్పిందే సరి. ఈ పనుల్లో మన మిద్దరం పాల్గొనవలసిన అవసరం లేదు."

ఆవిడ భయంతో చూస్తూ నిల్చుంది. "రాల్ఫ్! నీ కేదో జరిగింది — —" అంది బిక్క ముఖంతో.

"నేనేం చేయజాలను. నేను వెళ్లిపోతున్నాను–పోవాలి"

మేరిలిన్ తెల్లటి ముఖం ముడతలు పడ్డది. పెద్ద కళ్ల నుండి కన్నీళ్లు కారినవి. ఉన్నట్లుండి టేబిల్‌పై నున్న కాగితాలపై వాలి పెద్దగా ఏడవడం మొదలు బెట్టింది.

అది అట్లా పూర్తయింది. ఆవిడ కసలు విషయం అర్థమయినట్లు లేదు. ఆవిడను విచారంలో వదలి వెళ్లాను.

అప్పుడు నా విజయానికి సంతోష పడవలసింది, కాని నా కష్టాన్ని, అవమానాన్ని దూషించుకుంటూ, అక్టోబరు ఉదయపు సూర్యకిరణాల్లో, నా కారులో ప్రవేశించాను. నా జీవితంలోని అపజయాలను జూచి నాకే ఆశ్చర్యంగలిగింది.

ఆ స్వాతంత్ర్యపు పరుగుల్లో నా కొక ఆలోచన స్ఫురించింది. నేను నెమ్మదిగా వెనక్కి తిరిగి నా పోస్టులో మళ్లీ స్థానానికి వచ్చాను.

నేను ప్రేమలో పడ్డానని అప్పుడు తెలుసుకొన్నాను. ఇందాక ఏదో ఒక శక్తి సత్యాన్నుండి కప్పిపుచ్చింది. నా సద్బుద్ధి దాన్ని గుర్తించలేదు. నేను ఆ క్వీన్ వ్యాపారాన్నుండి, వాళ్ల కుటుంబాన్నుండి వేరుపడను. ఇంకేదో అశయాన్ని అందుకోవాలని ఉద్దేశ్యమే. మెదడు కీ పనితో సంబంధ మేమీ లేదు. నా పోస్టు కారు జానుగు పోతుంటే మెదడు కూడ దాన్ని అనుసరించింది.

## 28. అధ్యాయము

నాకు చాల స్నేహితులు కుదిరారు. అక్కడ దొరికే ప్రతి పనీ చేసేవాళ్లం -- కెర్రీ అప్పుడప్పుడు యంత్రాలను బాగుచేస్తుంటే, నేను కొయ్యలు చెక్కడా, ఎరువెత్తడం చేసేవాణ్ణి. మేము సాధారణంగా ఇరుకైన కారు సీట్లల్లోనో, పచ్చిక బయళ్లలోనో పడుకొనేవాళ్లం. ఒకొక్కప్పుడు ఆహారం లేక ఆకలితో బాధపడేవాళ్లం, ఇంకోసారి మృష్టాన్నం దిని ఆనందించేవాళ్లం.

గడచిన దినాలను గమనించేది లేదు. కొండలు, పొలాలు, విశాలమైన వాతావరణం, ఎరుగని దేశాలు, ఆపదను తప్పుకొనే మార్గాలు, పనిచేయడం, మాట్లాడటం, నడచుకొనే రీతులు, భయాలు, దూషణలు, ప్రేమలు వీటిని గమనించే వాళ్లం. అన్ని బాధలు వదులుకొని, కలలోని రూపాల్లాగా జీవితంలో ఏ బాధ్యతలు లేకుండా తిరిగేవాళ్లం.

ఉన్నట్లుండి ఇంటిమీద ధ్యాస కలిగింది. అక్కడికి ఇక్కడికి గల అంతరాన్ని ఊహించుకొని ఏడ్చేంతగా బాధపడే వాడిని.

ఫ్రెడ్రి కూడా ఆ విధంగానే వున్నాడు. కాని పైకి మాత్రం తన్ను గురించి చెప్పుకోడు. ముఖం మాత్రం విచారంగా వుండేది. ఈ విషయం నేను చెప్తానని ఎదురు చూస్తున్నట్లుంది.

ఇవి, ఇంకా ఎన్నో క్రిస్టీనాకు వ్రాసేవాడిని – రాత్రింబవళ్లు ఈ విధంగా, ఇల్లువదలి వచ్చినప్పటి నుండి వ్రాస్తున్నాను. నేను ముఖ్యంగా క్రిస్టీనా దగ్గరికి పోవాలనే. కాని ఆవిడ సమాచారం నాకు తెలియడం లేదు.

ఆ అక్టోబరు మధ్యాహ్నం ఆవిడ్ని చూడడానికి వెళ్లినపుడు -- ఆలోచన లేని ఆతురతగల హృదయంతో -- ఆవిడ నన్నెంతో సంతోషంగా చూచింది. అప్పుడు క్రిస్టీనా-బీక్ పోల్ – ఇప్పటికీ అలాగా పిలుస్తున్నాను. సంతోషంగా

నిశ్శబ్దంగా 'రాస్ ఫార్మసీ' అన్నది. మందులు తయారు చేయటం, ఆస్పత్రి సామానులు, సోడాలు – – 'లిన్‌డన్'కు చివర వుంది. లిండన్ దాని ప్రక్క తలుపే.

ఆవిడ మేడనుండి దిగివచ్చి నన్ను పైకి తీసికెళ్లింది.

"నాతోబాటు వస్తావా? ఆ కార్లో వెళ్లివద్దాం?"

"అమ్మ నిన్ను పరీక్ష చేసింతరువాతనే" అంది తల్లికి వినిపించేటట్లుగా.

ఆ గది విశాలంగా ప్రకాశంగా తెల్ల రంగుపూసిన కొయ్య సామాన్లతో, పట్టుచిన నీలి తివాసీతో, తెల్లటి తెరగుడ్డలతో, ఏవో పటాలతో అలంకారంగా వుంది.

మిసస్ రాస్ తివాసీ మీద కాచుకొని నిలుచుంది. ఆవిడ సంశయంగా, నన్ను – కదలిక లేక నిశ్చలమైన లోతు కండ్లతో జాగ్రత్తగా చూస్తూ షేక్ హాండ్ (చేయించింది–) ఇచ్చింది.

ఆవిడ రాతి విగ్రహంలాగా కఠినంగా తీవ్రంగా తోచి, తటాలున కూతురు వైపుకు మళ్లి, చిరునవ్వు నవ్వింది (అది ఆత్మార్పణం చేసినట్లుగా తోచింది). ఆ స్కాట్లాండు దేశాచారం, ఉక్కువంటి స్వభావం, ఆ ప్రేమోత్కర్ష – అంతా నాకు భయంకరంగా అగుపించింది – నాకా తలంపు ఎందుకు కలిగిందో?

కూర్చున్న తరువాత మిసెస్ రాస్ - తన ముత్తవ్వ బంధువైన 'వాటర్ స్కాట్'ను, నెత్తురు త్రాగే అడవి జాతుల నెఱిగిన 'లిలిజండ్ ఆఫ్ మాంట్రోస్'ను, 'ఓల్డ్ మార్టాలిటీ'ని, స్కాట్లండు కష్టాల్ని పద్యాల్ని వ్రాసిన 'హంబాకర్ ముఖేరత్'ను నీకు తెలుసా? అతడు పద్యాల వ్రాతకుపయోగించిన సిరా, అతని ప్రజల నెత్తురు? అంటూ సాగించింది.

"మొదటనే అతన్ని స్కాట్‌ను గుఱించి భయపెట్ట కమ్మా! అతడు (విజిటర్) ఊరికే చూచివచ్చినవాడు." అంది క్రిస్టీనా,

"నన్ను క్షమించు గారట్సు; ఎవరైనా 'వాల్టర్ స్కాట్'ను గురించి చదివినవాళ్లు కనిపిస్తే మాటలాగ బట్టలేను" అంది మిసెస్ రాస్.

నేను క్రిస్టీనాను ప్రేమిస్తున్నానని మిసెస్ రాస్ నిశ్చ యించుకొంది. ఆ రెండు జీవితాలు నిజమైన లోహాలులాగ మారు పల్కినయి. ఆయిద్దఱిలో మూడవవాడు నఖ్యంతో ఎల్లా మెలగుతాడా అని ఆశ్చర్యపోయాను, క్రిస్టీనాగూడ తన తండ్రిని గూర్చి చెప్పలేదు-లాభంగా జరుగుతున్న వీరుండే ఇంటి క్రింది మందులషాపుకు సొంతదారుడనే విషయం తప్ప ఇంకేమీ నాకు తెలియదు.

'సరే ! ఎలాగైతేనేం ? మేమిద్దరం బయలుదేరాం- అసూయతో నిండిన మిసెస్ రాస్ యొక్క ఆశీర్వాదం తర్వా తనే.

అలా రెండు గంటలు గడిచిన్నై, వాల్టన్ సరస్సు చుట్టూ తిరిగాము. నేనావిడను ప్రేమిస్తున్నానని చెప్పేటప్పటికి పైన బడ్డ నీటి తుంపరలాగా విదిలించేసింది. అది ఆవిడలోని ఒక స్వభావం అనుకొన్నాను.

"రాల్ఫ్!... ఈ ప్రపంచంలో నీ వేమి చేస్తున్నావు?... నీవు సాధారణంగా ఒక ఉద్యోగం చూచుకొనే యువకుడివేనా?

రాల్ఫ్ మనస్సుకు కొంచెం బాధ కలిగింది. ఎందుకంటే, 'నన్ను గురించి నీ యుద్దేశ్యమేమి?' అని ప్రశ్నించడానికి బదులు జీవితాన్ని గురించి ప్రశ్నించడమే? నేను ఏ వుద్యోగమూ లేని ఒక యువకుడ్ని' అని కఠినంగా చెప్పాను. ఆవిడ బాధతోటి చూచేటప్పటికి, నా మూర్ఖాన్ని తెలుసుకొన్నాను, చిన్న బిడ్డలాగా వినయంతో గూర్చున్నాను.

అన్ని విషయాలూ నా ఫోర్డ్‌లో కూర్చొనే మాట్లాడుకొన్నాం. నా జీవిత నిర్ణయాన్ని గురించి, కింగ్స్లేలను గూర్చి, మిస్టర్ క్విన్, మేరిలిన్ ల గూర్చి, వివరపరిచాను. స్వాభావిక వస్తువులతో జీవించడమే నా జీవిత లక్ష్యం - పూర్వులు సత్యం అనేది గాలి, నీరు, భూమిలో నుంచి పుట్టిందని నమ్మేవాండ్లని ఈ మాటనే చివరి రక్షణగా వుపయోగించాను. విధుక్త ధర్మాలను, పనిని, ఎగగొట్టవలెనని తలంపు లేదన్నాను. అసాధ్య కార్యమైనా సరే ప్రవేశించి, సాధించి గౌరవాన్ని పొందుతాను, నమ్మకము లేనిదే ఏ పనినీ చేయను.

ఆవిడ ఓర్పుతో సావధానంగా విన్నది—అంటే, కొంచెం సేపు వినీ వినకుండాను, కొంచెం సేపు నా ఆర్భాటాలను చూచి సంతోషిస్తున్నట్లూను. కాని, ఆవిడకర్థం కాలేదట.

ఎవరి ఉద్దేశ్యాలు, ఎవరి నమ్మకాలు వాళ్లవి. నా కంత నమ్మిక లేదు అనాలి.

అప్పుడావిడ స్వాభావిక వస్తువులను గురించి చెప్పింది. నేను ప్రాచీనా చారలతో ఉండలేదా? కాలేజీలో ఆ వస్తువును ఏదో 'ఎలెక్ట్రిసిటి' అని నేర్చుకొంది.

అప్పటికి ఆవిడ నన్ను ఎగతాళి చేస్తుందని తెలుసుకొన్నాను.

నన్ను పెండ్లి చేసుకొంటావా? ప్రియురాలిగా వుంటావా? అని అడిగాను.

లేదు, ఎప్పటికీ కాదు; ఏ విధంగానూ కాదు.

ఆవిడ ఇంకెవరినైనా ప్రేమించియుంటుందా? - అది నాకు అనవసరము.

"ఏం? నీవెందు కొప్పుకోవు?" అన్నాను నిరాశతో.

"రాల్ఫ్! లేదు...సరే?......"

ఒక మూర్ఖుడివిగా నడుచుకోవద్దు - అని అంటావు. అంతేగా. కారు స్టార్ట్ చేసి, ఇండ్లకు మరలాము.

## 29. అధ్యాయము.

"ఈ విషయము తీర్మానంగా చెపుతున్నావా, రాల్ఫ్?" వాన్న వసారాలో ఈ చివరి నుండి ఆ చివరికి పచార్లు చేస్తున్నాడు.

"అవును."

"నీ జీవితపు సంపూర్ణ లక్ష్యం ఒక గ్రామ వడ్రంగిగా వుందామనేదే గదూ?"

"అది నా పూర్ణలక్ష్యంగాదు -- అందులో అదొక భాగం."

"ఓహో -- ఇంకేదన్నా అడుగవచ్చా?"

"సరే! పెండ్లి ఉన్నది -- అది గూడ లక్ష్యంగా భావిస్తాను. నేను అపూర్వమైన అందమైన వస్తువును చేయగలను-నీవేమీ అనడానికి లేదు. నేను కొంత కాలంగా వస్తు రూపాలను తయారు చేస్తున్నాను. కొంత వ్రాద్దామనుకొంటున్నాను. కాని ఇప్పుడా విషయం మాట్లాడడం అవమానంగా వుంది. బొమ్మలకు రంగులు వేస్తాను. నీవు నా 'స్కేటు' లను చూచే తీరాలి; సరే -- నీవు చూడక పోవటమే మంచిది; ఎలాగైతే నేం నేను కృషినభివృద్ధి చేస్తున్నాను. దేవుడు మేలు చేస్తే, కొద్ది రోజుల్లో గ్రుడ్లు, పాలు, వెన్న వ్యాపారంగూడ ఆరంబిస్తాను --" అన్నాను.

"రాల్ఫ్! నేను నీకు ప్రియంగా చెపుతున్నాను; జాగ్రత్తగా విను. నీది మంచి ఊహాలుగల ఒక యువకుని కల—కమ్మని పచ్చిక పచ్చిక బయళ్లు, నిర్మల హృదయాలు, ప్రశాంత ప్రదేశం - దాంట్లో మేళములు మ్రోగుతుంటే, ప్రేమగా; ముగ్ధంగా నిరంతరమైన కల నీది. అది పురాతనమైనది; భయంకరమైనది. నీవు దాన్నొకసారి అంగీకరిస్తే, ఆ కల నీలో బాగా నాటుకొంటుంది. నీ మనోబుద్ధులు రెండూ కలిసి, ఈ స్వాభావికలో కొన్ని నివసిస్తవి. ఒకప్పుడు నా కలగూడ అదే రాల్ఫ్! నేను పుస్తకాల నుండి మాట్లాడటం లేదు. కాని, అది సత్యమని నమ్ముతున్నాను. చివరికి ఒకనాడు ఒంటరిగ కొండ ప్రక్కన ఎడారిలో — — మేలుకొంటావు." అన్నాడు నాన్న.

"ఈ క్రూర ప్రపంచాన్ని ధైర్యంగా ఎదుర్కొంటే అవన్నీ నీకు లభిస్తాయా?"

"అవును, తప్పక లభిస్తవి. కాని, సౌఖ్యమైంది గాదు రాల్ఫ్! నీ ధర్మం అదే. మానవత్వం లభిస్తుంది."

"అదే వృద్ధుడైన ఆ ప్రధానోపాధ్యాయుని జీవిత లక్ష్యం."

"అవును, నీవుదాన్ని అర్థం చేసుకొంటావని ఆశించాను."

నేను క్రిస్టీనాను గురించి ఆయనతో చెప్పగా, చిరాకుగా చూచాడు. ఆవిడను చూచి ఒక సంవత్సరమయింది. ఆవిడ ఎక్కడుందోగూడ తెలీదు. అవిడ తండ్రి మందుల షాపుకు సొంతదారవడం అసంబద్ధంగా వుంది.

"నిజంగా ఈ విధంగా నీతో మాట్లాడి, లాభం లేదు. తెలిసి కూడా నేనెందు కిలా మాట్లాడుతున్నానో నా కర్థం కా లేదు."

నేను, శ్రీ పడమటి నుండి వచ్చిన మర్నాడు నేను కింగ్స్‌లేల ఇంటికి వెళ్లాను. ఆ ప్రదేశం చిన్నదిగా పెద్ద తివాచీ మీద ఒక చిన్న వస్తువు నుంచినట్లుగా వుంది. ఆ వేసవిలో పండబారిన ఆకులు, ఎండిపోతున్న గడ్డితో ఆ యిల్లు విచార కరంగా కనిపించింది. నేను వంపు దిరిగి, ఏవో ఆలోచనతో, తెలియకుండా, ఆ దుమ్ము, గడ్డి అది దాటుకుంటూ సేల్ అంగడికి పోయి నిలిచాను.

అంగడి ఖాళీగా వున్నది. కొయ్యల పాక దాటి వంట యింటి తలుపు తట్టాను.

అక్కడగూడా ఎవ్వరు లేరు. నేను ఆ శూన్యాన్ని, నిశ్శబ్దాన్ని చూచి ఆశ్చర్యపడ్డాను. ఒక చిన్న షెల్ఫ కిటికీ దగ్గఅ మనిషి ఎత్తున గోడకు బిగించి ఉంది. దాంట్లో పిన్నులు, బొత్తాములు, సిరాబుడ్డి, పెనసలి, ఏదో పోస్టు కార్డు సైజులో ఒక రంగుల స్టీమరు -- నా పేరుతో ఒక కవరు విదేసీ ముద్రతో వుంది. అదీ కింగ్స్‌లే యొక్క గొప్ప నేర్పు.

బహుశా క్రిస్టీనా? -- నేను దాన్ని తీసి చింపి, లోపలి కాగితాన్ని తీశాను.

"ప్రియమైన రాల్ఫ్! మే మున్న నగరం చక్కగా ఆకర్షణీయుంగా లేదు. నాకక్కడికి వద్దామని వుంది --"

నా చేతులు వణికినయి. నా బుఱ్ఱ బ్రద్దలయింది. ఒక్క నిట్టూర్పు విడిచి, మళ్ళీ చదివాను. నాకర్థం కాలేదు. ఆవిడ పదాలు విచిత్రంగా నాట్యం చేస్తూ కనుముసుగై తొంగి తొంగి చూస్తున్నై. అక్కడికి వెళ్ళిన కొంత కాలానికి ఆవిడ తండ్రి–గుండె జబ్బట – ముందు సూచన లేకుండానే చనిపోయినాడని విని కండ్ల నీరు గార్చాను. అతన్ని నే నెప్పుడూ చూడలేదు. ఆవిడ తల్లి స్కాట్లండులోనే వుందామన్నదట; కాని ఇక్కడి స్టోరు, ఆస్తులు పరిష్కారం చేయాల్సి వుంది. ఏమి చేయడానికీ తోచలేదట.

నా జాబులు ఆవిడ కోరినదాని కంటె గొప్పగా వున్నవట. ఇంకా కొన్ని జాబులు వ్రాస్తావా? దేన్ని గురించైనా సరే, కొద్దిగా నవ్వడానికి కావలసి వచ్చింది. కామ్‌టన్‌లోని నీ ప్రయాణాలను గురించి వ్రాయుము. అన్నది — — క్రింద వినయ విధేయతలుగల బీన్‌పోల్ క్రిస్టీనా – చేవ్రాలుంది.

క్రింద ఒక సూచన—"అమ్మ నన్ను గురించి భయంకరమైన ఆలోచనలు చేస్తున్నది. నన్నేమి చేయమంటావు?"

వసారాలో అడుగుల చప్పుడయింది. నా ఈ లోకాన్నుండి తలయెత్తి, చూచాను.

"నూర్మా! – — హలో!"

"అరే!! — – రాల్ఫ్ – –"

మేమిద్దరం చాలాసేపు నిశ్చేష్టులమై చూస్తూ నిలుచున్నాము. కొద్దిగా తల ఆడించింది. "నీవిపుడు పూర్తి మను

ష్యడ వయినావు. అంతేగదూ? నీకెలా అనిపిస్తున్నది? అంత పెద్దగాను, వయస్సులోను–ఆవిధంగా! కాని, నీవు తిరిగి వచ్చి నందుకు చాలా సంతోషం. నీవు లేకుండా వాళ్ళంతా ఎంత బాధపడుతున్నారో తెలుసా?"

"సరే! ఎలాగున్నారు వాండ్లు?"

ఆవిడ పొయ్యి దగ్గరకు వెళ్లి, పైనుండి కాగితం తీసింది.

"అతడు తన్ను తానే చంపుకున్నాడు. ఆ నిచ్చెన కొయ్యలనుండి పడి, దెబ్బ తిన్నాడు."

"ఆఁ – అల్లాగా ? ?"

అది అంత ప్రమాదం కాదనుకుంటాను. ఎడమ చేయి మణికట్టు విఱిగి, వెనక్కి తిరిగి పోయింది––బాగా లేచి తిరిగితే గాని పీపు సంగతి తేలదు. మిగతా భాగమంతా సరిగ్గానే వుంటుంది.

ఈ వయస్సులో అతడు నిచ్చెన లెక్కకూడదు – నిజంగా అది అతని తప్పు కాదు. అతనితో పనిచేసే మూర్ఖులు. అడ్డు కొయ్యను సరిగ్గా దిగ్గొట్టలేదు.

చాలాసేపు మాట్లాడింతర్వాత – "నే నతని క్రింద భాగస్తుడుగా వుంటే ఎలా వుంటుంది? అతన్ని నేలమీది పనిలోనే వుంచుతాను – – అతడు అంగట్లోనే ఉండేటట్లు చేస్తాను."

ఆవిడ చూపు సంశయంగా వున్నది.

"నీవేదో ఆట్లాడుతున్నావు రాల్ఫ్! — — మార్విన్ మామతో గడ్డి వేయడానికి పోతున్నప్పటిలాగా?"

"నేను ఆట్లాడటం లేదు, నా జీవితానికేదో తగిన పని చూచుకొందాము," అని చెప్పాను. అదేమంత సులభంగాదు. ఆవిడ కళ్లు నన్ను గమనించాయి. నేనావిడ నోటిని, గడ్డాన్ని గమనించాను. దార్ఢ్యంగా, ఏ విధమైన పరిహాసం లేకుండా ఆకర్షణీయంగా వుంది. ఆవిడ నా వ్యూహాను తెలుసుకొన్నట్లుగా చిన్నగ నవ్వి, తన కుడి చేతితో నా మొద్రుకలను వెనక్కి తోసింది.

నేను నా ఆవేదనను నిలుపుకోలేక వెనక్కి దిరిగి, కామ్టన్‌లో ఆస్పత్రిలోనున్న సేత్‌ను చూడడానికి నా ఫోర్డ్ కారులో బయలుదేరాను. దారిలో 'కేబిల్' (తంతి) పంప డానికి మాటలను ఆలోచించుకొన్నాను. 'వెంటనే తిరిగి రా-పరిస్థితి ఎదురు చూస్తున్నది. అర్జంట్! మొదటి పడవలో బయలు దేరు'

## 30. అధ్యాయము

సేత్ ఇంటికి మరల వచ్చినప్పుడు ఆసక్తితో పనిలో ప్రవేశించాను. నేను అతని కారు, పనిముట్లు, పనులను తీసి కొన్నాను. నేనా పనిని చేయడం చూచి, అతడు తానుగూడ ఒక యువకుడైనట్లు సంతోషించాడు.

నేను ఆ సామాన్లతో ఈ మానవ సంఘానికొక భాగస్తుడినన్నట్లుగా కారులో బయలుదేరాను. స్టోరు కీపర్ల

సంఘం, కలప వ్యాపారుల సంఘం, కమిషన్ వ్యాపారుల సంఘం, యాత్ర వ్యాపారుల సంఘం, రైతుల సంఘం, వర్తకుల సంఘం - వీట్లల్లో మెంబరు (సభ్యుడు) నయ్యాను.

నేను ఆహారం, పుష్టి, నిద్ర, విహారం - వీట్లో శారీరిక సంతోషాన్ని పొందేవాణ్ణి. నాకు స్వాతంత్ర్యం, సౌఖ్యం కోరి నట్లుగా లభించింది.

నెమ్మదిగా నా జీవితం ఒక విధంగా కుదురుతున్నది. కాని, నాకు మాత్రం పెద్ద సమస్య అయింది. నా సంఘటనా లన్నీ ఒక్కటి అయి, న్యాయాన్ని చెప్పమని కోరుతున్నది. ఈ ప్రశాంతమైన రోజుల్లో ఈ దేశంలో ఎంతో డబ్బు సంపా దిస్తూ, సైన్సు (వైజ్ఞానికము) యొక్క ఆట వస్తువు లైన- కార్లు, సినిమాలు, రేడియోలు-వీటితో వినోదిస్తున్నారు. ఇట్టి సమయంలో మానవ సంఘంలో రాల్ఫ్ గారట్సన్ మానవ ధర్మంతో పేరు పొందాడు. అతడు తన ఆశయాలను త్యాగం చేసేదానికంటె - కామ్టన్‌లోనే వుండి పని చేయాలనే తలంపును నెరవేర్చుకొన్నాడు.

సామాన్యంగా సామాన్లకై వాల్థాంకు వెళ్లుతూ, స్టేట్ వీధిలో నిర్జీవమైన వీధి కిటికీలను చూస్తూ వెళ్లేవాణ్ని. ఆ మందుల షాపు ఒక దుర్మార్గుడైన అధికారి చేతిలో పడ్డది. మిసెస్ రాస్ అక్టోబరులో వస్తుందని చెప్పాడు.

నేను అక్టోబరు 6-వ తేదీ ఆ యింటి కీలు తెరిచి వుండగా చూచాను. తలుపును తట్టి, కొంచెమాగి. మళ్లీ

తట్టాను. హృదయానికి దెబ్బ తగిలినట్లయింది. వాకిలికి 7 అడుగుల ఎత్తున గాలిలో తేలుతున్నట్లనిపించింది.

చప్పుడు వినిపించింది. బరువైన అడుగులు, నల్లని క్రిస్టీనా తల్లి ముఖం కనిపించింది.

"ఓ ! అల్లాగా? నీవా?" అంది.

నేను నవ్వుదామనుకొన్నాను. కాని, వెంటనే ఆపుకొన్నాను.

ఆవిడ ఒక కత్తిని చేతబట్టుకొన్నట్లుగా కనుపించింది.

"హలో ! సరే ! చివరికి మళ్లీ వచ్చారన్నమాట ! క్రిస్టీనాకూడ వుందా? నేనావిడను చూడవచ్చా?"

"నీవు మాకు చాలా కష్టాలు గలిగించావు గారట్సన్," అంది తీవ్రంగా.

నిశ్శబ్దం. నాకు పరుగెత్తిపోదామా అనిపించింది.

"అసలు వచ్చిన చిక్కేమిటో చెపితే బాగుంటుంది."

ఆవిడ భయంకరంగా నావైపు తిరిగేటప్పటికి ఆపె చేతిలోని కత్తి మెరిసింది. నేను చెప్పుకు పోయాను. "క్రిస్టీ నాను పెండ్లాడాలనుకోడంలో తప్పేముంది? నేను తగినంత మంచివాణ్ణి కాదని నీవు తలిస్తే, సరే -- నే నందుకు ఒప్పుకొంటాను -- కాని, ఒక మనిషి చేయదగినదంతా చేస్తాడు. నేను చేస్తుండేది అదే."

ఆవిడ నా వెనకవైపు చూచింది; నలుగురున్నచోట మాట్లాడుతున్నట్లుగా తొందరగా వెనక్కు జరిగి, 'లోపలికిరా గాంట్వెన్' అంది మెల్లగా.

ఆవిడ మేడమీదికి తీసికెళ్ళింది. ఒక విచారము మా యిద్దరినీ నివరించింది. ఆవిడ ఆదరించే విధము నాకర్థం కాలేదు.

"నేను నీతో స్పష్టంగా మాట్లాడటమో, లేక మౌనంగా వుండటమో చేయాలి. పెళ్ళి నా వుద్దేశ్యంలో రహస్యమైన పని కాదు. భూత భవిష్యత్తులతో కూడి వుంది. ఇంతే కాక కుటుంబం, ఆస్తి, సంఘ గౌరవం – ఆలోచించాలి. (అసహ్యంతో చూచింది.) ఈ ప్రదేశంలో ఏముంది?—మంచి భవిష్యత్తుగాని, మంచి యోచనలు చేయడానికిగాని, ఏ విధంగాను–గౌరవం, సంతోషం కలిగించేవిగాని ఏమీ లేవు. నా భర్త ఇక్కడ వుండవలసి వచ్చింది -- అందువల్ల నేను ఇక్కడ వుండే దాంతో సర్దుబాటు చేసుకోవలసి వచ్చింది. ఇంకా ఈ విధంగా వుండనవసరం లేదు. నిజంగా మేముండే ప్రదేశానికి వెళ్ళి, గౌరవంగా, సంతోషంగా గడుపుదామనుకొంటున్నాను. మళ్ళీ నా మనుష్యుల మధ్యకు వెళ్ళి జీవించడం ఎంత సంతోషంగా వుంటుందో తెలుసా? – – 'గ్లాస్‌గో'లో నాకో చెల్లెలుంది. వాళ్ళు క్రిష్టీనాను సొంత కూతురుగా తీసుకొన్నారు."

"నేను ఆవిడకు తగినంత మంచి వాణ్ణిగానని నీ అభిప్రాయమా?"

"నిన్ను గురించి మాకెక్కువ తెలియదు."

"ఇంతా చేస్తే నాకు పదేండ్లుగా క్రిస్టీనాను తెలుసు." (ఆవిడ దృష్టి నా దుస్తులమీద నిలిచింది.) నీవు నీ భార్యను పోషించగలవా?"

ఉన్నట్లుండి ఎన్నో విషయాలు లెక్కించనివి గుర్తు కొచ్చినయి. "అరే! అదేమిటి? - నేను - నేను - అంటే-"

అప్పుడు తలుపు చప్పుడు... మెత్తని అడుగులు-గుడ్డలు నలిగిన శబ్దం వినిపించింది. నేను లేచి నిల్చున్నాను-అదో-అక్కడే గడప దగ్గర ఆవిడ వుంది.

'హలో!' అంది ప్రశాంతంగా - నే నక్కడికి వస్తానని. ఆవిడ చిఱునవ్వు బుగ్గలమీదుగా కండ్లదాకా వ్యాపించింది. నేను 'హలో!' అన్నాను.

ఆవిడ నవ్వి, అమ్మ వైపు చూచింది. "అతన్ని భోజ నానికి వుండమనరాదూ! తినడానికి చాలినంత 'చాప్స్' తెచ్చాను! ఆవిడ సామాన్ల సంచిని తీసికొని, హాలులోకి వెళ్లింది.

"నేనిక్కడ వుండలేను - - అంటూ మొదలుపెట్టాను.

"సరే! మంచిదే - - బహుశా నీవిక్కడ వుండవచ్చు. లేకపోతే, క్రిస్టీనా నిరాశ చెందుతుంది."

"అలాగైతే సరే!" ఆవిడ ముఖం బెదిరింపుగా నున్న ప్పటికీ, నేను తేలికగా మాట్లాడాను. "నేను పని చేసేటందుకు వేసుకొన్న ఈ దుసులను క్షమించాలి."

ఆవిడ లేచి నిల్చుంది. "నేను పని సమయంలో వేసి కొనే దుస్తులను ఆక్షేపిస్తాననుకొన్నావా? నేనెప్పుడూ అల్లాంటి దాన్నిగాదు," అంటూ నా దగ్గఱకు వచ్చి, తన చేత్తో నా బుజాల క్రింది కండను నలిపి, చక్కా వెళ్లి పోయింది.

క్రిస్టీనా మళ్లీ రాగానే, మేము చాలాసేపు ఒకరినొకరం బిగువుగా చూచుకొన్నాము.

ఆవిడే నన్ను పలుకరించింది. "నీవు కొంచెం వుబ్బి నట్లుగా వుండేవాడివిగదూ-చిన్న బిడ్డలాగా?"

"ఉబ్బినట్లా? నేనా?..."

"అవును. ఎన్నో సంవత్సరాలు-నీకు చాలా అందంగా బుగ్గలు, గడ్డం వుండేవి.

నేను వినిపించుకోలా. "శాంతిని గుఱించి మనం ఏమను కొన్నామో తెలుసా? -- శాంతి ఒక దైనికం."

"మనం దేవత్వ మనుకొన్నామా?

"ఆ శాంతే నువ్వు క్రిస్టీనా! నీ బొమ్మను గీచేటప్పుడు నేను శాంతిని గీస్తాను. అదే ఇప్పుడు కనుగొన్నాను -- ఆ సామాన్లతో నీవు ఇంట్లోకి వచ్చినప్పుడు సరిగ్గా అదే చోట నవ్వుతూ నిల్చున్నావు."

"అవును. ఇంకా చెపుతావా?"

"నీవు సామాన్లు కొనడానికి స్టోరుకు వెళ్లినప్పుడు - అల జళ్లు, గొడవలు జరుగుతూంటాయా? గుమాస్తాలు, యువకులు, నిలుచున్న వాండ్లు నీ వెంటబడుతారా? నీవు..."

"లేదు రాల్ఫ్! నేనెప్పుడూ సామాన్లను మరుగ్గానే కొంటాను."

ఈ మాటలు మాట్లాడేటప్పుడు మేమిద్దరం ఎక్కడో దూరంగా గోడలుగాని, నేలగాని - ఏవీ లేకుండా ఆకాశంలో తేలిపోతున్నాము. ఇద్దరం ఒకటిగా దగ్గరకొచ్చాము. తాకుతూ చేతులు, శరీరాలు, పెదవులు - - కాని ఏం జరుగుతుందో ఇద్దరికీ తెలియకుండా...

"క్రిస్టినావేనా నీవు?"

"అవును ?"

"నాదానివేనా?"

ఒక నిశ్శబ్దమైన వాతావరణం మా యిద్దరి చుట్టూ పెరుగుతున్నది.

"నీవు నాదానివేనా క్రిస్టీనా?" అని అన్నావా? "అవును."

"ఎప్పటికీనా?"

"అవును."

మా యిద్దరిలో గట్టి పదార్థం లేదు. నా కదొక జీవితం అనిపించింది.

"నేను నీకోసం పోట్లాడాలి క్రిస్టీనా?"

అదే జవాబు అన్నట్లుగా చిఱునవ్వు నవ్వింది.

"నేను పోట్లాడవలసిన అవసర ముండనుగదా ప్రేయసీ!" ఆ చిఱునవ్వు పెద్ద నవ్వయింది. "ఈ వేసవిలో నేనేమి చేస్తున్నాననుకొన్నావు ?"

కాని – – ఆవిడకింకా తెలియదు. నన్ను ముద్దు పెట్టుకొంది. "మనమిక్కడ వున్నాముగదా? నేనిక్కడున్నాను."

"సరే! నేనెక్కడున్నానో, నీవు అక్కడే వున్నావు," అన్నాను.

"దానికి కావలసినదల్లా అంతే!" అన్నదామె.

## 31. అధ్యాయము

కథ అనేది సాధారణంగా ప్రేమతోనో, మరణంతోనో అంతమవుతుంది. కాని, చరిత్రలు అంతంతో ఆవశ్యకం లేకుండా జరుగుతుంటవి. తరువాత నాన్న వేళకు భోజనానికి పిలిచాడు.

ఒక సాయంత్రం సేత్ నన్ను విచిత్రంగా చూచాడు అతని నోరు దేన్ని తెలుపకపోయినా, చిఱునవ్వును అతని కండ్లల్లో చూచాను.

"ఏం చేస్తున్నారు?" అన్నాను.

"మిస్టర్ గారటెస్నెన్‌ను చూడడానికి వెళ్లి వస్తున్నాను," అన్నాడు సేత్.

"నాన్ననా?"

నా ఆశ్చర్యానికి సంతోషిస్తూ, తల వూపాడు. "నన్ను గురించి కాదులే – అది ముఖ్యం కాదనుకో." కొంచెం సేపు ఆగాడు. అతని మాటల హాస్యాన్ని గుర్తిస్తూన్నాను. "నీ వెలా వుంటున్నావు?"

"నీవు నేనేదో మధ్యరకం పని చేస్తున్నానని చెప్పి వుంటావు."

"అయితే అయి ఉండవచ్చు."

తరువాత 'డైవ్లెట్' ప్రదేశాన్ని ఎవరో కొన్నారని, దాన్ని బాగు చేయదలచారని, బాగు చేయడంలో నీ వుద్దేశ్యం ఏమి? అని అడిగాడు.

కామ్‌టన్‌కు వాయవ్యంగా మైలు దూరంలో పెద్ద వీధి నుండి తూర్పు దిక్కుకు చీలి పోయే ఒక గ్రామపు బాట వైపు తిరిగితే, డైవ్లెట్ వుంది. బాటసార్లు ఎందరో దాన్ని చూచి ఉండరు. ఆ చిన్న గ్రామ మార్గంలో కూడ, ఆ యిల్లు కొంత భాగం 'లిలాక్' చెట్లతో కప్పబడి వుంది. కాని కామ్‌టన్ జనులకు దాన్ని బాగా తెలుసు. ఆ 18–వ శతాబ్ది గృహం ఒక ప్పుడు ఆ గ్రామంలోకల్లా అందంగా గణింపబడింది.

అది కొన్న వాడు క్రూగర్. పడమటి వైపున రెండు గదులు కలిపి, ఒక గదిగాను, దానికి తోటకెదురుగా అద్దాల కిటికీని వుంచమని సేత్‌తో చెప్పాడు.

అది మంచి అభిప్రాయం. అతనికి విశాలమైన స్థలమే గాక మంచి వెలుతురు, ఆకర్షణీయమైన తోట కనిపిస్తుంది.

"ఆ విషయం అతనితో చెప్పావా?"

మొదటిసారిగా అతని చదువుకొనే గదిలోకి వెళ్లను. మేమిద్దరం కలిసి, గంటసేపు మాట్లాడాము. అతనే ఎక్కువగా మాట్లాడాడు. నేను గదిలో రెండుసార్లు పచారు చేశాను.

"మిస్టర్ క్రూగర్‌ను గురించి నిశ్చయించుకొన్నారా?"

"ఆ! మేము అంగీకరించాము."

నాన్న నీతో ఏకీభవించాడా? లేక నీవు అతనితో ఏకీభవించావా?

"రేపు ప్రైవేట్ ఇంట్లో మీటింగుంది. నీవు కూడా వస్తే మంచిది." సేత్ కండ్లు సంతోషంతో మూసికొన్నాయి. "నే నతనితో ఏకీభవించానన్నమాటే. ఆ విధంగా చేద్దామనే వెళ్లాను. ఎప్పుడు అలా చేద్దామనే నా వుద్దేశ్యం."

మరుసటి సాయంత్రం మీటింగు జరిగింది. మేము కోట్లు, హాట్లు వేసుకొని, ఆ చల్లని గదుల్లో నడుస్తూ, మౌనంగా ఆ గోడలు, కప్పులు, తలుపులు చూస్తున్నాము. నన్ను మిస్టర్ క్రూగర్‌కు పరిచయం చేయలేదు. కాని, కింగ్స్ లేల వ్యాపారంలో భాగస్తుణ్ణిగా తలచుకొన్నాడు.

సేత్ అన్నాడు. "మిస్టర్ గారట్సన్ మేము ఊహించనంత గొప్పతనం, గౌరవంగల శిల్పి. ఇప్పుడున్నవారి కందరికంటె, అతనికే ఈ పాత యిండ్లను గురించి ఎక్కువగా తెలుసునని నీవు కొంచెం సేపట్లో గ్రహిస్తావు."

మిస్టర్ క్రూగర్ స్థూలకాయంతో ఉత్సాహంగా పచార్లు చేస్తున్నాడు. అతడు నాన్నను చులకగ్గా చూచాడు. అతని చూపు ప్రియంగా లేదు. "శిల్పా?..." ఆ ఒక్క పదమే అతని సంపూర్ణాభిప్రాయాన్ని కలిగి వుంది.

నాన్న అన్నాడు—"నేను చాలా కాలంగా ఈ యింటిని పొగడుతూ వచ్చాను. ఈ యింట్లో 'డిసైన్లు' అద్భుతంగా వున్నై. దీపసెమ్మెమీద చెక్కడపు పనులు -- అదో, అక్కడ చెక్కడపు తీగలు -- ఇలాగా చెక్కడపు పనులతో ఇల్లంతా స్తంభాల పై భాగాల నుండి తలుపులు, కిటికీలదాకా అందంగా వున్నవి. విదేశాల శిల్పకళలన్నీ దీంట్లో పొందుపరుపబడ్డైనె.

అతని ముఖం నలువైపులా చూస్తూ ప్రకాశించింది.

"నేను శిల్పితో మాట్లాడుదామని అనుకోలేదు," అన్నాడు క్రూగర్.

నాన్న మళ్లీ నవ్వాడు. "నేనేదో చూడడానికి వచ్చిన దగ్గటి ఊరివాడ్ని. మిస్టర్ కింగ్స్లే 'శిల్పి' అని చెప్పి యుండ కూడదు. నేను శిల్పం నేర్చుకోలేదు. పాత యిండ్లంటే నాకు ప్రియం. గ్రామంలో వుండే నా పాత యింటిని నీకు చూపుదామనుకొంటున్నా. అది యింత బాగా లేకపోయినా, ఈ మాదిరే వుంటుంది—అందంగా."

మిస్టర్ క్రూగర్ పెద్ద స్వరంతో చెప్పాడు. "మిస్టర్ గారట్సన్! మీరంతా శ్రమ తీసికొని ఇక్కడికి రావడం సంతోషం. నా భార్య మిమ్మల్ని చూడదలచుకొంది. ఆవిడే

యీ యింటిని కొన్నది. నేను పట్నానికి దూరంగా వుందని, పాడుబడ్డదని, కొత్తది కట్టడమే నయంగా వుంటుందని చెప్పాను. నిజంగా ఇది అందంగా వుంది. నీకుగూడ అలాగే వుందని నీ ముఖం చూచి తెలుసుకొన్నాను."

"రూముల విషయం ఏమిటి?" అన్నాడు సేత్. ఆ పాత కొయ్యల చెక్కడపు పనిని పాడు చెయ్యడం అవమానకరం అన్నాడు.

మిస్టర్ క్రూగర్, "ఉండడానికి పెద్ద గది కావాలి మరి," అన్నాడు.

"అదే యింటి యొక్క ముఖ్యమైన సౌందర్యం. మార్పు చేయడంవల్ల ఎంతో బాగున్నా, స్వతస్సిద్ధాన్ని పాడు చేసిన వాళ్లవుతారు.'' ఈ మాటలు కళాసక్తితోనున్నవి. అవి మ్యూజియం (ప్రదర్శనశాల)లో నుంచదగ్గవి.

న్యాయంగా ఆలోచిస్తే, క్రూగర్ మంచి వెలుతురు, దృశ్యాలు ఉండే పెద్ద గదిని కోరడంలో తప్పులేదు. అతడు విరుద్ధ భావాలు లేకుండా, కుటుంబాన్ని స్థిరపరుచుకోడానికి గ్రామ జీవితంపై ఇష్టంగలిగిన సాధారణ వ్యక్తిగా నాకు అగుపించాడు. కాని, నాన్న మాటలు నన్ను కదలించినయి. దానిలోని విషయంవల్ల గాదు; ధర్మంవల్ల గాదు. దానిలోని మార్దవం, గంభీరతవల్ల. తాతయ్య చనిపోతున్నప్పుడు అతనెలాగున్నాడో గుర్తుంది. నేనతని గురించి భయపడి, నిరసించేస్తున్న చివరి క్షణంలో ఎంత అందమైన రూపంలోకి మారాడో నాకు జ్ఞప్తి వున్నది. తన సొంత వాళ్లను గురించి

తెలుసుకోలేదేమో గాని, ఈ ప్రైవేట్ గృహంలో రాండల్ గారట్సన్‌ను చూచే విచిత్రానుభవం గలిగింది. అతడు తన శక్తి సామర్థ్యాలనుపయోగించి మాట్లాడాడు. "హెన్రీ మిల్లర్ ఈ యింటిని కట్టాడు. నిజంగా ఎవరు కట్టారో తెలుసుకోడానికి ప్రయత్నించాను. కొయ్యలను సమం చేసి, కోసి, చెక్కి చీలలను ఎవరు కొట్టారో? హెన్రీ మిల్లర్ తన పనివాండ్లు లేకుండా అతడు పనికిరాడు. మిస్టర్ కింగ్స్‌లే! మీ తాతలెవరైనా వున్నారా?"

"బహుశా వుండవచ్చు. అది చక్కని పనితనం. సందేహం లేదు. ఇంకా ఎందఱో వడ్రంగులు అందంగా చేసే వాండ్లున్నారు. కాని, వాండ్లకు అవకాశం దొరకదు."

మిస్టరు క్రూగర్ మాకు కొంత దూరాన్నుంచి పోతూ మాట్లాడాడు. "ఆ విషయాన్ని నా భార్యను అడుగుతాను. పురాతన వస్తువులంటే ఆమెకు ఇష్టం. కాని, నేను మాత్రం మ్యూజియంలో వుండదలచలేదు. నా వుద్దేశ్య మేమిటంటే— మంచి సౌకర్యాలతో అనుభవించి, ఆనందింపగలిగే యిల్లు వుండడమే — —"

అసలు ప్రశ్న యేమంటే, పూర్వీకుల సుందర శిల్పాన్ని అలాగే వుంచటం మంచి పనేనా? అని అన్నాను.

అతడు కొంచెంసేపటికి ఒక విధమైన హాస్యంతోను, ఉత్సాహంతోను చెప్పాడు. "నీవు బాగా చెప్పావు రాల్ఫ్! నా పద్ధతి మానవ విరుద్ధమైనది."

"సరే," అన్నాను.

"ఒక విధంగా నాకు తోస్తున్నది. నీవు మిస్టర్ క్రూగర్ జీవిత చిహ్నంగా వున్నాడని తలచినట్లున్నావు. ఆ యింట్లో జీవం లేదు. నాకు ఆ యిల్లు సజీవంగానే వుంది. క్రూగర్ కుటుంబంగాదు–దానికి ప్రాముఖ్యం? క్రూగర్లు సౌఖ్యంగాను, సంతోషంగాను జీవించడానికి నా ఆటంకమేమీ లేదు. కాని, ఈ ప్రైవేట్ గృహం వాళ్ల ఉద్దేశ్యాలకు తగినట్లుగా కట్టబడ లేదు..."

"ఎవరి అభిప్రాయాలకూ తగినట్లుగా లేదు."

"అల్లారా రాల్ఫ్! కొన్ని శాశ్వతమైనవని నీకూ, నాకూ తెలుసు. ఈ యిల్లు అట్టి వాటిలో ఒకటి. ఇది ఆశయాలు అనే బుద్ధి, ఆత్మల కలయిక – – దాని ప్రతిరేఖ. మానవుని ఆశయాలను తెలుపుతుంది. స్థిరమైనదాని ముందు – అస్థిరమైన క్రూగర్ కుటుంబపు కోరికలను తీర్చటమనేది అసంగతం. వాళ్లు వందలకొలది యిండ్లలో ఇముడుతారు. కాని, ఈ యింటిని ఒకసారి నాశనం చేస్తే, నీవు దానిలోని మనుజుని విలువను మళ్లీ తేలేవు.

ఒక మాటమీద నిలబడడం లేదని అన్నాను.

"నీవు మీ మేహాలిష్టరు అత్తయ్యను గుర్తుకు తెస్తున్నావు. ఆవిడ నన్ను గొడవల్లోకి లాగేది. ఇప్పుడు నా విలువను నిలువ పెట్టుకోవాలని లేదు. నా కట్టి విలువ లేదు. నేను వస్తువులను అను కొన్నట్లుగా చేసేవాడ్ని."

తరువాత మేమిద్దరం కలిసి, కామ్టన్ వీధిలో వెళ్లు తుండగా నాన్న నా వుద్దేశ్యాలను గురించి ప్రశ్నించాడు. "ఈ ప్రశ్నలడిగినందుకు మన్నించు. ఈ విషయాన్ని నేనింతకు ముందే మాట్లాడియుండాలి. మనకున్న ఆస్తి అంతా ఇక నాది కాదు, నీది -- అంటే కుటుంబానిది. ఇటువంటి సందర్భానికై కొంత డబ్బునుగూడ కూడబెడుతున్నాను. ఆ డబ్బంతా నీ కిస్తాను. ఇంతకంటే నేను కోరదగినది అంతగా లేదు—"

అప్పటికి మేము మా యింటి ముందుకు వచ్చాము. నాన్న వేగంగా తలుపు దగ్గఱ నిల్చి, "నీవు రావడానికి అనుమతిస్తారనుకొంటాను రాల్ఫ్!" అంటూ తెల్లటి తలుపును తెరచి, హాస్యాస్పదంగా వంగి, 'లోపలికిరా, లోపలికిరా' అన్నాడు. తన చేతి కర్రను వూపుతూ, నేను ఇకిలిస్తు పసుపు పచ్చని హాల్లోకి అడుగుపెట్టాను.

ముగింపు.

ప్రేమ అన్నిటినీ జయిస్తుంది అని చెప్పడం మంచిది. మేము సంతోషంగా నగరంలో క్లిక్ ఆఫీసు మిద్దెమీది మూడు గదుల యింటిలోను, పడమర కామ్టన్‌కు పోయే దారిలో $1\frac{1}{2}$ మైలు దూరంలో-ఒక మిద్దె యింట్లో-ఒంటరిగాను, గారట్సన్ కింగ్స్ లేల చేత కట్టబడి, గారట్సన్ తన భాగానికిగాను కొంత ధనం చెల్లించే నాలుగు గదుల యింటిలోను-(ఈ మూడిండ్లలో) ఉండేవాళ్లం.

నేను జీవితంలో అన్యాయమైన లాభాలను పొందుతున్నానని అప్పుడప్పుడు అనుకొనే వాడిని. నేను వస్తువులను

సంపాదించకుండానే తీసికొనే వాడిని —- మిసస్ కింగ్స్ల హృదయము, సేత్ పనితనం, ఇంకా ఎన్నో?—ఆ పాత అంగడిని మంచి పనిముట్లతో నింపి, ఒక చిన్న బోర్డును బయట తగిలించాము. అప్పటికి మా పేరు చాల దూరం వ్యాపించింది. మనుష్యు లెంతో మంది విలువైన వస్తువులతో, మంచి ఆలోచనలతో, ఆశయాలతో వచ్చేవారు. ప్రతివాడు సేత్ మంచి నైపుణ్యంగలవాడని తెలుసుకొన్నాడు - ఆ విషయాన్ని సేత్ గ్రహించిన దానికంటె ఇతరులే బాగా తెలుసుకొన్నారు. మేము చేసిందంతా తృప్తిగా పని చేయడమే. వ్యాపారం బాగా వృద్ధి నొందింది.

కాని అన్నిటి కన్నా అన్యాయంగా, లాభం పొందిన విషయాన్ని నేను కొంచెం వేగంగాను, రహస్యంగాను చెప్ప వలసి వుంది. అది క్రిస్టీనా విషయమే. ఎవ్వరు దాని నిజాన్ని తెలుసుకో లేరు. ఈ చిన్న ప్రశాంతము-శాశ్వతము-అందము నైన ప్రదేశం; ఉపయోగించే కొయ్యలు, లోహాలు, పనిముట్లు; మా ఆలోచనలు - ఆశయాలు; - వీటి కన్నిటికి వెనుకనున్న ఆత్మ క్రిస్టీనాది. ఆవిడ ఈ వస్తువులనంతా తన బాధ్యతలోకి తీసుకొంది. చులకనైన భావంతోగాదు; స్కాట్ల యొక్క తీవ్రోత్సాహంతో, ఆ ప్రదేశాని కనుకూలమైన కాఠిన్యంతో, ఆ జన్మ కళాకారుడైన అతని కల్పనా శక్తితో పని చేసింది. సేత్ గూడ ఆశ్చర్య పడేటట్లు అంగడికివచ్చి పని చేసేది. ఎంత కష్టమైన పనినైనా వారాలకొద్ది చేసేది. చిన్న పనిని గూడ శ్రద్ధతో చేస్తుంది. పని చేస్తుంటే గమనిస్తుంది. ఆవిడ ఇప్పుడు

ప్రేమలో పడ్డ స్త్రీ భర్త ప్రేమయే గాదు. ఆవిడ క్రమంగా అందంగాను బలంగాను తయారయింది. ఎప్పుడు అలా వుండేది

నాన్న చనిపోయే దాక అప్పు డప్పుడు మా యింటికి వస్తుండేవాడు. అతడు తన జీవితాన్నంతా వృధాగా గడిపాననే వాడు. తన చిన్న తనంలో గొప్ప ఆశయా లుండీ కూడ తగిన అనుభవం లేకుండా ఉన్నాడట. ఈ వయస్సులో ప్రతి వస్తువును గమనిస్తున్నా నన్నాడు. పోయిన సారి వచ్చినపుడు అతని రూపాన్ని చూచి నాపిల్లలు మంచిదయ్యాం అనేవాళ్లు. అతడు ఆ స్థలంలో తిరుగుతూ హాస్యంతో సురుకైన బుద్ధితో పిల్లవాడిలాగ పరీక్షించేవాడు. చివరకు ఆ మొండలో చేతులో గొడ్డలి పట్టుకొని మెట్లపై కూర్చున్నాడు. అతడు దాని బరువును చూచి, ఉక్కును తాకి చూచి, దాని పిడిమీద రెండు చిటికలు వేశాడు. "నేను దీన్ని ఉపయోగించడానికి నేర్చుకొనే వయస్సును దాటాను. నిజంగా కాలమే వుంటే నీ వెంతో నేర్పవచ్చును రాల్ఫ్?" అంటూ తన మనుమలను చూచి సంతోషంగా నవ్వాడు.

